శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణే నమః

# బ్రహ్మతేజోబలము

లేక

# విశ్వామిత్ర చరిత్రము







రచయిత:

మేడవరము సుబ్రహ్మణ్యశర్మ

శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణే న

# బ్రహ్మతేజోబల

లేక

# విశ్వామిత్ర చరిత్రమ





ఒంగోలుజిల్లా దర్శితాలూకా పోలేపల్లి అ

మేడవరము సుబ్రహ్మణ్యశర్మ



గ్రంథకర్త :

మేడవరము సుబ్రహ్మణ్యశర్మ

జననము :- సాధారణ వైశాఖ బ ౭ మంగళవారము

31-5-1910.

శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణే నమః

# పరిచయవాక్యములు

శ్లో. ఆశైశవా ద్రఘువరాంఘ్రిగతం మనో మే;
సత్యం బ్రవీమి; న హి కశ్చి దిహోపదేష్టా;
రామః పితేతి, జననీ జనకాత్మ జేతి
మూఢప్రపత్తి రుదితా; విగుణో గుణో వా. (మదీయ సీతాస్తోత్రరత్నే)

శ్లో. నమ స్తస్మై కస్మైచన భవతు నిష్కించినజన
స్వయంరక్షాదీక్షా సమధిక సమింధానయశసే,
సునాసీర స్వైర క్షణకుపిత శాపాయుధవధూ
దృషత్తా దుర్జాత ప్రశమన పదాంభోజరజసే. (ప్రాచీన కవిసూక్తిః)

ఎవరిపిచ్చి వారి కానందము! నే ననుదినము పారాయణముఁ జేయు శ్రీమద్రామాయణములో విశ్వామిత్రకథాఘట్టము వచ్చినపు డెల్ల ననుకొనుచుండువాఁడను, 'చక్కఁగా దిద్ది తీర్చఁగలవారి కిది యొక మంచి కథావస్తు' వని.

---

నేను చిన్ననాఁట హరికథలు చెప్పుచు కర్నూలుజిల్లాలో విశేషపరిచయము సంపాదించుకొని యుంటిని. ఒకనాఁడు డోన్ తాలూకా వెల్దుర్తిలో సుప్రసిద్ధపౌరాణికులును, నాకుఁ జిరపరిచితులు నగు శ్రీ పాణ్యాం గుండయ్యగారు ప్రస్తావవశమున ఈ విశ్వామిత్రకథాభాగమును బ్రశంసించి తామును, తమ యన్నగారగు శ్రీ నరసరామయ్యగారును దీని నొక కావ్యముగాఁ దెలుఁగున వ్రాయఁదలఁచి మొదలిడితి మని చెప్పి కొన్నిపద్యములు వినిపించిరి. 20, 30 పద్యములు మాత్రమే వ్రాసిరఁట. ఏకారణముననో దీనికి విఘ్నము వచ్చి విరమించి చాలకాల మైన దని చెప్పి మీరు దీనిని వ్రాసిన బాగుండు నని నన్నుఁ బ్రోత్సహించిరి. కాని నక్క యెక్కడ? నాకలోక మెక్కడ? అని నేను నిస్పృహుఁడనై యుంటిని.

కొంతకాలమునకు దైవప్రేరణమున రామదేవునిఁ గృతిపతినిగా, విశ్వామిత్రునిఁ గథానాయకునిగాఁ జేసి యొకగ్రంథమును బొందుపఱచిన బాగుండునేమో యని యొకసంకల్ప మొదవినది. అట్లే రామానుగ్రహమున ఈ గ్రంథము సంతరింపఁబడినది.

విశ్వామిత్రునికథ ఆమూలాగ్రముగ నేగ్రంథములోను నా చూచినంతలో నొకచోఁ గనఁబడలేదు. కొంతవఱకు రామాయణములోనే యాద్యంతములతో నున్నది. రామాయణమే నాయీ గ్రంథమునకు మాతృక. అందులో లేని కథలు కొన్ని యితరగ్రంథములనుండి గ్రహింపఁబడినవి.

హరిశ్చంద్రునికథ మార్కండేయపురాణము ననుసరించి వ్రాయఁబడినది. గాయత్రిని విశ్వామిత్రుఁడు శపించుట వృద్ధపరంపరానుస్యూతముగా విన్నకథ. దీనికి గాయత్ర్యనుష్ఠాన తత్త్వప్రకాశిక యొక్క ప్రమాణము. పశ్చాత్తప్తుఁడైన విశ్వామిత్రుని నాజగదంబ యనుగ్రహించిన దన్నకథకు సంధ్యావందనమే ప్రమాణము. విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షిత్వమును సంపాదించుకొన్న ఘట్టమున నిందులో నావ్రాసిన పంచాయతి కథనము పెద్దలవలన విన్నయాభాణకమే. దీనికి సూత్రప్రాయముగా రామాయణములో నాధార మున్నది. దేవర్షిగణపరివృతుఁడై పోయి బ్రహ్మర్షివైతి వని బ్రహ్మ చెప్పఁగా వసిష్ఠుఁడు వచ్చి దీని నంగీకరింపవలయు నని విశ్వామిత్రుఁడు కోరినట్లును, దేవత లాహ్వానింపఁగా వసిష్ఠుఁడు వచ్చినట్లును, వసిష్ఠ విశ్వామిత్రు లుభయులు పరస్పరము గారవించుకొన్నట్లుగా రామాయణములోఁ గలదు.

వసిష్ఠ విశ్వామిత్రుల వైరమును గూర్చి యభూతకల్పనలుగా నన్నో కథలు వినుచుందుము. అట్టివి ఆర్ష గ్రంథములలో సూత్రప్రాయముగానైనఁ గాన్పింపకపోవుటతో అట్టివి గ్రహింపఁబడలేదు. ఇంకను నిరాధారములైన కథ లనేకములు చెప్పికొనుచుందురు. కాని అట్టివిగూడ గ్రహింపఁబడలేదు. భారతమునసైత మీఘట్టమునఁ గొన్ని కథ లున్నవి. కాని వానిలో రసనిష్పత్తి కాతంకములు ఔచిత్యమునకు వ్యాఘాతములుగాఁ దోఁచెడి కథలను దడవుకొనలేదు. ద్వాదశవార్షికవీరక్షామమున విశ్వామిత్రుఁడు చండాలువింట కుక్కమాంసము దొంగిలించి తినుటకుఁ బాల్పడఁగా ఆ చండాలుఁ డనేకధర్మములు చెప్పి నివారించినపుడు విశ్వామిత్రుఁడు

చౌర్యదోష మంటకుండ నిమ్మని యిప్పించుకొని, యింటికిఁ దీసికొని పోయి భార్యచే వంటకము చేయించి దేవతానివేదనము చేయక తినరాదని వైశ్వదేవముచేసి యింద్రాదులకు నివేదింపఁబూనఁగా దాని నారగింపరోసి వారు వర్షము కురియించి లోకముల కాప్యాయనము చేసినట్లు వ్యాసభారతములో నుండఁగా తిక్కన 'చండాలుఁడు... నీవలచిన యట్లుసేయు మని సారమేయమాంసం బిచ్చినం బుచ్చుకొని దానం బ్రాణంబులు రక్షించుకొని విశ్వామిత్రుండు సనియె. నింద్రుండు తదనంతరంబ లోకంబులు వడదేఱ వర్షించె' (శాంతి తృ. 303) నని వ్రాసియున్నాఁడు. ఈ యపప్రథయే ఆంధ్రలోకమున వ్యాపించి యున్నది. నేను వ్యాసభారతమునే అనుసరించితిని. సప్రమాణములైన కథాసంవిధానములలో రసానుగుణ్యముగా నక్కడక్కడ నాభావన కందినంతవఱకు పెంచి విపులీకరించియున్నాను.

శ్రీరామచంద్రమూర్తి నాబుద్ధి కందించినంతవఱకు వ్రాయఁ గల్గితిని. ఇందు ద్రపయత్నపతితమై గుణలేశ మేమేని గన్పట్టినచో సహృదయులు గ్రహింతు రని యాసించుచున్నాను.

నాయభ్యర్థనమును రిత్తవుచ్చక సాదరమేదురమైన హృదయముతో ఈ గ్రంథమునకు సమీక్ష యొనర్చి పంపిన బ్రహ్మశ్రీ విద్వచ్ఛిరోమణి అవధానము చంద్రశేఖరశర్మగారికి (పొద్దుటూరు, ఓరియంటల్ కాలేజి లెక్చరర్) నేఁ గృతజ్ఞుఁడను.

నాయీపొత్తమునకు ముద్రణకార్యక్రమములో (ప్రూఫులు చూచుట మొదలగువానిలో) సర్వతోముఖముగ సాహాయ్యము చేసిన బ్రహ్మశ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారి యుపకృతి సుదుష్ప్రతికరము. దీనికి రామాయణమున హనుమంతునికి శ్రీరామచంద్రమూర్తి చెప్పికొనిన

"య దిహాస్య ప్రియాఖ్యాతు ర్న కుర్మి సదృశం ప్రియమ్.
ఏష సర్వస్వభూతో మే పరిష్వంగో హనూమతః." (యుద్ధకాండ ప్ర. స. ౧౩)

అన్న కృతజ్ఞతోక్తి (సర్వస్వభూతమైన యాలింగనము) ఒక్కటియే నా సమర్పించుకొనునది. ఇదియు నా కిక్కడ ననుకూలింపదు.

శ్రీ శాస్త్రిగారు నాకంటె వయోవృద్ధులు, విద్యావృద్ధులు, జ్ఞాన వృద్ధులు గనుక. ఇఁక నాకు మిగిలినది జీవితాంతము కృతజ్ఞత గలిగి యుండుటయే.

ఇఁక ముద్రణవిషయము :—నాయీ గ్రంథరచన కించిదవశిష్ట ముగఁ బూర్తియయినప్పు డొకనాఁడు నంద్యాలతాలూకా పెసర వాయిగ్రామములో బ్రహ్మశ్రీ తెల్కపల్లి వేంకటరమణ సిద్ధాంతి గారు కొంతభాగము విని 'ముద్రణప్రయత్న మే మనుకొంటి?' రని నన్నడిగిరి. 'బహుద్రవ్యసాధ్యమైనది గనుక వట్టిచేతులతో నే నేమి చేయఁగల్గుదును? అన్నింటికి ఆ శ్రీరామచంద్రమూర్తియే కర్త' అని నేను జెప్పితిని. 'పురుషప్రయత్నమే లేకుండ ఆ భగ వానుఁడు మాత్ర మేమి చేయఁగలఁడు? ప్రయత్నించండి. ఆశ్వాస మున కించుమించు రెండువందలరూప్యములైన అచ్చు కావచ్చు. ఆ పాటిదాతలు లేకపోలేదు. ఇదిగో నేను రెండువందలరూప్యము లొసఁగుచున్నా' నని చెప్పి తా మొసఁగుటయేగాక నందికొట్కూరుతాలూకా గని గ్రామమునకుఁ బిలుచుకొనిపోయి అక్కడ శ్రీ కలుగొట్ల సుందరరావుగారిచేత రెండువందలరూప్యము లిప్పించిరి. ఇంతియేగాక 'యీ ప్రయత్నములోనే లోగడ మీరు వ్రాసియున్న భక్తకల్పద్రుమశతకమునుగూడ అచ్చువేయించు ప్రయత్నమును జూడుఁ' డనిగూడ హెచ్చరించిరి.

శ్రీ సిద్ధాంతిగారి చేతిచలువతో తరువాత ఆ శ్రీరామచంద్ర మూర్తి యనుగ్రహమున అయాచితముగనే రెండుమూడువందల రూప్యము లొసఁగెడి దాతల వాగ్దానములు లభించెను.

గ్రంథము పూర్తియై ముద్రణప్రయత్నము చేయునప్పటికి 3, 4 సంవత్సరములు గడచెను. అప్పటికి తామడాంబరము, ప్రతి వస్తువు మింటఁ బలుకుటయుఁ గాఁగా అనుకొన్న అంచనాలో గ్రంథ ముద్రణము పూర్తికాఁజాలదన్న యాందోళనతోనే అచ్చు వేయించు చుండఁగా నా యాందోళనమును దెలిసికొని నందికొట్కూరు తాలూకా మిడుతూరు జిల్లాపరిషత్ హైస్కూలు తెలుఁగుపండి

తుఁడు శ్రీ జే. మల్లికార్జునరావుగారు మిడుతూరుగ్రామములో పెద్ద శ్రీమంతుఁడు గాకపోయినను ఔదార్యవంతుఁడైన శ్రీ సురభి మల్లికార్జునశ్రేష్ఠి యను వైశ్యరత్నమునకు ఒక యాశ్వాస మచ్చు వేయింపవలసిన దని చెప్పిరఁట. శ్రీ శ్రేష్ఠిగారు సమ్మతించియు ప్రస్తుతకాలపరిస్థితులు గమనించినవారు గాన రెండువందలరూపాయలతో నేమగు? నని రావుగారితో సంప్రతించుచుండఁగా శ్రేష్ఠిగారి భార్య శ్రీమతి సుభద్రమ్మగారు అరగొర యేమి యింకొకవందచేర్చి యీయవలసిన దని చెప్పిరఁట. వెంటనే శ్రీ శ్రేష్ఠిగా రదిపనిగా వచ్చి మూఁడువందల రూపాయలు సమర్పించిరి. అప్పుడు నా కనిపించినది 'కలియుగములోఁగూడ కృతయుగధర్మమును నడిపెడి సత్పురుషులున్నారు గదా' అని. 'అభిగమ్య కృతే దానమ్' అని తానై వచ్చి దానముచేయుట కృతయుగధర్మ మనిగదా చెప్పఁబడినది!

చెప్పికోఁదగిన మఱొకవిశేషము :- ద్రవ్యదాతల సాహాయ్యమింత లభించినను ముద్రణ వ్యయమున కింకను కొఱఁతవడునట్లున్న దే యని మే మనుకొనుచుండఁగా శ్రీ మల్లికార్జున శ్రేష్ఠిగారు 25-9-73 నంద్యాలకు వచ్చి యెట్లు విన్నారో మఱి 50 రూపాయలిచ్చిపోయిరి.

ఈ గ్రంథముద్రణమునకు తోడ్పడిన ద్రవ్యదాతలపట్టిక ప్రత్యేకముగాఁ గూర్పఁబడినది.

ఈవిధముగా స్వపరహస్తములతో ద్రవ్యసాహాయ్యము చేయించి, యెట్టకేలకు నాయీగ్రంథమును నీ రూపముతో పాఠకలోకమున కందఁజేయించిన శ్రీరామచంద్రమూర్తి నాయీగ్రంథ ప్రచురణమునకై తోడ్పడినవారల కందఱకును పరమశ్రేయములు ప్రసాదించుఁగాక యని ప్రార్థించుచున్నాను.

ఇఁక శతకము మాట యేమో శ్రీరామచంద్రమూర్తియే యున్నాఁడు. ఇప్పటి కివే ధన్యవాదములు.

పోలేపల్లి అగ్రహారము
దర్శితాలూకా ఒంగోలుజిల్లా
25-9-73

ఇట్లు,
మేడవరము సుబ్రహ్మణ్యశర్మ.

శ్రీః

# సమీక్ష

యత్పాదాబ్జరజస్సంగా ద్యాతి గ్రావాఽపి చేతనామ్ ।
త మహం సచ్చిదానందకమనీయ ముపాశ్రయే.

---

"కావ్యం తు జాతు జాయేత కస్యచిత్ ప్రతిభావతః"

అని యభిజ్ఞులసూక్తి. "రసవంతమై నిజముగా కావ్య మని చెప్పఁదగిన రచనము అరుదుగాఁ గలుగును. దానిని నిర్మింపఁగల ప్రతిభాశాలియును అరుదుగనే జన్మించును." అని దాని భావము. ఆంధ్రదేశము దీనికి అపవాదముగా స్థూలదృష్టికి గోచరించును. కాని సూక్ష్మముగాఁ బరిశీలించినచో ననుదినమును తెలుఁగు సీమలమున నసంఖ్యాకములుగా వెలువడుచున్న వివిధ రచనములలో కావ్యసంజ్ఞ నందఁజాలినవి వ్రేళ్లమీఁద లెక్కింపఁదగినవి మాత్రమే యనుట సత్యదూరము గాదు. అట్టివానిలో బ్రహ్మశ్రీ మేడవరము సుబ్రహ్మణ్య శాస్త్రిగారు రచించిన "బ్రహ్మతేజోబల" మను నీ కావ్య మొకటి.

శ్రీ శాస్త్రిగారు ఇంతకు మునుపే 'శరణాగతి' యను ఖండకావ్యమును, 'భక్త కల్పద్రుమ' మను శతకమును ఆంధ్రమునందును, 'రామ స్తవ నక్షత్రమాల', 'సీతాస్తోత్రరత్నము' అను లఘుకృతులను సంస్కృతమునందును రచించి యుభయభాషాకవనచాతుర్యమున సిద్ధహస్తు లనిపించుకొన్నారు. (చూ. ప్ర. 9. 10-ప.) పదునాలుగేఁడుల ప్రాయముననే సాహితి స్వాయముద్భవ మందఁగా సంస్కృతాంధ్రములఁ గవనశక్తి గలిగి స్వాయముగా హరికథలను రచించి చెప్పుచు కొల్లాపురాది సంస్థానములందు సత్కారము లందుకొన్నారు (ప్ర. 17-ప.) ఇట్లు ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసముల సమగ్రతచే మహాకావ్యరచనమునకు నుత్తమాధికారమును సంపాదించుకొన్నారు.

పౌరాణికము లగు నుపాఖ్యానములలో విశ్వామిత్రుని చరిత్రము విలక్షణమైనది. దైవికము లగు కారణము లెన్ని యున్నను నాతని జీవితమునఁ బురుషకారమునకే సామ్రాజ్యము. అసాధ్య మనునది యాతని కోశమునసే లేదు. ఆ సాధకోత్తముని యమోఘ సంకల్పమునకు దైవమే శిరము వంచినది. తన కాలమున నెవ్వఁడును సాధింపఁ జాలని ఘనకార్యమును ఆతఁడు సాధించినాఁడు. బాహ్య శత్రువిజయమే పరమార్థముగాఁ గల క్షాత్త్రమును కోడెనాగు కుబుసమునట్లు దూరముగఁ ద్రోసిపుచ్చి యాతని జ్ఞానదృష్టి యంతశ్శత్రువులను గాటుగొన్న విధము అనన్యసాధారణమైనది. రాజి, రగిలి, మండి, మసిచేసి, యణఁగి, బూడిదయైన యాతని క్రోధమునుండి యపూర్వ చకచ్చకితమైన జ్ఞాన విస్ఫులింగము భాసించినది. వ్యథిత వ్యథితోన్మథితమైన యాతని హృదయ విశ్వాసములో దైవసంకల్పమునకుఁ బ్రతీకమై యువ్వెత్తున నుప్పతిల్లిన యంతర్వాణిని "ధిగ్బలం క్షత్త్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్." అని యాదికవి ప్రతినదించినాఁడు. అందలి ప్రాణనాడియే 'బ్రహ్మతేజోబలము' ఈ యుపక్రమముతో,

> "నీ దయకల్మి గాధిసుతునిం బదిలోఁ బవొకండు నాక బ్రి
> హ్మాదులె మెచ్చి రన్న సుమహత్తరకీర్తియు బ్రహ్మతేజమున్
> బాదుకొనెన్." (7, 117)

అన్న విశ్వామిత్రుని సంతృప్తి వాక్యములోని యుపసంహారమును సమన్వయించి శ్రీ శాస్త్రిగారు గ్రంథనామమును 'బ్రహ్మతేజోబలము'గా సంధానించినారు.

ఇందలి బ్రహ్మక్షత్త్రియములు సత్త్వరజస్సులకుఁ బ్రతీకములు; జాతి గంధశూన్యములు. అనాదికాలము నుండియును భౌతికాహంకారము అంతశ్శక్తికి ముందు మోకరిల్లుటయే భారతీయ సంస్కృతికి జీవము. సంకుచిత దృష్టితో దానిని అన్యథా వ్యాఖ్యానించుట యా సంస్కృతికే యపచారము చేయుట.

ఉదాత్త గంభీర మగు నింతటి యర్థముగల యీ యితివృత్తమును శ్రీ శాస్త్రిగారు శ్రీమద్రామాయణాదు లగు పెక్కు గ్రంథముల నుండియు నేర్చి కూర్చి సంతరించినారు. శ్రీమద్రామాయణమున బాలకాండము 51-వ సర్గము నుండి 56-వ సర్గమువఱకును విశ్వామిత్రచరిత్రము వర్ణితమైనది. భారత భాగవత మార్కండేయ బ్రహ్మాండపురాణములలో నేతత్సంబంధము లగు గాథలు కలవు. దేవీభాగవతమునఁ ద్రిశంకు హరిశ్చంద్రోపాఖ్యానము లున్నవి. వీనిలోని కథాంశములలోఁ గొంత వైవిధ్యమును లేకపోలేదు. శ్రీశాస్త్రిగారు ప్రధానముగా శ్రీమద్రామాయణమునే యనుసరించుచు యథౌచిత్యముగఁ దక్కిన యాకరములనుండి కథాంశములను స్వీకరించినారు.

కథాంశముల యెన్నికయును, పాటించిన క్రమమును, కూర్పు మార్పులును శ్రీ శాస్త్రిగారి పరిశీలనాదృష్టికిఁ దార్కాణములుగా నున్నవి. శ్రీమద్రామాయణమున లేని హరిశ్చంద్రుని వృత్తాంతము మార్కండేయ పురాణము నుండియును, వీరబాహు గాథయును నానుషంగిక మగు చ్యవనుని వృత్తాంతమును మహాభారతము నుండియును గ్రహింపఁబడినవి. మంత్రశాస్త్ర ప్రసిద్ధ మగు గాయత్రీ శాప వృత్తాంత మిందుఁ ద్రిశంకునిచరిత్రమున నింపుగాఁ దావు చేసికొన్నది.

శ్రీ దేవీభాగవతమునందుఁ ద్రిశంకుని చరిత్రమునఁ "త్రిశంకుఁడు (ఈతని మొదటిపేరు సత్యవ్రతుఁడు) ఒక వీరబాహుమున విశ్వామిత్రుని కుటుంబము నాహారదానముచేఁ బోషించె" ననియు, "దానికిఁ బ్రత్యుపకారముగా విశ్వామిత్రుఁ డాతని సశరీర స్వర్గగమనాభిలాషను సాధింపఁ బూనె" ననియు వర్ణింపఁబడినది. కథానాయకుని యవ్యాజకారుణికత్వమును బోషించుటకై కాఁబోలును శ్రీ శాస్త్రిగా రీ కార్యకారణతాకల్పనము నుపేక్షించి రామాయణ మార్గమునే యనుసరించినారు.

మఱియొక విషయము—శునశ్శేపుని చరిత్రము శ్రీ దేవీ భాగవతమున హరిశ్చంద్రునకు సంబంధించినదిగా నున్నది. శ్రీమద్రామా

యణములో నిది యంబరీష సంబంధిగా వర్ణితమైనది. ఈ కథ బహ్వృచబ్రాహ్మణమున హరిశ్చంద్ర సంబంధిగానున్నదనియు, నిట నంబరీష సంబంధిగాఁ జెప్పుట యెట్లు సరిపడు ననియు శ్రీమద్రామాయణ వ్యాఖ్యాత గోవిందరాజ పండితు లొక యాక్షేపమును లేవనెత్తి యంబరీషునకే హరిశ్చంద్రుఁ డను నామాంతర ముండవచ్చు నని యిట్లు సమాధానించినారు.

> "హరిశ్చంద్రో హ వైధస ఐక్ష్వాకో రాజపుత్త్ర ఆస."
> ఇత్యాది బహ్వృచ బ్రాహ్మణోక్తేతిహాస విరుద్ధోఽయం
> కథ ముపపద్యత ఇతిచేత్, అంబరీషస్యైవ హరిశ్చంద్ర
> ఇతి సంజ్ఞాంతర మి త్యవిరోధాత్." —గోవింద-వ్యాఖ్య:

హరిశ్చంద్రనామములు పలువు రుండుట యసంభావ్యము కాదు. కావునను ఒక హరిశ్చంద్రుని కథ మఱియొకచోట వచ్చును గావునను వైవిధ్యమునకై శ్రీ శాస్త్రిగారు రామాయణమునే యనుసరించి రని తోఁచును.

గాలవుని కథ యొకటి విశ్వామిత్ర చరిత్రమునకు సంబంధించినది మహాభారతమునఁ గలదు. అది యిది. "గాలవుఁ డను మునికుమారుఁ డొకఁడు విశ్వామిత్రునివలన విద్యల నభ్యసించి యాతనిని గురుదక్షిణ కోరుకొను మని బలవంతము చేసెను. అతఁడు కోపించి శరీర మంతయును దెలుపును నొక చెవి నీలిరంగును గల గుఱ్ఱములను నెనిమిదివందలను దెచ్చి యిమ్మని కోరెను. గాలవుఁడు తిరిగి తిరిగి యట్టి గుఱ్ఱముల నాఱువందలను, తక్కిన రెండు వందలకు బదులుగా యయాతి పుత్త్రిక యగు మాధవిని సంపాదించి తెచ్చి గురుదక్షిణగా సమర్పింపఁగా విశ్వామిత్రుఁడు పరిగ్రహించెను. ఆతనికి మాధవి వలన అష్టకుఁ డను కుమారుఁడు జన్మించెను" అని. నీరస మని కాఁబోలును శ్రీ శాస్త్రిగారు దీనిని గ్రహింపలేదు. ఇట్లే సరస్వతీ నదిని బంపి విశ్వామిత్రుఁడు వసిష్ఠుని తనయొద్దకు రప్పించుకొనె నను భాగవతగాథను, రసగంధము లేనివియు నాయకునకు నుత్కర్షమును గలిగింపనివియు నగు మఱికొన్ని గాథలనుగూడ వీరు త్యజించిరి. "ఇతివృత్తమును మాత్రము నిర్వహించుటవలనఁ గవికి

ఎట్టి ప్రయోజనమును లేదు. ఏల యన నితిహాసాదులవలన నది యింతకుముందే యేర్పడి యున్నదిగదా!; కావున "కవి యన్నివిధములను రసపరతంత్రుఁడే కావలెను." అన్న పెద్దల యనుశాసనమున కిది యెంతయును దగియున్నది.

మేనకా వృత్తాంతమున విశ్వామిత్రుఁడు మేనకను జూచిన వెంటనే సమ్మోహాన మగు నామె రూపమునకు వశుఁడై యామెను జేపట్టినట్లు ఆదికవి నిబంధించినాఁడు. విశ్వామిత్రుఁడు తన ప్రమాదమును గుర్తించి సవరించుకొనకుండుటకు నిట్టి యవ్యవధానమే మేలని తలఁచుట యార్షదృష్టి. పరాశరాదుల కథలలో వ్యాసాదుల భావనయు నిట్టిదిగనే కాన్పించును. అయోగ విప్రలంభమున నుత్సుకతను పెంచుటకు శ్రీ శాస్త్రిగారిచటఁ గొంత వ్యవధానమును, ద్వితీయ సందర్శనమును గల్పించినారు. ఇది కొంతవఱకు శిల్పదృష్టి కావచ్చును. ఏ దృష్టితోఁ జూచినను రుచిభేదముచే నంతయు సమంజసముగనే యుండును.

శ్రీ శాస్త్రిగారి శైలి సాంప్రదాయికమును సుపరిష్కృతమునైనది. హరికథాకథనమునఁ బ్రాగల్భ్యము నందిన వీరి వాక్పాటవమిట రసనిష్ఠమై మహాకావ్యమైనది. నూఱులకొలఁదిగా నిందుపయోగింపఁబడిన లోకోక్తులును, జాతీయములును సంస్కృతాంధ్ర సాహిత్యములలో వీరికిఁ గల యపారమగు పరిచయమును వెల్లడి చేయుచున్నవి. "తడిసిగాని గుడిసెఁ గప్పరు." (ప్ర. 280), "అయ్య రాకున్న నమవస యాఁగునొక్కొ" (ద్వి. 111), "డబ్బు వెట్టి యాబ్దికము గొన్న వెడఁగు" (తృ. 97) వంటి నిత్య వ్యావహారికములగు లోకోక్తు లిందు రమణీయముగఁ గుదురుకొన్నవి.

ఛందశ్శిల్పమునను శ్రీ శాస్త్రిగారు ప్రశంసింపఁ దగిన నైపుణ్యమును ప్రదర్శించినారు. ప్రాయికముగా నాంధ్ర కవులెల్లరును రసభావాది ప్రతిపాదనమునకు బంధము నాశ్రయించినంతగా వృత్తభేదముల నాశ్రయింపలేదు. కాని యసాధారణ వృత్తములను వాడిన చోటులలో వైశిష్ట్యమును వెలయింపకయును పోలేదు. ఆ మార్గము

ననే శ్రీ శాస్త్రిగారును రసభావానుగుణముగా సముచితములైన తావులలో విభిన్నవృత్తములను వెలయించి తమ ఛందశ్శిల్ప చాతుర్యమును ప్రకటించినారు. ద్వితీయాశ్వాసమున విశ్వామిత్రుని యుద్వేగప్రదర్శనమునకు భుజంగప్రయాతమును (ద్వి–55) యాగ సన్నాహ సంభ్రమమును ప్రకటించుటకు ద్రుతవిలంబితములను (ద్వి–82–85) వశిష్ఠ పుత్త్రులపైఁ గ్రోధమును తెలుపుపట్టున మాలినిని (ద్వి–91) దేవసంఘము బెదరులో భుజంగప్రయాతమును (ద్వి–127) నిబంధించినారు. అట్లే పాశుపతప్రయోగోపద్రవమున స్రగ్ధరను (పం–149) వాడియున్నారు.

అన్నటిని మించినది మఱియొక విషయము. "శబ్దార్థములు తామప్రధానములై జీవిత భూతమగు నర్థాంతరమున కవభాసకములగుట యుత్తమకావ్యలక్షణ మని ధ్వనికారుల నిర్వచనము. రస ధ్వనియే కావ్య జీవిత మని యభినవగుప్తపాదుల పరిష్కారము. ఈ దృష్టితోఁ జూచినచో నిందలి శబ్దార్థములును వాని గుణాలంకారాదులును అన్నియు నొకటే లక్ష్యమువైపు అయఃకాంత కేంద్రమున కాకర్షింపఁబడు నయశ్శకలములట్లు రసైకతానములై పరువులు వాఱుట యాశ్చర్యమును గలిగించును. ఈగుణముచేతనే యిందలి ప్రతి ఘట్టమును పాఠకునకుఁ దుదివఱకును నిలుపులేని పఠనాసక్తిని గలిగించుచున్నది. విశ్వామిత్రావలంబన మగు నుత్సాహము స్థాయిగాఁ బ్రబంధమున నాద్యంతమును వీరరస మంగియై ప్రవహింపఁగా నాయా సందర్భముల నెలకొన్న రసాంతరము లంగములై యుపనదులవలె దానిని బరిపుష్టము గావించినవి.

వశిష్ఠ విశ్వామిత్రుల సంభాషణము, విశ్వామిత్రుని నిర్వేదము, త్రిశంకుని యూర్ధ్వలోక గమనము, వశిష్ఠుని పుత్త్రశోకము, అతఁడు కోడలి కొనరించిన బోధము, చ్యవనుని పరీక్షా ప్రకారము, బ్రహ్మర్షిత్వప్రదానము ప్రత్యేకముగఁ బఠించి యానందింపఁ దగినవి.

సంప్రదాయ విద్వేషులును అక్లేశ యశోలంపటులును నగు పలువురు ఆవేశోత్సాహములతో నాంధ్రసాహితీ రంగము నాక్రమించు

శౌనఁ జూచు నీ కాలమున మేరుధీరులై నిలిచి సాంప్రదాయిక మార్గమున సహృదయ హృదయావర్జక మగు చక్కని కావ్యమును వెలయించిన బ్రహ్మశ్రీ మేడవరము-సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అభినందనీయులును నభివందనీయులును గూడ.

ఇంతటి మహాకావ్యమును నిర్వహించియును శ్రీ శాస్త్రిగారహంకార లేశమును నొందక పోతనామాత్యునివలె మహాభక్తుఁడై

"రాముఁ డెప్పగిది న న్నాడించె నట్లాడెదఁ" ప్ర. 22

అని యుపక్రమించి,

"ఇది యుష్మత్కరుణానుషంగికఫలంబేగావి నా నేరు వ
న్నది గోరంతయు లేదు." ప. 128

అని యుపసంహారమున నాత్మస్వామికి విన్నవించుకొని ధన్య జీవులైనారు.

సహృదయ రసాయన మగు నీ మహాకావ్యము తెలుఁగు నేల నలుమూలల వ్యాపించి యాంధ్ర సారస్వతమున సముచితస్థానము నాక్రమింపఁగల దని విశ్వసించు శ్రీ శాస్త్రిగారినుండి విశ్వశ్రేయము లగు నిట్టి కావ్యములు పెక్కులు వెలువడుఁగాక యనియు నందులకుఁ గావలసిన యారోగ్య భాగ్యాదికమును పరమేశ్వరుఁడు వారికి ప్రసాదించుఁగాక యనియు నాశాసించుచున్నాఁడను.

నాయందలి వాత్సల్యము కారణముగాఁ దమ యీ గ్రంథమునకు సమీక్ష వ్రాయవలసినదిగా నన్నుఁ గోరి నాకీ సేవాభాగ్యమును సమకూర్చి పెట్టిన శ్రీ శాస్త్రిగారికిఁ గృతజ్ఞతా పూర్వకము లగు నా ధన్యవాదముల నర్పించుకొనుచున్నాఁడను.

"సరస్వతీ శ్రుతిమహతాం మహీయతామ్."

ప్రొద్దుటూరు
ప్రమాది భాద్రపద
శుక్ల దశమి
7-9-1973

ఇట్లు
సుధీజన విధేయుఁడు
అవధానము - చంద్రశేఖరశర్మ.

# బ్రహ్మతేజోబలము

## ముద్రణకై సాహాయ్యము చేసిన ద్రవ్యదాతల పట్టిక

| పేరు | ఊరు | తాలూకా | మొత్తం |
|---|---|---|---|
| శ్రీ తెల్లపల్లి వేంకటరమణసిద్ధాంతిగారు | పెసరవాయి | నంద్యాల | 200-00 |
| శ్రీ కే. సుందరరావుగారు | గని | నందికొట్కూరు | 200-00 |
| శ్రీ మామిడేల రామయ్యగారు భార్య శ్రీమతి పద్మావతమ్మగారిచే పుట్టింటి యాస్తినుండి యిప్పించినది | కురుకుంద | .. | 200-00 |
| శ్రీ సృష్టి రామచంద్రయ్యగారు | చెరకుచెర్ల | .. | 200-00 |
| శ్రీ తోటపల్లి పుల్లయ్యగారు గ్రామఫండునుండి యిప్పించినది | ప్రాతకోట | .. | 200-00 |
| శ్రీ మామిళ్లపల్లి హేమాద్రిశర్మగారు | పార్మంచాల | .. | 300-00 |
| శ్రీ సురభి మల్లికార్జునశ్రేష్ఠిగారు | మిడుతూరు | .. | 350-00 |
| శ్రీ పాణ్యం గుండయ్యగారు శ్రీ కొండేటి నాగయ్య, వేంకట శేషయ్య సోదరులచే నిప్పించినది. | నార్లాపురము మజరా వెంకటాపురము | డోన్ | 250-00 |
| శ్రీ విరివింటి శేష శర్మగారు | ఓర్వకల్లు | కర్నూలు | 116-00 |
| శ్రీ చింతలపల్లి వేంకటశేషయ్యగారు పోలకల్లు గ్రామములో భక్తులచే నిప్పించినది | పోలకల్లు | .. | 100-00 |
| శ్రీ చింతలపల్లి వేంకటశేషయ్యగారు గూడూరు పౌరులచే నిప్పించినది | గూడూరు | .. | 50-00 |
| శ్రీ క్రమధాటి వేంకటరామసోమయాజులుగారు శ్రీమతి క్రమధాటి భాగీరథమ్మగారిచే నిప్పించినది. | కొరటమద్ది | నంద్యాల | 50-00 |
| శ్రీ క్రమధాటి వేంకటరామసోమయాజులుగారు శ్రీ బి. నాగేశ్వరరెడ్డిగారిచే నిప్పించినది. | గోరకల్లు | .. | 50-00 |
| శ్రీ డాక్టర్ శివయ్యగారు | ఆత్మకూరు | నందికొట్కూరు | 50-00 |

# విషయసూచిక





శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః.

# బ్రహ్మతేజోబలము
## లేక
# విశ్వామిత్ర చరిత్రము

## ప్రథమాశ్వాసము

శ్రీకల్యాణధరేంద్ర కార్ముకముఁ బూరింపన్ శరస్ఫూర్తి నే
దీ కల్యాణసుసిద్ధి? యం చనియొ తద్భేదంబు పాటించి సీ
తాకల్యాణవిభూతి పెంపున జగత్సౌభాగ్యసంధాయియౌ
నా కారుణ్య రసైక జీవనద మాత్మాకాశసంవాసి యౌ. 1

శా. ఆనందైకనివాస మప్రతిమమాహాత్మ్యం బవిచ్ఛిన్నశో
భానూనప్రతిభాన మస్ఖలదవిద్యాధ్వాంతవిధ్వంస లీ
లా నిత్యోజ్జ్వల భానుమండల మనల్పం బప్రమేయం బెదో
జ్ఞానాకారవిలక్షణం బౌక యఖండజ్యోతి మ వ్యోమముతన్. 2

శా. ఆద్యంతంబులు లేనిదై, సదసద్ధ్రాపత్తికిన్ మూలమై
సద్యఃకోటి సహస్రవిష్టపమహాసర్గప్రణాశక్రియా
విద్యాపాండితి కాలవాలమయి సావిత్రీ-పరాశక్తి-సీ
తాద్యాకారము లొప్పు నాత్మకళ మాయాశక్తి భావించెదన్. 3

మ. చల మేలే? కులకాంత దెంతచలమా! సామే నిడన్ లేదె? నేఁ
దలకెక్కం, దలవంపుఁ గూర్ప నిదిగాదా? యంచుఁ దత్పాదముల్
తల మోపన్, సురగంగ ఘోష లిడ, మందస్మేరయౌ పార్వతిన్
బలిమిం గౌఁగిటఁ గ్రుచ్చు శంకరుని శుంభత్ప్రేమ మ వ్యోముతన్.

శా. నిత్యద్వంద్వవిశిష్ట మయ్యును సదా నిర్ద్వంద్వమున్, సత్యసా
హిత్యభ్రాజితమయ్యు సంగకలుషాపేతంబు, లోకైక సం
స్తుత్యంబయ్యు వచోదురాపము, జగత్పుణ్యానుభావంబు దాం
పత్యశ్రీక శివైకనామక మహఃప్రాగల్భ్య మూహించెదన్. 5

మ. పవిధారల్ పువుపేరులై, తృణకణప్రాయంబులై సర్వదే
వవరాస్త్రంబులు, మృత్యువక్త్రమునకున్ వాకట్టులౌ తత్ప్రభా
వ విశేషంబులఁ జాటు రాఘవ పరబ్రహ్మానుసంధాన సం
భవ వైశిష్ట్య విలక్షణుండగు హనూమంతున్ భజింతున్ మదిన్. 6

మ. అయుతంబున్ బ్రయుతంబు గాఁగ ధనధాన్యాఖండలక్ష్మీమహో
దయముం గోరను, బేరు పెంపునకు నాస్థం జేయ; వేయేటికిన్?
దయ యున్నం బదివేలు కింకరుని పై నాతండ్రి! నీ నంబికొం
డయ నెయ్యం బోకఁ దున్నఁ జాలు; నదె నిన్నాశింతు విఘ్నేశ్వరా

శా. క్షాత్రచ్ఛద్మయుగాంతబాడబనివాసస్థాన, మన్వ్యాన స
ర్వత్రాసోగ్రతపోనిధాన, మపరబ్రహ్మప్రథాభాజి, గా
యత్రీమంత్రమహర్షి, దివ్యమహనీయబ్రహ్మతేజస్వి, న
క్షత్రాకారు మదీయగోత్రఋషి విశ్వామిత్రుఁ గీర్తించెదన్. 8

క. 'శరణాగతి' యను ఖండిక
గరిమం బగు భక్తి 'భక్తకల్పద్రుమ' మన్
వరశతకముఁ దెనుఁగున నే
విరచించితి మున్ను; రామవిభుదయకలిమిన్. 9

క. ఆస్తికులకుఁ బ్రియముగ 'రా
మస్తవనక్షత్రమాల', మధురఫణితి 'సీ
తాస్తోత్రరత్నమును' ని
త్యస్తుత్యముఁ గాఁగ సంస్కృతమునఁ బలికితిన్. 10

చ. ఒకమహనీయుఁ గూరిచి రసోచితబంధముగాఁ బ్రబంధముల్
బ్రకటితరీతిఁ గూర్పఁగల భాగ్య మదెంతటివారి కబ్బు! నా
కకట! లభించునే? యని నిరాశ వహింప సమాశ్రితైక క
ల్పకమగు రామచంద్ర భగవత్కరుణాపరిణామ మేమనన్. 11

ఉ. పాయనిభక్తి నా చిఱుతప్రాయమునుండి యనారతంబుఁ, బా
రాయణ మాచరించెడు మహామహిమాస్పదమైనయట్టి రా
మాయణమందుఁ గౌశికకథామృతవృష్టి మదంతరాత్మ ని.
శ్శ్రేయసమూలమై పొటమరించెను గావ్యకలాక్రియాస్పృహల్.

తే. అవి యనుక్షణముఁ గ్రమక్రమాభివృద్ధి
నంది, శాఖోపశాఖలై యతిశయిల్లి
తారకబ్రహ్మమున కంకితంబు గాఁగ
గ్రంథరచనం బొనర్ప సంకల్ప మొదవె. 13

ఉ. కాని శరీరధర్మమును గాంచినచో క్షణభంగురంబు; నా
మేనను మెత్తఁబా టొదవె; మించిన దీపని; పూని భంగమా
నేని వృథాప్రయాస మగు; నియ్యది యందనిపంటె కాసయే
కాని మఱేమి? 'కానిపని కష్టము మొం'డని నిస్పృహుండనై. 14

తే. కడచనియెఁ గొంతకాల మిక్కరణి; నొక్క
నాఁడు కార్యావసరమున వందియాల
కరుగుట తటస్థ మాటయు నప్పు డంత
రంగమున నున్న సంశయభంగిఁ గూర్చి. 15

క. పలికితి నొకపరి మద్దుల
పలి సుబ్రహ్మణ్యశాస్త్రిపాదులతో నా
తలఁపుఁ బ్రసంగవశత; వా
రలఘుమతిం బలికి రిట్లు లలఁతినగవుతోన్. 16

సీ. "పదునాలుగేఁడుల ప్రాయంబులోననే
స్వయముద్భవంబైన సాహితియును
అల్లప్పుడే సంస్కృతాంధ్రంబులందును
గవన మల్లెడుశక్తి గల్గుటయును

అప్పుడే స్వకృతంబు తొ హరికథలను
 జెప్పఁ గల్గిన నేరు పుప్పతిలుట
అనాఁడె కొల్లాపురాది సంస్థానంబు
 లందు సత్కారమ్ము లందుకొనుట

తే. యాదిగా నేఁటిదాఁక మీ కబ్బినట్టి
యోగ మది యెటులైనను నుండఁ డెందు;
ఇపుడు కృతికర్తలై గూడ నేల శంక?
రాముఁడే యన్నిటికిని నిర్వాహకుండు. 17

శా. సంకల్పించినమాత్రనే సుకృతమౌ సత్కార్యజాతంబున;
న్సంకల్పించినమాత్ర ఘోరనరకానంద్రోయు దుష్కార్యముల్;
జంకన్ రా; దొకవేళ సిద్ధియయినన్ సంతోషమే; కానిచో
శంకింపం బనియేమి? మీవలన దోషం బేమి లేకుండినన్. 18

క. మీవలన నెంతకార్యము
గావలెనో యంతెగాని కా దితరం బిం
కేవిధి; 'యావత్తైలం
తావ ద్వ్యాఖ్యాన' మను జనశ్రుతి వినరే? 19

చ. క్రమగతి రేపు రామనవరాత్రము లీ రొనరించునప్డు పా
త్ర మొకటి రామదేవుని పదంబులఁ బెట్టి యనుజ్ఞ వేఁడి కా
వ్యమునకుఁ బూనుఁ; డన్నిటికి నప్పరమాత్మయె కర్త; నిశ్చయం
బు; మనక దెట్టులైన నిహముం బరమున్ గుఱి దప్ప దెప్పుడున్"

వ. అని పలికి యనేకకావ్యకర్తయు, నాకుం జిరపరిచితుండును
నగు నయ్యనఘుఁడు నా మనంబున ననూనంబగు నుత్సాహంబు
పెనంగొనం బ్రబోధించిన నేనునుం గావ్యకల్పనాశిల్పంబునం గృత
నిశ్చయుండనైతి; నంత నచటి కనతిదూరంబున నున్న పాములపా

డనుగ్రామంబునఁ బ్రథమశాఖీయబ్రాహ్మణగ్రామణియు, గ్రామాధి
కారిశిరోమణియునై. 21

మ. గుణసంపత్తి, యఖండవైభవము నక్షుద్రంబులై నాగభూ
షణరా వ్యాశ్రితకల్పభూరుహము, సాక్షాద్ధర్మమో నా విచ
క్షణబుద్ధిం జదివించుచుండెఁ గృప నస్మత్పుత్రులం; గానఁ ద
త్క్షణమచ్చోటికిఁ బోయివత్త మనువాంఛల్ నన్నుఁ బ్రేరేచినన్.

ఆ. వెడలి యచట నేకవింశతి దివసావ
ధిక విషజ్వరమునఁ దికమక లయి
బ్రదికినాఁడ దైవవశమున; రామోత్స
వములు తరిమికొనుచు వచ్చె నంత. 23

ఉ. కాలము గ్రీష్మ; మప్పగిది గాసివడెన్ మెయి; యూరి కష్టు పోఁ
జాలక, దీక్ష మానుకొనఁజాలక పాములపాటిచెంత కం
బాలపలిం బ్రసిద్ధమయి భాసిలు శ్రీధరవారియింట నే
దో లఘురీతి భక్తవరదున్ నెలకొల్పి యజించితిం దుదిన్. 24

క. వేడుక శ్రీధరలక్ష్మమ
కోడలు భాగీరథమ యకుంఠితభక్తిన్
దోడుపడ రాముఁ డొనరిచి
నాఁ డేఁట శోభకృతు చైత్ర నవరాత్రంబుల్. 25

తే. రామనవరాత్రములను శ్రీరామనవమి
నాఁడు పూజించి, కావ్యంబునకుఁ బునాది
వేయఁ దలఁ పూని యష్టమిరేయిఁ గృత్య
మంతయు సమాప్తి యొనరించి యణఁగి మణఁగి. 26

వ. ఎల్లి దశావరణపూజాసమయంబునం బుస్తకంబుఁ బూజించి
గ్రంథారంభం బాచరింపవలయు; నాకడం బొత్తంబు లేదు;

మఱియు నియ్యది కుగ్రామంబు; ప్రతిదినంబు పాములపాటినుండి
నా కౌషధంబుఁ దెచ్చి యిచ్చి పోవు మా బుడుతలకైనం జెప్ప
మఱచితి; నని చిత్తంబున నొదవిన యుత్తలపాటు మెత్తవడిన
మేనికిం గ్రొత్త యలజడిఁ గలిగింప సెజ్జపై నొత్తిగిలి కనుగూర్కు-
నంత. 27

తే. తలవని తలంపుగా వచ్చి నిలిచె నెదుటఁ
బ్రీతిఁ జందవరాగ్రహారికుఁడు నీశ్వ
రాంఘ్రిసేవారతుఁడు నిరతాన్నదాత
భవ్యతరకీర్తి రామభూపాలశర్మ. 28

క. కనుఁగొని సంభ్రమమున నా
యన 'నెక్కడినుండి రాక' యని యడుగుచు ది
గ్గన లేచి గౌరవించితి;
ననితరసౌహార్ద మొదవ నతఁ డిట్లనియెన్. 29

శా. 'ఆరంభింపుము నీ తలంచిన సుకావ్యం' బంచు నౌత్సుక్య మే
పారం జేతి కొసంగె నా కలిఖితంబౌ నొక్కపాత్రంబుఁ; దా
నేరీతిం గురుతించినాఁ? డని మనం బెంతో మహాశ్చర్యవి
స్తారం బౌటయు నంతలోపలఁ బ్రబుద్ధం బయ్యె నా యాత్మయున్.

తే. కనులు దెఱచి యం దెవ్వరుఁ గానరామి
స్వప్న మని మదుపాస్యదైవమగు రామ
చంద్రగురుపరబ్రహ్మ మీజాడ వచ్చి
ననుఁ బ్రబోధించె ననుచు సంతసము నొంది. 31

శా. నాకుం దల్లియుఁ దండ్రి దైవతముఁ బ్రాణంబున్ మనంబున్ ధనం
బా కారుణ్యసుధానిధానము; యిఁకేలా? నే వృథాకర్తృతా
వ్యాకోచంబు వహింప? రామమయసర్వారంభుఁడన్ గాన స
ర్వాకారంబుల రాముఁ డెప్పగిది నన్నాడించు నట్లాడెదన్. 32

మ. అనుచుం జయ్యన లేచి, కాల్యకరణీయంబుల్ వడిం దీర్చి స్నా
ననిమిత్తంబుగ నేఁగివచ్చుసరికిన్ నా జ్యేష్ఠసూనుం డటం
గనిపించెం 'జనకా! భవద్రచనకుంగాఁ దెచ్చితిం బుస్తకం'
బని పాత్రంబును, ముందు ముం దిడియె; హర్షాశ్చర్యముల్
నెక్కొనన్. 33

క. ఏనాఁ డేను బ్రసంగవ
శానం బల్కితినొ! బాల్యచపలత మఱపుం
గానక వాఁ డది తెచ్చె; ని
దే నాపాలింటి రామదేవుదయ యనన్. 34

వ. ఇట్లు సంతుష్టాంతరంగుండనై శ్రీరఘువరచరణసరసిజయుగళసమ్ము
ఖమ్మున నా పాత్రమ్ము నునిచి, పూజావిధాన మ్మంతయుం బరిస
మాప్తిఁ గావించి, ధూపదీపనైవేద్యాదిక్రియాకలాపం బంతయు
నెఱవేర్చి యప్పురాత్పరు నిట్లని ప్రార్థించితి. 35

సీ. ఏ తపోధనసింహు హేరాళశక్తి బ్ర
హ్మాస్త్రములకు విహారభూమి
యే మహాత్మునికీర్తి కీరేడుజగముల
కావలిపొలిమేర యాటపట్టు
నే మహామహుని మహీయస్తపోధాటి
గుండెగాలము దేవకోటి కెపుడు
నే భూరితరమహాప్రాభవాఢ్యుని మాట
చండశాసనము బ్రహ్మాండమునకు

తే. నతఁడు నాకు గోత్రర్షి, నీ కస్త్రగురుఁడు
నా కృతికి గాధిజుఁడె కథానాయకుండు;
నీవె కృతిపతి వీకఁ దండ్రి! నీదె భార;
మాజ్ఞ యిడుమయ్య! రామ! కల్యాణధామ! 36

మ. ననుఁ బుట్టించిన దీవకా! తనుమనోజ్ఞానంబులం బ్రోదిఁజే
సిన దీవేకద! యిప్పు డిట్టి తలఁపుం జేకూర్చుచే నీవ; కా
వున నేతత్కృతి నీదయామృతరసంబుం బట్టియే యుండు; నో
యనఘా! పిండికొలంది రొట్టె యగు; సామ్మా? సొమ్ములో
నుండెడున్. 37

చ. కవి నని కాదు, నాదొక జగన్నుతపాండితి యంచుఁ గాదు, నే
బ్రవిమలకీర్తి లోకమున వ్యాప్తి యొనర్తు నటంచుఁ గాదు; నా
కవనములోని యాశయము; గాధితనూజపవిత్రగోత్రసం
భవుఁడను గాన నమ్మహితుఁబ్రస్తుతి సేయుద మన్న వాంఛయే. 38

— గ్రంథకర్తృవంశక్రమము —

శా. విశ్వద్యోతితకీర్తి జ్యోతిషమహాబ్ధిక్రోడమంథాద్రియున్
బశ్వాదిప్రతిజంతుజీవసమతాపారప్రియాకాంక్షియున్
విశ్వామిత్రసగోత్రుఁ డచ్యుతధరాభృన్మౌళిదత్తాగ్రహా
రైశ్వర్యుండఁట! మాకు మూలపురుషుం డన్నార్యమిశ్రుం డిలన్.

క. ఆ యన్నంజోస్యుల వం
శాయతి నలువదిగృహంబులై పెరిఁగిన; దే
నాయనకుఁ బదొకటవ తర
మై యుందు; విచిత్రము తదుదంతం బెల్లన్. 40

మ. తనకుం దల్లియుఁ దండ్రి చిన్నపుడె యంతంబంది; రెవ్వారు నా
యనువార్లే కెటు వృద్ధిఁ బొందెనొకొ? విద్యాపాండితీప్రజ్ఞలన్
గని యన్నార్యమనీషి చింతపలి జన్మస్థానసర్వస్వమున్
దనదాయాదుల పాలుగాఁగ వెడలెం ధైర్యంబె చేదోడుగన్. 41

శా. తా నెం దేఁగిన నందె మిత్రతతియుం, ద్రవ్యంబు, బాంధవ్యముం
దానై కోరక చేరుచున్నది; విశుద్ధంబౌ ననూచాన వం

శానం బుట్టిన యొక్కపుణ్యుఁడు తనూజాతన్ గుణాన్విత న
త్యానందంబునఁ బెండ్లిఁజేసె; బళి! విద్యాశాలికిన్ లోపమే?

తే. అల్ల బోదనంపా డను నగ్రహార
మందుఁ బెండ్లాడి యిల్లట పల్లుఁ డయ్యె;
మామ శతవృద్ధుఁడును, బావమఱఁదు లపుడు
నేదరులు గానఁ దప్పక నిలువవలసె. 43

ఉ. పైరును, బచ్చ నారయుచు, బంటును బైదను జూచుకొంచు నె
వ్వారయినన్ గృహంబునకు వచ్చిన వారల నాదరించుచున్
గూరిమితో మఱందులకుఁ గూర్చుచు, విద్యల బుద్ధులన్ మనం
బారఁగ నేర్పి, వారల గృహస్థులుగా సలిపెం గ్రమంబునన్. 44

వ. అంతఁ గొంతకాలంబునకు శ్వశురుండు పరలోకగతుండగుటయు,
నవ్విద్వన్మణి భార్యాసహితంబుగాఁ గొంతకాలం బందే యుండి
యొక్కనాఁడు తమ యత్తవారితో నిట్లనియె. 45

ఉ. మామ గతించె; నీసుతులు మాన్యతఁ గాంచిరిగాదె పెద్దవా
రై; మఱి మే మిఁ కేటికిఁ? బ్రయాణము సేయుద మన్న
నత్త యొం
తో మదిఁ గుందె; నెట్లు మనసొప్పు? మఱందులబుద్ధి మాటె భా
ర్యామణులందుఁ గల్గిన మహత్తరమైన ప్రభావ మింతకున్. 46

వ. ఇట్లుండ నొక్కపండుగనాఁ డంద ఱభ్యంజనంబు లొనరించు
కొనుచుఁ బెద్దబావమఱంది యక్కయ్యా కభ్యంజనంబు సేయించి
తిరా? యనుటయు. 47

శా. 'ఎన్నాళ్ళీభరణం?' బటం చొకతె తా నెంతేని గొణ్గెం; గనుం
గొన్నన్ ముక్కుమొగంబుఁగాక వదినెం గోపించె నొక్కర్తు; వె

నక్క న్నిల్చెన్ మెటికల్ చెడన్ విఱుచుచుం గయ్యాళి యింకోర్తు; వా
రెన్నాళ్ళచ్చట నిల్వశక్య మగు? నిన్నీ! హీనమానంబుగన్.

వ. అంత నప్పతివ్రతాతిలకంబు భర్తకడ కరిగి. 49

క. 'మీ రుండఁగనే నా కిట
నారయ భరణంబు ప్రాప్తమయ్యె' ననుచు లోఁ
గూరిన వగ సాధ్వీమణి
బోరన నేడ్చె నటు లశ్రువులు వఱదలు గాన్. 50

చ. చుఱుకుమటన్న యప్పలుకు జోస్యులవారి హృదంతరాళముం
గఱకఱఁ జీల్చ నాక్షణమ గాదిలిపెండ్లము వెంటఁబెట్టుకొం
చరిగె; మఱందు లందఱును నడ్డముగాఁ జని యక్కకాళ్ళపై
నఱిముఱి వ్రాలినన్ నిలువ దామె; మనస్విని మాటకోర్చునే? 51

తే. అచటి కనతిదూరంబునయందు పొట్ల
పాటి కరణాలు తనశిష్యు లౌటఁజేసి
యచట సతి నుంచి కృష్ణరాయలను జూడ
నరిగె శిష్యుం డొకండు తోడై చనంగ. 52

వ. అం దొక మత్తశుండాలంబు ప్రచండంబుగఁ బురవీథులం బడి యడ్డమైనవారి నెల్లఁ జీల్చివైచుచుం జోవుచుండఁ దదభిముఖంబుగ ముం దరుగుచున్న శిష్యుండు భీతుండై వెనుకమొగం బయ్యె; నంత గురుం *డేచెంపను మదధారాస్రావంబు దోఁచు నాచెంప నొఱసికొని పొమ్మనుటయు, నట్లిరువురుం బోవుచుండ మేడలపై నిలిచి చూచుచున్నవా రందఱుం గని 'చచ్చిరి చచ్చి' రని యఱచుచుండ; రయ్యేనుఁగు వారి నేమియుం జేయ

*ఏన్గుల కేవైపు మదధార గారుచుండునో యావైపు గానరాదని చెప్పుదురు.

దయ్యో! నంత మీ రెవ్వరో మహాత్మ్మ లని యంద ఆచ్చెరువునం
జూచుచుండ నొక్కపండితుఁడింటికిం బోయి యతిథిసత్కారంబులం
బడసి, 53

శా. చేతుల్ సూపఁగ, జాతకంబుల విమర్శింపింపఁ బ్రశ్నింపఁగా
నేతేరం దిరునాళ్ళ; మూఁడహములందే తత్ప్రభావంబు వి
ఖ్యాతం బయ్యె ధరాధిపాంతముఁ; దదాహ్వానంబునం బండిత
వ్రాతంబుల్ వెనువెంట రాఁగ వెడలెన్ రాజేంద్రు నాస్థానికిన్.

శా. ఆరాజన్యసభాంతరాళమునయం దాసీనులావారిలో
సారాచారులు, వేదశాస్త్రచయ శశ్వత్పారదృశ్వత్వ వి
స్తారప్రౌఢి చతుర్ముఖుల్, సు రసవత్సంగీతసాహిత్య సం
స్కారప్రీత సమస్తపండిత సభాస్తారుల్ వినా లే రొరుల్. 55

శా. ఎన్నో భంగులఁ బ్రశ్నలన్ సలిపి, రెంతెంతో పరీక్షించి, రె
న్నెన్నో రీతులఁ బట్టిచూచిరి; లవంబేనిం బ్రమాదంబు లే;
దన్నాళీకభవాదిదేవతలు తోడై వచ్చినం గెల్వరా
దన్నా రాయన జ్యోతిషప్రబలవిద్యాఖర్వగర్వోద్ధతిన్. 56

వ. అంతఁ దదీయాశేష శేముషీవిషయంబుల కానందించి. 57

తే. అగ్రహారంబు నిడిన రాయలను గాంచి,
చెట్టుచేమయుఁ గొట్టి నేఁ గట్టవలయు
గ్రామము; నొకళ్లు గట్టిన గ్రామ మొల్ల;
నరసికొనివత్తుఁ దగినచో టనుచు వెడలె. 58

సీ. తృణజలకాష్ఠసమృద్ధియై బ్రాహ్మణా
న్వయనివాసైకయోగ్యమగుచోటు
చెట్టుఁజేమలుఁ జాల గుట్టలుం గల్గి యే
పట్టున సాగులేనట్టిచోటు

నెలకు మూఁడేసి వానలు గ్రుమ్మరించిన
నరకాలఁ దేమ గానట్టిచోటు
జైనులు పూర్వ ముచ్ఛస్థితి వసియించి
యంతంత బేచరా కైనచోటు

తే. గాంచి యిదియ నివాసయోగ్య మని యెంచి
తా విజయనగరమునకుఁ దరలునాఁటి
కట దివి కరిగెఁ గృష్ణరాయక్షితీంద్రుఁ;
డనుజుఁ డచ్యుతవిభుఁ డగ్రహార మొసఁగె. 59

వ. మఱియుఁ బ్రాగ్దక్షిణ పశ్చిమోత్తరంబుల బాదాపుర రుద్రసముద్ర లక్ష్మీపుర చందవరాగ్రహారంబుల పొలిమేరల మధ్యస్థలంబున నొప్పారి విప్వారు మున్నూటయెనుబది కుచ్చెలల భూమి యగ్రహారంబు సంపాదించి యచ్యుత దేవరాయ దత్తాగ్రహారం బగుట నచ్యుతేంద్రపురాగ్రహారం బను పేర వెలయించె; మఱియుఁ దద్గ్రామాధిష్ఠానదైవతంబగు పోలేరమ్మ యనుశక్తి యా గ్రామంబునకుం దన పేరుఁ బెట్టు మని కోరినందున పోలేపల్లి యను నామాంతరం బద్దానికి సుప్రసిద్ధం బొనరించె; నట్లప్పుణ్యదంపతులు కాశీయాత్ర కరుగుచు మార్గమధ్యంబునఁ బండరీపురంబున నొక బ్రాహ్మణు నింట బసఁజేసిన నాబ్రాహ్మణుండు మహర్షి సన్నిభుండైన జోస్యులవారి కుల గోత్ర నామాదులును, స్థితిగతులును విచారించి, తనకూఁతు నిత్తు నని ప్రార్థించుటయు నిల్లాలి యభిమతంబుం గైకొని యక్కన్నియం బెండ్లాడి కళత్రద్వయసహితుండై కాశీ ప్రభృతి ముఖ్యయాత్ర లన్నియుం దిరిగి పురంబుఁ జేరెఁ; బదంపడి యవ్వధూమణుల కిరువురి కిరువు రిరువురు తనయులై; రి ట్లన్వయం బభివృద్ధినొందె; మఱియు. 60

తే. ఆ మహితు సంతతిని శివరామశాస్త్రి
యను మహామహుఁ డష్టసహస్రసంహి

తను గుమారరామాయణ మను సుకావ్య
మమలభక్తి రచించె శామార్పణముగ. 61

తే. పత్రికాముఖమున నిరువదియు నొక్క-
దినము విద్వత్కుమారయాచనరవిభుని
తోడ శాస్త్రవాదంబు సద్భుతము గాఁగఁ
జేసి యా శ్రోత్రియము సురక్షిత మొనర్చె. 62

ఉ. ఆ శివరామశాస్త్రుల యనంతర మెన్నియొ యేండ్లకుం బ్రభు
త్వాశయ మొప్పె శ్రోత్రియము లన్నిటినిన్ విపరీతభంగి నా
శోశన మాచరింప; నటులై యధికారియు వచ్చె; శాసనా
లే శరణంబు; వానిపాడయే కనరా దెవ రెంత చూచినన్. 63

తే. శాసనా లున్న వన్న విశ్వాస మొకటి
కల; దెట నడించినను గాని కానరావు;
'మా మహర్షి కల్పుఁడు శివరామశాస్త్రి
కరుణ లేదయ్యెనేమొ యికాలమునకు'. 64

వ. అని యిట్లు పరితపించుచు నిద్రాహారంబులు లేక నలువదియిండ్ల
శ్రోత్రియు లాబాలవృద్ధంబుగా రెండుదినంబు లయ్యధికారి
నివాసగృహంబు ముంగిటం బడి యల్లాడుచు, మధ్యందిన చండ
కిరణ కిరణతాపంబున కోపక యంగవస్త్రంబులం దడిపి శిరంబుల
వైచికొని శోకాకులితచేతస్కులై యుండ. 65

శా. నిలువెల్లన్ భసితత్రిపుండ్రములు, కుండీదండముల్ కేలుదో
యి, లసద్రక్తసరోజపాటలమహాహేరాళకాంతిచ్ఛటా
కలితశ్రీపరిధానముల్ మెయి వెలుంగన్ నిల్చె నుద్యోగిముం
గల సన్న్యాసియొకండు; తేజమున సాక్షాచ్ఛంకరుండో యనన్.

శా. ఆ యుద్యోగి విరాకుఁ జెంది, భయభక్త్యానమ్రుఁడై నిల్వ, 'న
య్యా! యస్మత్పురశాసనంబు లవిగో యశ్వత్థమూలావనిన్

స్థాయీభూతము లౌ నెఱుంగ లేవ; రీజాడన్ వచింపుండు; మా
దీయూరే! శివరామశాస్త్రి’ నని యశ్లే మాయమై పోయినన్.

తే. ఆ గృహాంగణసీమ నల్లాడుచున్న
బ్రాహ్మణుల కందఱికిఁ జెవిం బడియె నట్టి
నుడులు; శివరామశాస్త్రి కన్పడఁడ; యెట్లు
వచ్చెనో? యెట్లు పోయెనో? యచ్చెరు వగు. 68

వ. అంత నయ్యధికారి చివాలున లేచి ‘యీ యూరైన నెదుట నున్న యాత్మీయులకుం దెల్పక లోని కేల వచ్చె?’ నని తలంచుచు ‘నెవరయా బ్రాహ్మణు లిందు, రం’ డని పిల్చి యీ యుదంతంబుఁ దెల్పిన ‘మా శివరామశాస్త్రి మరణించి నలువది సంవత్సరంబు లయ్యెఁ; చరమదశలోన సన్న్యసించెఁ గావున మీ కట్టిరూపంబున సాక్షాత్కరించె; మా కా ప్రాప్తంబు లేదయ్యె’ నని వగచుచు శ్రోత్రియులందఱు నయ్యశ్వత్థమూలంబునఁ ద్రవ్వించి యందున్న తామ్రశాసనంబుల మూఁడింటిం దెచ్చి చూపిన నయ్యధికారి సంతసించి యగ్రహారంబు జారీచేసి యథేచ్ఛం జనియె.

ఉ. పాండితిఁ జూపి యొక్కపరి ప్రాగ్ధరణీశ్వరదత్తశాసనా
లుండిన తావుఁ దెల్పి మఱి యొక్కతఱిన్ శివరామశాస్త్రి పో
నుండిన శ్రోత్రియంబు మనియుం జనియున్ వెలయించె నాఁటి; కీ
రెండును జాలనట్టి విపరీతఫలం బొడఁగూడె నేఁటికిన్. 70

క. శివరామశాస్త్రి కగ్రజుఁ
డవు నయవారప్ప యన్వయమునందున ను
ద్భవమందె నప్పయ యనన్
బ్రవిమలుఁ; డాయనకుఁ బుత్రపంచక మొదవెన్. 71

ఉ. ఏనుగు రన్నదమ్ములు గుణాధికు; లందఱిలోఁ గనిష్ఠుఁ డ
త్యాదరణీయవర్తనసమన్వితుఁ డాగురునాథశర్మ పు

త్యోదయభాగ్యశాలిని కులోద్భవ సుబ్బమయందుఁ గాంచెఁ బు
త్త్రోదయముఁ ద్విధా పరిణతోన్నతిఁ గన్న ప్రమోదమో యనన్.

క. శివకేశవభేదము త
త్త్వవిధంబున లేమిఁ దెల్పుసరణి సుతులకున్
శివకృష్ణనామముల నిడె;
నవురా! గురునాథశర్మ యవహితమతియై. 73

మ. క్రమసర్వర్త్రితకార్యసంచయుఁ డనేకగ్రంథసంశోధనా
త్త మహీయస్తరశేముషీయుతి విశుద్ధస్వాంతుఁడుం బార్వతీ
రమణాంఘ్రిద్వయసేవనానుభవపారమ్యుండు నౌ నాశివ
య్య, మహాలక్ష్మమసాధ్వి మత్పితరు లత్యంతప్రియంభావుకుల్.

వ. అయ్యుత్తమదంపతుల కనంతరామయ్య, సుబ్రహ్మణ్యము,
లక్ష్మీనారాయణ యను పుత్రత్రయంబును—భ్రమరాంబ యను
పుత్రికయుం—గలిగి; రందు ద్వితీయుండనగు నేను దుర్నిరీక్ష్య
క్షాత్రతేజస్వియై మహనీయబ్రహ్మతేజోవిరాజమానుండై వెల
సిన కుశవంశాభరణంబు ననుసంధించి యొక్క గ్రంథంబుం
బొందుపఱుపఁ దలంచితిఁ గాన. 75

—, సుకవిస్తుతి ,—

తే. వ్యాసవాల్మీకులకు నభివాదనంబు,
కాళిదాసాది సంస్కృతకవులకును, గ
విత్రయమునకు నాంధ్రకవిప్రకాండు
లందఱికి నా నమోవాక మందుఁగాక. 76

—, కుకవినింద ,—

చ. గురువుకుఁ బంగనామ మిడుకొంటెలు కొందఱు నాకవిత్వముం
బరిహాసనం బొనర్చిన శుభం బది; నాకతనన్ జనంబు సం

బరపడ నన్నుచోఁ బరమభాగ్యము; మన్మలినాపనోదనం
బరయఁగఁ దన్ముఖంబున; నహో! యది తీర్థము స్వార్థమే కదా!

వ. అని పలికి నాపాలింటి శ్రీరామచంద్రమూర్తి దివ్యమంగళవిగ్రహంబు హృదయకమలకర్ణికయం దారోపించి యద్దేవదేవు నుద్దేశించి. 78

—, షష్ఠ్యంతములు ,—

క. పరమమునిజన గణాంతః
కరణ నిరంతర విహార ఘన కేళీ వి
స్ఫురణంబుల కార్తజనో
ద్ధరణంబులకును భవాబ్ధితరణంబులకున్. 79

క. సురరాడ్విస్వర క్షణ దు
స్తర శాపాయుధ వధూ దృషత్త్వాతి దురా
వరణ నిరాకరణ పరా
చరణ చణ రజఃకణ ప్రసరణంబులకున్. 80

క. వరభక్తి భరితభరతా
విరతాతుర తాపనోద విద్యావిభవ
స్ఫురణ కరణీయ ధరణీ
ధరణక్షమ పాదుకా వితరణంబులకున్. 81

క. శరణాగతభరణంబుల
కరుణారుణకాంతి జృంభితాంభోజ నిభ
స్ఫురణాలంకరణావి
ష్కరణంబులకును దదీయచరణంబులకున్. 82

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన బ్రహ్మతేజోబలంబునకుం
గథాక్రమం బెట్టి దనిన. 83

# కథాప్రారంభము

క. శ్రీ జానకీమనోవి
భ్రాజద్రాజీవషట్చరణ! రణభూమ్యు
త్తేజితశౌర్యగుణా! గుణ
రాజికృతజనాదరా! దరస్మేరముఖా! 84

శా. శశ్వత్సంభృత సర్వకాల విలసచ్చంద్రాతపభ్రాంతికృ
ద్విశ్వాతీతయశస్సనాథుఁ డహితోర్వీనాథనిర్భిన్నస
ప్తాశ్వచ్ఛిద్రసహస్రసాక్షిక సముద్యద్విక్రమోపేతుఁ డ
వ్విశ్వామిత్రుఁడు రాజ్య మేలుఁ ద్రిజగద్విఖ్యాతధర్మస్థితిన్. 85

శా. ఆచంద్రార్కయశఃప్రశ స్తమగు బ్రాహ్మ్యం బెవ్వఁ డార్జించె "మి
త్రేచర్షా" యితి సూత్ర మెవ్వనికిఁ బ్రత్యేకించె వ్యాక ర్త—య
య్యాచాంతాఖిలధర్మకర్మఠుఁ డవార్యక్షాత్ర తేజోబలా
నూచానంబగు సంతతిం బొడముధన్యుం డేమి—సామాన్యుఁడే!

ఉ. ఎవ్వనిశిష్యుఁ డిప్పుడమి నెల్ల సడించిన క్షత్రియాంతకుం,
డెవ్వనిశిష్యుఁ డా త్రిభువనేశ్వరుఁడౌ రఘురామునంతవాఁ
డవ్వసుధేశుఁ బోలఁగలరా? యిల రాజులు; ముత్తియంబులుం
గవ్వలు నీటఁ బుట్టినవె కావె? సమార్ఘత యేది వానికిన్! 87

తే. అల విరించిసుతుండు కుశావనీంద్రుఁ;
డతనికి జనించెఁ గుశనాభుఁ; డతనికొడుకు
గాధి; యాతనికొమరుఁ డర్కసమ తేజుఁ
డై వెలుంగు విశ్వామిత్రుఁ డను నృపుండు. 88

వ. అమ్మహీనాయకుండు మహోదయపురంబు రాజధానిగా వధి
వసించి ధర్మజ్ఞుండును గృతప్రజ్ఞుండును బ్రజాసమ్మతుండునునై
యనేకవర్ష సహస్రంబులు రాజ్యం బేలుచుండె. 89

శా. ఆరాజన్యకులావతంస మొకనాఁ డక్షౌహిణీసంఖ్య దు
ర్వారానీకిని వెంట రాఁ గదలి రాష్ట్రంబుల్ మహాఘోర కాం
తారంబుల్, మునిపల్లె, లేఱులు, సముద్రంబుల్ విలోకింపుచుం
జేరంబోయి వసిష్ఠునాశ్రమము దర్శించెన్ మహాభక్తిమై. 90

వ: ఇట్లవ్వసుధేశ్వరుండు నానాపుష్పలతాద్రుమంబును వివిధమృగ
గణాకీర్ణంబును సిద్ధచారణసేవితంబును దేవదానవగంధర్వ
కిన్నరోపశోభితంబును బ్రశాంతహరిణాకీర్ణంబును ద్విజసంఘ
నిషేవితంబును బ్రహ్మర్షిగణసంకీర్ణంబును దేవర్షిసంసేవితంబును
నై తపశ్చరణసంసిద్ధులును వహ్నికల్పులును జితేంద్రియులును
వాయుపర్ణాంబుభక్షులును ఫలమూలాశనులునునైన వాలఖిల్యుల
చేతను, జపహోమపరాయణులైన యితరవైఖానసులచేతను
నుపశోభితంబై యపరబ్రహ్మలోకమో యన నొప్పు నయ్యా
శ్రమంబుం గాంచి రథాశ్వగజపాదాతంబులవలన నాశ్రమో
పాంతభూముల కలజడి గలుగరా దని యెంచి దూరంబునన
సైన్యంబుల డించి రథావతరణంబుఁ గావించి పాదచారియై
యొక్క పరిచారకుండు వెంటరాఁ జని. 91

తే. కువలయేశుండు తన కులగోత్రనామ
ముల వచింపుచు బ్రహ్మర్షిముఖ్యుచరణ
ములకు సాష్టాంగముగఁ బ్రణతుల నొనర్చె
భక్తివినయవిధేయభావములు మెఱయ. 92

మ. కని బ్రహ్మర్షి మహాదరంబున మనఃకంజాతపుంజీభవ
ద్ఘనకారుణ్య మరందధారలు కటాక్షవ్యాజముం దాల్చి రా
జున కానందముఁ గూర్ప స్వాగత మటంచున్, శిష్యులం బిల్చి యా
సన మిప్పించినఁ గూరుచుండె భయలజ్జాభక్తినమ్రాస్యుఁడై. 93

తే. పాద్య మాచమనీయంబుఁ బలురకముల
ఫలములను, మూలముల మహాభాగ్య మనుచుఁ
బరమసంతోషమున నరపతి గ్రహించె;
నాదరంబును మించిన దేది గలదు? 94

తే. బలము, కోశంబు, మిత్రసంపద—సమృద్ధి
యే కదా? నిస్సపత్నకంబేకదా? సు
ఖంబె? నీకు సపుత్రపౌత్రంబుగా న
టంచు ముని యన రాజేంద్రుఁ డనియె నిట్లు. 95

తే. వరతపోధనులైన మీ వంటివారి
కృప గలిగె సర్వదోషనికృంతనమ్ము;
కుశలమున కే కొఱంత గల్గును? మహాత్మ!
జగములకె మీసమీక్ష రక్ష యయి నిలువ. 96

మ. తపముల్ చక్కఁగ సాగుచున్నవె? మహాత్మా! యగ్ని
హోత్రంబులున్
జపముల్ నిత్యసురద్విజాతిథిసమర్చల్ మున్నుగా ధర్మని
ష్ఠ పరాకాష్ఠ వహించునే? సుఖమె శిష్యశ్రేణికిన్, మీకు? నే
విపరీతంబులు లేక యాశ్రమములన్ బెంపొందునే శ్రేయముల్?

చ. అనిన వశిష్ఠుఁ డిట్లను జనాధిప! ధర్మపరుల్ నరేంద్రు లే
లిన జగతీతలంబునకు లేదు కొఱంత యటన్నమాట; రం
జనమునఁ గాదె రా జగుఁ? బ్రజం దనబిడ్డలుగాఁ దలంచి పా
లన మొనరింప నేదొసఁగులం గన రెవ్వరు నెట్టివేళలన్. 98

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె. 99

తే. అఖిలవస్తునియామిక యగుచు నొక్క-
డైశ్వరి యమోఘశక్తి బ్రాహ్మ్యమునఁ దనరుఁ;
దద్బలంబున మెలఁగు క్షాత్రము నిమిత్త
మాత్రముగ గోపురాన బొమ్మలవిధాన. 100

క. అనవుడు మునీంద్రుఁ డను, నీ
వనినది నిక్కవము కాని, యైన నొక నిద
ర్శన మరయు; మోడ యోటి ద
యినఁ జుక్కా నేమి సేయు? నిదె యుపమ సుమీ! 101

తే. బ్రాహ్మణుఁడు క్షత్రియుఁడుఁ బరస్పరసమీక్ష
పైని నాధారపడి యుండవలయు; దానఁ
బ్రజలు సుఖవంతు లగుదు; రెప్పటికినైన
స్వార్థపరత వహింపఁగాఁ జనదు వారు. 102

వ. అట్టి యోగ్యతమంబులైన బ్రహ్మక్షత్రంబులే ప్రశంసనీయంబులు కాని యన్యంబులు గావు; చూడుము. 103

ఉ. వంశకరుండు బ్రహ్మ, జనవల్లభ! నీప్రపితామహుండు బ్ర
హ్మాంశభవుండు జ్ఞాననిధి, - యట్టి పితామహుఁ డాగమార్థని
స్సంశయకారి - తండ్రి గుణశాలి, మహామతి వీవు; నిన్ సహ
స్రాంశములోనఁ బోలఁగలరా? యలరాజవరేణ్యు లెవ్వరేన్.

వ. అనిన విశ్వామిత్రుండు వినయవినమితగాత్రుండై కరకమలంబులు శిరంబున సంధించి యిట్లనియె. 105

మ. అనఘా! యెంతటివాఁడ? నే; నిపుడు మీ రన్నట్లు మా పెద్దలం
దునఁ దాదృగ్గుణశీలసౌష్ఠవము లుండుం; గా దనం గాని, జ్ఞా
ననిధీ! యీ పరమాణు నిప్పగిది సన్మానంబుగాఁ జూచు పా
వననిర్వ్యాజకృపారసంబునకు దేవా! పార మెం దుండెడున్?

వ. ఇట్లు విశ్వామిత్రు వినయవివేకంబులును బ్రహ్మపుత్రు నాదరాతి
శయంబులును నొండొంటి నతిక్రమింపఁ గొంతవడి వినోదకథా
కథనంబులం బ్రొద్దుపుచ్చి వశిష్ఠుండు విశ్వామిత్రున కిట్లనియె.

క. ఒడయఁడ వీ వతిథిశ్రే
ష్ఠుఁడవు విశేషించి యిటఁ గడుంగడుఁ బూజా
ర్హుఁడవు – సబలవాహనముగ
నిడియెద నాతిథ్యమును గ్రహింపఁగవలయున్. 108

వ. అనిన భూరమణుం డిట్లనియె. 109

శా. ఆతిథ్యంబున కేమి? మీ కిచట లభ్యంబైన వస్యంబునం
జేతోమోదముఁ గంటి, నింక సెలవుం జేకొందు; నా జన్మమే
పూతం బయ్యెఁ ద్వదీయదర్శనమునన్; బూజార్హులౌ మీర లీ
రీతిం బ్రీతి ఘటింప మేను గఱుపాఱెన్ హాయి గూఱెన్ గురూ!

చ. పలుకులఁ దేనె లొల్కఁ, ననవద్యములైన కటాక్షవీక్షణం
బు లమృతధారఁ జిల్కఁ బరిపూర్ణమహాప్రణయస్రవంతి ని
ర్మలముగఁ బొర్లి నాహృదయమర్మము లంటి సుఖింపఁజేసె; మీ
ర లిఁకఁ గొఱంతఁ బెట్టుకొనరాదు ననున్ సెలవిచ్చి పంపుఁడీ.

వ. అనిన నమ్మునీంద్రుండు. 112

చ. అనుపమసత్యశోభితుఁడవైన జగత్పతి వీవు ధర్మపా
లననియమవ్రతుండ వమలస్థిరకీర్తివి వచ్చి, మేము స
ల్పు నతిథిసత్కృతుల్ గొనకపోయిన మా కెటు లుండు? బాంధవం
బును గనినైన నిల్వు మొకపూఁట నిటన్ గుశవంశభూషణా!

వ. అని పలికి మందస్మితవదనారవిందుండై. 114

ఉ. కట్టనికోట, పెట్టని యగడ్తయు, జీతము బత్తె మేమి లే
నట్టి వజీరులుం గల మహావిభవం బిది మాకు; నీకుఁ జూ
పెట్టెదఁ బార్థివేంద్రులకుఁ బెట్టుబడిం ధరణీసురాళికిం
బుట్టుబడిం జుమీ! విభవముల్ సమకూరు నరేంద్రచంద్రమా!

ఉ. కట్టనికోట లద్రులె, యగడ్త లవే సెలయేళ్ళు, చుట్టు ను
న్నట్టి యరణ్యజంతునివహంబులె జీతము బత్తె మేమి లే
నట్టి వజీరు; లింతటి స్వయంప్రభమౌ విభవంబు మీకుఁ గ
న్పట్టునె! కృత్రిమం బయినభాగ్యము శాశ్వతభోగ్యమే? నృపా!

తే. అనవరతముగఁ జమరీమృగాళి మాకుఁ
జామరంబులవైచును, ఛత్రములను
బట్టు ఛాయాద్రుమంబులు, పరభృతములు
గాన మొనరించుఁ, గేకినీగణము లాడు. 117

వ. మఱియు నొకవిశేషంబుఁ గలదు. 118

చ. పుడమిని దున్నకున్న ససి మొల్వదు మీ; కది లేదు మాకు; దే
వుఁడె మొలిపించుఁ, బెంచుఁ బరిపూర్తిగ నివ్వరి; వండనన్నమున్
వడకని బట్టయున్ ఫలముఁ బత్రముఁ బుష్పము వృక్షరాజముల్
కడుఁ బ్రియమార మాకిచటఁ గానుకలిచ్చుచునుండు నిచ్చలున్.

తే. ఆర్థికవివాదములకు లేదాస్పద మిట;
మ్రొక్కినఁ*గరంబు లూడ్చు తెంపునకుఁ జోరముఁ;
గాన దండప్రసక్తి మృగ్యమగు నిచట;
మా ప్రభుత్వంబుసరణి యిమ్మాడ్కి సుమ్ము. 120

---

* కరము అనఁగా చేయి, పన్ను అని రెండర్థములు. మ్రొక్కినవారి చేతులను దెగనఱకుట లేదనియు, పన్ను తీసికొనుట యుండదనియు నిక్కడ రెండర్థములు గ్రహింపనగును.

చ. మనుజులపైఁ బ్రభుత్వముసుమా! యటమీకు; భయంకరంపుఁ గా
ననమృగపాళిపై దొరతనంబుసుమా! యిట మాకుఁ; జూడు మే
పని సుకరంబొ? దుష్టమృగపాళియు సాధుమృగాళి యొక్కకా
ననమున సంచరించు టనినం బ్రభుశక్తి యెటుండుఁ జూచితే?

క. అనవుడు ధరణీశ్వరుఁ డను
ననఘా! మీ వాక్చమత్క్రియావిలసన మే
మన? నేను మాఱు వల్కఁ గ
లన? మీకడ సత్కృపాకలశపాథోధీ! 122

మ. ఫలమూలాదులఁ గొంటిఁ; జాలు నిఁక; దేవా! సంతసంబయ్యె; మీ
రలు పూజార్హులు; మీ రొనర్చెడు సమర్చల్ భార మంచెంచి నే
సెలవిం డంటినిఁ గాని కా దనిన మీచిత్తంబు; మీ కింక మా
ర్వలుకంజాల; భవత్ప్రసాద మనినన్ భాగ్యంబు సామాన్యమే?

వ. అని యంగీకారసూచకంబుగాఁ బలికి మునీంద్రువలన నభ్యను
జ్ఞాతుండై సేనానివేశంబున కరిగి యంతర్గతంబున నిట్లని చింతించె.

మ. ఒక యక్షౌహిణి సైన్యమున్నది, ప్రభుత్వోద్యోగు లున్నారు; వీ
రికి సంతుష్టి లభించు టెట్లొకో? మహర్షిం గాదనం జాల కూ
రక నే మూఁగిముసంగినైతి - సరి యాబ్రహ్మర్షి యామాత్ర మెం
చకపో మూర్ఖుఁడె? రాచబిడ్డలఁ బొగం జంపంగ నూహించునే?

వ. అని తలంచి నిర్విచారుండై యుండెఁ దదీయ బంధు మిత్ర పురో
హితామాత్య ప్రముఖజనంబులలో నాందోళనం బతిశయించి
యి ట్లనుకొనిరి. 126

శా. ప్రారంభింపరు వంటకంబునకు; సంభారంబులం గూర్చువా
రేరుం గన్పడ; రే ప్రయత్నమును లే దీపాటి; కీ రాజస

త్కారం బెక్కడ ? పాఱుం డెక్కడ ? వృథాకష్టం బె; నిక్కంబు కాం
కారం బున్నది, కందమూలఫలజాతం బున్నదం చాడుం బో ! 127

వ. అని పెక్కురు పెక్కుతెఱంగులం బల్కుచుండ నింతలో ముని
శిష్యు లేతెంచి యభ్యవహారంబున కాహ్వానించుటయు నెల్ల
వారును వారివెంటన చనుచుండం బురోభాగంబున. 128

సీ. శారదేందుద్యుతి స్ఫటికసంఘటిత ని
ర్మలములై యొప్పు సమస్థలములుం
జంద్రకాంతోపల స్థాపితోద్యత్ప్రభా
విలసితంబులు చారువేదికలును
హైమరాజతమండితానర్ఘ కమనీయ
కాంతంబులగు పీఠకాగణములు
మణిగణాంచలభాసమానముల్ సౌవర్ణ
రాజత భోజనభాజనములుం

తే. గలిగి కమలసుగంధి శీతలము మలయ
పవన మొలయంగ మరకతచ్ఛవి నిరంత
రాళమై యొప్పు ఛాయాద్రుమాళినీడం
గానంబడె నొక్క హేరాళమైన బయలు. 129

వ. ఆ ప్రదేశంబును గాంచి యత్యద్భుతంబు మనంబులం బెనంగొన
నొకరి మొగంబు లొకరు చూచుచు నిలిచియున్న వారలం గని
యంతకుమున్న బ్రహ్మర్షిగణ పరివృతుండై యందున్న యరుం
ధతీజాని సగౌరవంబుగ వారి నాహ్వానించి విశ్వామిత్రప్రముఖులం
గూర్చుండ నియమించిన వారును యథార్హంబుగ నుపవిష్టులైరి;
సైనికదళంబులకుం బ్రత్యేకస్థలంబు నిర్ణీతంబయ్యె నంత. 130

సీ. గమగమ వలచు శాకములు సూపంబు ల
క్షోదనంబులును దధ్యోదనములు
వరుగు లప్పడములు, వడియముల్ వివిధ లే
హ్యాములు చోష్యములు దివ్యతర మధుర
ఫలరసంబులుఁ బిండివంటలు బహువిధ
పక్వాన్నములు మఱి పాయసములు
గాఢంబు లాజ్యసంకలితంబులైన స
ద్యఃపరికల్పితాహారములును

తే. నేయి పెరుఁగును పాలుఁ బానీయములును
నిది యది యనంగ నేల? లే దేకొఱంత;
భాజనంబులలో నింపఁబడి సమస్త
జనులయెదుటఁ దమంత సాక్షాత్కరించె. 131

తే. అపు డపుడె వండి వార్చినయట్లు సెగలు
వాఱఁ, గన్నులు ప్రక్కలౌ ప్రాంతరాజ
నంపు టోగిరములు కనకంపుఁబళ్ళె
రములఁ జంద్రమరీచిగౌరరుచి నోఁచి. 132

తే. గమగమలఁ గమ్మతావులు గడలుకొనఁగ
షడ్రసము లొల్కు వివిధభోజ్యములఁ జూచి
యెపు డెపు డటంచు మునియాజ్ఞ కెదురు చూచి
సారె గుటకలు మ్రింగనివారు లేరు. 133

వ. అంత నా బ్రహ్మర్షి లేచి నిలువంబడి సర్వజనంబులు వినునట్లు
మేఘగంభీరస్వనంబున నిట్లనియె. 134

తే. అడుగువారలు నిడువార లనుట యిచటఁ
గలుగ; దెవ్వరి కేది కావలయు, నదియ.

తలఁపులోన సిద్ధించు; స్వస్థత వహించి
భోజనము సేయుఁ డని ప్రియముగ వచించె. 135

వ. అంత. 136

మ. అదిరా! పాకవిధాన; మా! రుచుల వెం; పయ్యారె! పానీయసం
పద యంచున్ రుచు లెచ్చరింపుచు బలే! స్వర్గానకుం బెత్తెఁడౌఁ
గద! పైపై చ్చని లొట్ట లుట్టిపడఁ జంకల్ దట్టు చానందపూ
ర్ణదశం దాల్చి భుజించి రందఱు మునీంద్రప్రాభవం బెంచుచున్.

సీ. తనివిగా నే పదార్థము భుజింత మటన్న
నొకదానిఁ దలఁ దన్ను నొకటి రుచులఁ
జపలమై సకలభోజ్యపదార్థములకుఁ బ
ర్విడి పాఱు, నిల్వ దొక్కెడ మనంబు
తినుకొలంది రసజ్ఞ యనుట సార్థకముగా
సునిశితంబుగఁ బ్రౌఢిఁ జూపు జిహ్వ
నములుచో నంతకంతకుఁ గ్రమక్రమపరి
పాటిమైఁ గఱ కెక్కు వఱలు దౌడ

తే. తలఁచుకొనుచో తడవుగ సిద్ధ మగు శాక
పాకములఁగాని తినువారిపట్లఁగాని
లే దొకకొఱంత యనుమాట లేశమైనఁ
గడుపు చాలనికొఱంత యొక్కటియె దక్క. 138

మ. ఎటు - కానున్నది కాకమానదు, తినుం డేలా విచారింప, నై
నటు లౌ; నింతకుఁ బెట్టిపుట్టితిమి; పుణ్యం బేమి లేకున్న నె
న్నఁటికిం గల్గు? నయత్నసిద్ధము ననన్యప్రాప్య మత్యంతదు
ర్ఘట వాశిష్ఠసుధారసం బొదవుభాగ్యం బేమి సామాన్యమే!

తే. ఇంతపనిఁ జేసిన మహాత్ముఁ డేల రెండు
మూఁడుకడుపులఁ గలిగింపఁగూడ ? దనెడు
వారు, కొదవను మాట యెప్పటికిఁ దప్ప,
దక్షయమకద! భోజన మనెడువారు, 140

శా. గాసిం జెందఁగరాదు, ప్రాణములకున్ గాంక్షింపఁగారాదు, వ్య
త్యాసంబైనను జన్మజన్మ కసువుల్ ప్రాపించుటల్ సిద్ధ; మి
వ్వాసిష్ఠామృతభక్షణం బిఁక నలభ్యం, బాగళస్ఫూర్తి నేఁ
డే సాధించుట లెస్స యంచు నగి రెంతేఁ గేకిసల్ గొట్టుచున్. 141

వ. ఇట్లందఱు నిష్టాన్నసంతుష్టులైరి; సైన్యంబులోని గజాశ్వప్రము
ఖంబులైన చతుష్పద నివహంబులకు నుచితాహారంబుల సంతుష్టి
యయ్యె నంత. 142

తే. భోజనానంతరమునఁ దాంబూలచర్వ
ణం బొనర్చుచు నద్భుతానందపార
వశ్యమున నమ్మునితపఃప్రభావగరిమఁ
బూని యందఱు వేనోళ్లఁ బొగడి రపుడు. 143

వ. అంత రాజేంద్రుం డాశ్చర్యనిర్మగ్నుండై యిట్లనియె. 144

సీ. కట్టించెనా ? ముందుగా నిట్టివసతులు ?
మునుల కియ్యవి యేమి పనికి వచ్చుఁ ?
గల్పించెనా ? శీఘ్రగతి నప్పు డప్పుడే
పనివార లెవ్వరుఁ గనఁబడ రిటఁ,
గావించెనా ? విశ్వకర్మ నాహ్వానించి
యతఁ డిచ్చటికి వచ్చినట్లు లేదు,
సాగించెనా ? లేక సమయోచితంబుగా
నింద్రజాలము నిల్వ దింత సేపు,

తే. కలయుఁ గాదు; మానసికవికార మసఁగ
రా; దొక యపూర్వమైన చిత్రవిధసృష్టి;
భావనాశిల్పమునకు రూపముఁ దపఃప్ర
భావమునన సృజించె, జీవకళ నించె. 145

తే. వస్తుతతి లేదు, వండెడివారిఁ గాన:
మిందఱు భుజించి తనిసి రి దెట్లు? పాలు
బియ్యమును లేని పొంగలి వెలసె; గోడ
లేని చిత్తరు వొలసె నెందేనిఁ గలదె? 146

వ. అని పలికి విశ్వామిత్రుండు ప్రాంజలియై వసిష్ఠసంయమిం గాంచి.

చ. అడుగని దమ్మయైన నిడ దారయ నెచ్చటనైనఁగాని, యిం
దడుగుట లే, దొసంగు టది యంతకు మున్న హుళక్కి; కోరుటే
తడవుగ వచ్చుఁ; జిత్రమకదా! యపు డంటిరి వండనన్నమున్
వడకని వస్త్రమం; చనుభవంబుగఁ జూపితి రావిశేషమున్. 148

సీ. కొండ నెత్తిని మోచికొని వచ్చుబరువున
నెముకలు నుగ్గుగా నెసఁగు దొసఁగు,
నంబుధిఁ దఱచుచో నాశీవిషానలం
బలమి క్రమ్గిన యట్టి యంగలార్పు,
బరు వోపఁగా లేమిఁ దరిఁగొండ వెనువెంట
నమగంటి జడధిలోఁ బడిన బెడద,
హాలాహలజ్వాల కఖిలజగంబులు
బూడిద బుంగలై పోవు నెదరు,

తే. మఱువ రెవ్వ రాచంద్రభాస్కరముగాఁగ,
నమృత మందఱి కందలే దని కొఱంతఁ
దన్నుకొని చచ్చి; రిట్టి దివ్యాన్న మపుడు
చిక్కిన సురాసురుల కట్టి చేటు గలదె? 149

మ. అవనిన్ భావిగతిం దలంప కనె నిర్వ్యాజంబుగా మౌని 'నా
యన! మా నందిని దీప్రభావ; మపు డే నా కామధేనూద్భవం
గని యాతిథ్య మొసంగు మంటి; నిటు సంకల్పించుటే నాయొన
ర్చినకార్యం; బఖిలంబుఁ దానె సృజియించెన్ స్వప్రభావంబునన్'.

వ. అనిన నమ్మహీకాంతుండు, 151

తే. ఎపుడు సెల విచ్చితిరో? ధేను వెప్పు డివి సృ
జించెనో? గోచరింప దీ చిత్ర మెవరి;
కున్నటులె యుండి క్షణములో నొదవె నిన్ని;
యద్భుతంబును, మోదావహంబుఁ గాదె? 152

తే. ఎచట నున్నది నందిని? యేము చక్షు
రింద్రియముఁ బావన మొనర్తుమే? యటన్న
నమ్మహాత్ముఁడు శబళా! యటంచుఁ బిలిచెఁ;
బరుగునను వచ్చి యది మునిపజ్జ నిలిచె. 153

వ. అంత నందినిం గని యందున్నవా రంద ఱమందానంద సందానిత
హృదయారవిందులై యిట్లనిరి. 154

ఉ. కాటుక కన్నులున్, నిగనిగల్ దగు నీలపురా జగాజిగిన్
నీటగు కొమ్ములున్ మిసిమి నెక్కొను చిక్కని మేను, మేటిచొ
క్కాటపు వింతవన్నెలు, జగంబుల పున్నెపుఁబంట; యద్దిరా!
కోటివరాలమూట యిదిగో మనకన్నులఁ జల్లఁజేయుచున్. 155

సీ. తనప్రభావ విచిత్రతను జెప్పకయె చాటు
నింపైన శబలవర్ణంపుఁ దనువు;
తనకామదోగ్ధ్రిత్వమును నిరూపణసేయుఁ
గొమరు మీఱినయట్టి కుండపొదుగు;

తనదయారస మాశ్రితజనాళి కెజిఁగించు
విలువసేయఁగరాని చలువచూడ్కి;
తనవిలాసము నిరంతరముగాఁ బ్రకటించుఁ
గనువిందునెఱికీలు గంగడోలు;

తే. తనదు సంపన్నతను బవిత్రతను దెలుపు
ఘనత హరిద్రకుంకుమాంకపు సమర్చ;
తనుఁ గొలుచువారి మోహంపుఁదలపుఁ దెఱచు
కుంచెకోలయె యగుఁగాక కుచ్చుతోఁక. 156

వ. అని యాశ్చర్యసంభ్రమ భక్తిరసపూరిత విలోకనంబుల నాలో
కించి. 157

తే. కనినయంతనె లోకపావని యటంచుఁ
గామధేనువ్కెల్లరు నమస్కార మిడిరి;
పసుపుఁ గుంకుమఁ బూలును బ్రతిఁ బెట్టి
పూజసేసి ప్రదక్షిణంబులు సలిపిరి. 158

వ. మఱియు సర్వజనానందసంధాయినియైన నందిని మునీంద్రుని
ముందట నిలిచి గేఱు మని సారెసారెకు మోర సాఁచుచుండ
నమ్మహోత్ముండు ప్రేమరసతరంగితంబులగు విలోకనంబు లొలయఁ
జంద్రమరీచితులనాప్రశస్తంబగు హస్తంబున నిమురుచు 'రాజా!
చూచితే సర్వజనానందినియైన మా నందిని?' యనుటయు. 159

శా. ఆకర్షించె నరేంద్రుమానసము నయ్యానందసంధాత్రి, లో
కైకాప్యాయనమూర్తి నందిని; నృపుం డానమ్రశీర్షంబుతో
సాకల్యంబగు భక్తితో సవినయాంచద్బుద్ధితో సంతత
శ్రీకంఠా మృదువాక్కుతో శిరమునం జేమోడ్పు సంధింపుచున్.

శా. పూజార్హుల్ మముఁ బూజసేసితిరి; మాపుణ్యం బగణ్యంబు; మే
మా జన్మంబుగ సంస్మరించెదము మీయాతిథ్యవైచిత్రి; ని
ర్వ్యాజంబైన భవత్కటాక్షము మహాత్మా! నిత్య మాశింతు; నే
రాజార్హంబగు నొక్కయర్థము మిముం బ్రార్థింతు మన్నింపుఁడీ!

మ. భవదాతిథ్యములోన నంకురితమై ప్రాగల్భ్యముం జెందె; దై
వవిధిం గొమ్మలు రెమ్మలై యిఁక ఫలప్రాయంబహో, మానిపుం
గవ! నాకోర్కి భవత్కృపామృతము సోఁకన్; 'రత్నహారీ తు పా
ర్థివ' యన్ సూక్తిని సార్థకంబుగ సమర్థింపం గటాక్షింపుఁడీ! 162

తే. రత్న మిది, రాజు నేను సర్వజన విదిత
మవుట 'రత్నహారీ తు పార్థివ' యటన్న
ధర్మమును బట్టి మామకధనము గాన
శబల నిండు గోశతసహస్రమును గొండు! 163

వ. అనిన నరేంద్రునకు మునీంద్రుం డిట్లనియె. 164

తే. హవ్య కవ్యంబులు, సురద్విజార్చనములు
జప తపో దాన బలి హోమ సవనములును,
బ్రాణయాత్ర తదాయత్త మగును గానఁ
గామగవి నెట్లు నీ కీయఁగలనొ? చెపుమ! 165

వ. అనిన రాజేంద్రుండు. 166

ఉ. హవ్యముఁ గవ్యముం ద్విజసురాతిథిపూజన మాదియైన క
ర్తవ్యము లెల్ల నెట్టికొఱఁతల్ గనకుండుట కే యొసంగెదన్
దివ్యతరంబులై తనరు ధేనుల లక్ష సవత్సకంబుగా
భవ్యతపోనిధాన! మునివంశవిభూషణ! సత్యభాషణా! 167

వ. అదియునుం గాక మఱియును. 168

సీ. హైరణ్య రుచిరకక్ష్యాంకుశ గ్రైవేయ
నాగేంద్రములు పదునాల్గువేలు
నతిలోకరంహఃప్రసృతి దేశజాతమౌ
జవనాశ్వసమితి యిరువదివేలు
ననవద్య పాండుర హయ చతుష్టయయుక్శ
తాంగంబు లష్టసహస్రకంబు
ప్రథమప్రసవజాత బాలవత్స సమేత
గోసమూహము నొక్క కోటిసంఖ్య

తే. మఱియు సుమనోజ్ఞ రజత హైమ ప్రక్ల్ప్త
మణిగణవిభాసి వివిధభూషణకదంబ,
మిది యది యనంగ నేల? మీ కేది వలయు
దాని గైకొండు నందినీధేను విందు. 169

వ. ఇట్లత్యాతురంబుగఁ బలుకుచున్న రాజేంద్రు నాననంబును నిజ జరాభారంబున వ్రాలిపోవు రెప్పలం బలవంతంబుగ నెత్తుచు నీష దుత్ఫుల్లలోచనంబుల నెగాదిగం జూచి దరహాసితవదనుండై నాయనా! నీ యీ సర్వవస్తు సమగ్రంపుఁ గలిమి యే మెఱుంగ మని తలంపకుము; మేము సర్వసంగపరిత్యాగుల మని యెఱుంగుము. 170

క. ఏ కాలంబునఁ దప్పవు
మా కగ్నులు దర్శపూర్ణమాసలునున్ స్వా
హాకార వషట్కార
ప్రాకట జపహోమదాన బలిసత్కర్మల్. 171

తే. దీనికై నీ వొసంగెడు ధేనుగణముఁ
గట్టఁ గాపింపఁ దగిన దక్షత వహించి
లేనిపోని జంజాటంబుఁ బూని తుదకు
గుడిసిఁ బడిన యెలుకవోలె మిడుకవలదె? 172

శా. నీకున్ క్షుద్వినివారణంబునకుఁ గా నే నౌషధం బిత్తు; నా
కాకంఠంబుగ షడ్రసాభినవ దివ్యాన్నంబు నిమ్మంటి; మే
లే కా; నా రతనంబు, నా ధనము నా కీయావె సర్వస్వ; మీ
శ్రీకళ్యాణి మదీయ జీవనము; వాంఛింపంగ నీ కర్హమే? 173

తే. లక్షగోవులకైన వేలక్ష కరుల
కైన శతకోటి హయములకైన నిడను;
శాశ్వతధనంబు నాకు నీశబల; మాన
వంతునకుఁ గీర్తివోలె భూపాలతిలక! 174

వ. అని యాశావకాశంబు లేశంబైన లేకుండ నెయ్యెతెఱంగుల వచించె నెయ్యెతెఱంగులఁ దదాశ్రయంబు దురాశాపిశాచికావేశ పరవశంబయ్యె; నంత రాజేంద్రుం డిట్లనియె. 175

మ. పరిపూర్ణుల్ విషయస్పృహావిరహితుల్ బ్రహ్మైకతానస్థితిం
జరితార్థుల్ గద! మీరు; కామగవియో సర్వార్థసంధాత్రి; మీ
కెఱుఁగన్ రానివి శేషముల్ గలవె? స్వామీ! లోకకళ్యాణసుం
దరసందర్భనిరోధమైన యనుబంధం బెట్లు పొందుం గురూ! 176

ఉ. కోరెడువంతు లోకమునకున్, నెఱవేర్చుట కామదోగ్ధ్రికిం
దీఱిచి సృష్టిఁ జేసె జగతిన్ భగవంతుఁడు; కోరువార లె
వ్వారును లేని దేశము నివాసమ కే మన కామదోగ్ధ్రి; కే
కారణమందు? రీయడవిఁ గాచిన వెన్నెలపొల్పు సంయమీ!

వ. అనిన మునీంద్రుండు చిఱునగవుతో నిట్లనియె. 178

తే. శబల దైవికవిభవాభిజాత గాని
మనకుఁ బశుపంచలోహసంపదకు వచ్చు
ప్రాకృతపశువు గాదు; విభ్రాంతి విడువు
మీ 'న రత్న మన్విష్యతి మృగ్యతే హి!' 179

క. నందిని యే మనుకొంటివో ?
నందినియే సుమ్ము నాకు; నాయన! యింక నీ
కెందుల కిట్టి వృథాభ్రమ ?
మందనిపండని తలంచి యాస విడువుమిా. 180

వ. అని పలికిన రజోగుణప్రాబల్యంబున గాధినందనుని డెందంబు నందినిపై ననురాగ బంధురంబై మొఱకుఁదనంబుఁ దాల్చె; తా దృశానూచాన రాజర్షి వంశసంజాతుండును, విదిత నిఖిల నిగమాగమ పురాణేతిహాస భాసురుండును, సకలధర్మమర్మజ్ఞుండును, నభిరామగుణాకరుండును, నార్యసమ్మతుండును నైన యమ్మహీకాంతు నెమ్మనం బెమ్మాడ్కి యమార్గగామి యయ్యెనో? — ఆ బ్రహ్మస్తంబపర్యంత సచరాచరప్రపంచంబున కంతకు ననుల్లంఘనీయంబైన భవితవ్యతాబలంబ కాక వేఱున్నదే? ఇట్లు సర్వభూతనియామికమైన యైశ్వరియగు శక్తివలనఁ బ్రేరితుండై మొగంబుఁ జేవురింప మునీంద్రునివంకఁ జురచురం జూచుచు రాజేంద్రుం డిట్లనియె. 181

శా. శాంతిం జెంది యిహాభిలాష కెటులో స్వస్తిం బ్రసాదించి య
త్యంతంబుం దపియించి, ఘోరముగ నాహారంబు వర్జించి కన్
గుంతల్ గుంజిన నాశ దీఱునె? 'అసంతుష్టా హి నష్టా ద్విజా
స్సంతుష్టా ఇవ పార్థివా' యనెడు శాస్త్రం బేటికిం? గాల్పనే?

క. తా ననుభవింపఁ డఁటె యెవఁ
డేనిఁ బ్రియంపడిన వాని కీయం డఁటె; యీ
ధేనువు లుబ్ధద్రవ్యం
బైనది; తప్పదిది రాజహస్తగతం బౌ. 183

వ. కావున ధేనువు నదలించికొనిరండు. మన గోగణంబులోనఁ జేరుఁ గాక; యని యాజ్ఞాపించుటయు రాజభటులు నందినీధేనువుం గదిసిపట్టిన నయ్యది చింతాకులితస్వాంతమై యిట్లని చింతించె.

శా. ఏనేరం బొనరించితిన్ ? గురుఁడు న న్నేలా యుపేక్షించె ? నా
త్మానాథుం డడుగంగ ఖండితముగాఁ గాదంచు వాదించియున్
మౌనంబున్ వహియించి పర్ణకుటిలోనం గూరుచున్నాఁడుగా!
యే నీక్షత్రియగర్వదుర్విలసితం బేరీతి సైరింతునో ? 185

క. ఏదోస మెఱుఁగనఁటె! తన
పాదంబుల నాశ్రయించి బ్రదుకుదునఁటె! బా
ల్యాదిగఁ బోషించెనఁటె! ని
రాదరణంబును వహించునా నందినిపై ? 186

వ. ఇట్లు చింతించి యమ్మహాత్ము నభిప్రాయం బెఱుంగఁగోరి, రాజకింకరులఁ గాళ్ళం దన్ని, కొమ్ములం జిమ్మి, విదలించికొని పరుగుపరుగున గురుని చెంత కరుగుదెంచి కన్నీరు జడిగొనఁ జిన్న వోయిన మొగంబున మనుజభాషతో నిట్లనియె. 187

ఉ. ఓ మునిచంద్ర! యో సుమహితోజ్జ్వల దివ్య తపఃప్రభావ! యో
హో మహనీయమూర్తి! యిటు లూరక నిర్దయఁ బూని తేల ? న
న్నీ మెయి రాజకింకరులు హింసలఁ బెట్టుటఁ జూడ లేదె ? నా
దే మపరాధ ? మింతటి యుపేక్ష యొనర్చితివేమి సద్గురూ! 188

వ. అని కన్నబిడ్డ తెన్నునం దన సన్నిధి న్నిలిచి కన్నీరు మున్నీరు గాఁ గార వలవల నేడ్చుచున్న నందినిం గాంచి మునీంద్రుండు కటకటం బడుచు గద్గదస్వరంబున నిట్లనియె. 189

మ. అపరాధంబు నొకింత నీ వెఱుఁగవమ్మా! నీపయిం బ్రేమ నా
కెపుడుం దక్కువ గాదు; మేలునకుఁ బో నే తెంచెఁ గీడడ్డమై;

త్రపఁ బుట్టించును నాదు శ్రోత్రియపు ట స్తవ్య స్తకృత్యంబు; ని
ష్కపటుండన్; గడ కేఁగు కర్మమునకుం గా లొడ్డితిన్ వెట్టినై

తే. పోవువానిని బోనీక బుద్ధి పూరి
మేసి బలవంతముగ నిల్పి చేసినాఁడ
రాచమర్యాద; పులిచూపు, రాచచూపు
పాఱి సుఖ మొందువార లెవ్వారు గలరు? 191

తే. బ్రహ్మకు జనించెఁ గుశుఁడు; నే బ్రహ్మసుతుఁడ,
నతఁడు రాజర్షి, నేను బ్రహ్మర్షి నైతి,
నతని మునిమన్మఁ డితఁ డని యాదరించి
చుట్ట మని చూడ దయ్యమై పట్టె నాకు 192

క. బలము, ధనబలము, మఱి దో
ర్బల మతనిది; గోఁచిపాఁతరాయఁడ; నే నే
బలిమి నిను నిలిపికొందును?
బలవంతుల సొమ్ము గాక బాపలసొమ్మా? 193

వ. అని పలికి మెత్తవడిన చిత్తంబున న త్తపస్వి యూరకున్న నందిని
మునీంద్రున కిట్లనియె. 194

శా. తండ్రీ! తప్పుఁదలంచి పల్కితివి; తీవ్రం బెందునం బోలు? మీ
మేంద్రంబైన తపోబలంబునకు; భూభృత్పాళి మీ రెప్ప డా
పుండ్రో యప్ర సపత్రుతం బ్రబలు; మీ రొక్కింత చేపీడినం
గుండ్రా లేకద! వీరి యోగ్యతలు; మీకున్ మాకునుం గ్రొత్తలే?

క. తీండ్రమగు తపము వృథగా
వీంద్రకు వెచ్చింప లేక వెనుదీయుచు మీ
రుం; డ్రీకారణమున నీ
గుండ్రాలకుఁ గాళ్ళు వచ్చి గునగున నడచున్. 196

తే. బ్రాహ్మణుని చేతి మృణ్మయపాత్ర మెపుడుఁ
బార్థివుఁడు; చే ధరించినఁ బాత్ర మగును;
చేయి వీడినఁ బెంకులై చెదరిపోవు;
నిది యెఱుంగ రహంకార మెదిగినపుడు. 197

చ. సెలవిడి పంపుఁ డేఁ దెలియఁజేసెద బ్రహ్మబలైధితోజ్జ్వలో
జ్జ్వలమగు నా బలంబు నొకసారి; క్షణం బటు సాక్షిభూతులై
నిలువుఁడు; రాచవంగడపు నిక్కులు గిక్కులు వాఁగు పాలుగా
వలయు; నిఁ కెన్నఁడేని మన వైపునకుం బొడసూపకుండుతన్. 198

వ. ఇట్లు వేగిరపాటును, గోపంబు నుద్దీపింపఁ బలికిన నమ్మహానీయుం డమ్మా! నీ సమ్మతం బెమ్మెయి నమ్మాడ్కి నొనర్పు మనుటయు నక్కామగవి తత్క్షణంబునం బ్రతిపక్ష వీరులవంక మిఱుమిట్లు గొలిపెడు కఱకుఁజూపులఁ జురచురం జూచి కోపావేశంబునఁ గాలు దువ్వి, కొమ్ముల నేలఁ గుమ్మి, తోఁకయెత్తి, యవష్టంభ సంరంభ విజృంభమాణమై హుంభారవం బొనరించె; నంతఁ దత్సంకల్ప మాత్రంబున నసంఖ్యాకులును, జననసమయమాత్రసముచిత పంచ వింశతివర్ష వయస్సంపన్నులును, మహాబలయుతులును, నాజాను దీర్ఘబాహులును, విధృతశరచాపాసిప్రముఖ నానావిధాయుధు లును నగు పప్లవు లుదయించి, రంకెలు వైచుచు బింకంబులు పలుకుచు మా కేమి సెల? వెవరి నడుగవలయు? ననుచుండ రోషభీషణంబు లగు మనుజభాషణంబుల నక్కల్మాషి విశ్వా మిత్ర సైన్యంబులఁ జూపి యీ మూఁకల నేలపాలు సేయుం డని యాజ్ఞాపించుటయు వారద్భుతంబుగ నార్చి పేర్చి యొక్క యూకునం గౌశికానీకినిపైకి దూఁకిన నచటి వారంద ఱాశ్చర్య సంభ్రమంబు లెసంగం జూచి కటకటా! యిది యేమి? కుడిచి కూర్చుండి వినోదకథాకథనంబులఁ బ్రొద్దుపుచ్చుచుండఁ దలవని తలంపుగాఁ బ్రళయం బుప్పతిల్లె ననువారును, లెండు లెండు, పగఱ

నదలింపుఁడు, బెదరింపుఁడు, కొట్టుఁడు, మట్టుఁడని సేనాధిపతులు తెలుముచుండ నాయుధంబులఁ దడవువారును, నరదంబుల కరుగు వారును, హస్తిగణంబులఁ గదుపువారును నై రింతలో నసి యొనర్ప నసమర్థులైన రాజకీయోద్యోగులును, స్త్రీబాలవృద్ధా దులును, పప్లవప్రయుక్త విప్లవంబునకు వెఱచి పరుగువాఱు చుండ విశ్వామిత్ర సైన్యంబులు రథాశ్వగజ పాదాతంబులఁ గూర్చుకొని మిన్నుముట్ట నార్చుచు వచ్చి పప్లవానీకినులపైఁ దవుల్పడినఁ జోరు ఘోరం బయ్యె. 199

క. చెక్కలు వాఱిన రథములు,
ముక్క లయిన యస్త్రశస్త్రములు, మస్తకముల్
పక్కనఁ బగిలిన యేన్గులు,
దిక్కు లెఱుంగకయ పాఱు తెంచు హయంబుల్. 200

మ. ప్రళయాభీల దవానలం బటు ప్రతాపస్ఫూర్తి శోభిల్ల ను
జ్జ్వల పాశాంకుశ భిండివాల పరశుప్రాసాది నానాయుధం
బులఁ గొంచున్ యమకింకరుల్ బలెఁ బరవ్యూహంబులన్ ముక్కముక్కలుగాఁ జెక్కిరి పెక్కురీతులఁ గడంకం జూపుచుం బప్లవుల్.

మ. తలలున్ మొండెము లంగభంగములు మీఁదం దేలఁగా రక్తపుం
బొలపల్ వాఱెఁ, బిశాచ కంక బలిభు ఙ్మ్రుఖ్యంబు లొక్కుమ్మడిన్
జెలరేఁగెన్; బలమయ్యెఁ బప్లవుల యుత్సేకంబు; రాట్సైన్యముల్
నిలువంజాలక కాల్కొలందిఁ బఱచెన్ నిర్ముక్తకంఠధ్వనిన్. 202

మ. పలుచంబాఱిన స్వీయసేనలకు విశ్వామిత్రుఁ డాధారమై
నిలుఁ డోహో! నిలుఁ డేల భీతిల? సమున్నిద్రప్రతాపజ్వాల
జ్వలనజ్వాలల భస్మసాత్కృతి నొనర్పన్ వచ్చుచున్నాఁడ శ
త్రులు; నంచుం దఱిమెన్ రథంబుఁ బ్రళయోద్ఘుష్టాభ్రగర్జార్భటిన్.

సీ. ప్రళయభైరవభుక్తపరిశిష్ట మన మొండె
ములు తలల్ రణభూమి డులిపి డులిపి,
కల్పావసాన తిగ్మమరీచిరోచిరు
త్కట తేజమునఁ బడఁగాల్చి కాల్చి,
సంవర్త శిఖిశిఖా సఖమైన శరపరం
పర మిడుతలఁబోలె మాడ్చిమాడ్చి
కాలరుద్రాకృతిఁ గడు భయంకరముగాఁ
జలిచీమ లనఁ గాలఁ జమరి చమరి

తే. చటుల నిర్ఘాతసమ సముద్భట కఠోర
రట దలఘు శింజినీ మహార్భటులఁ బెటిలి
బ్రగ్గు మనుచు నజాండకర్పరము వగుల
ఘనకదన కేళిఁ జెల్లాడె గాధిసుతుఁడు. 204

వ. అంతకుమున్న చెల్లాచెదరై దిక్కులకుఁ బాఱిన నిజసైనికు లమ్మేటిమగని యాటోపంబుఁ గని ధైర్యంబునం బొదువుకొని వచ్చిరి; విశ్వామిత్రునిపుత్రు లొక్క నూర్వు రుక్కుతునియల వంటివా రుక్కు మిగిలి రథనేమి కరిచరణ తురంగఖురపుట భటపాద సంఘట్టనలచేత ధరణీతలం బద్రువ నడచి; రి ట్లుభయ సైన్యంబులుం బోరు సాగించుచుండ సురభి యావేశంబున మఱల నసంఖ్యాకులైన వీరభటుల సృజియించె; వారును హేమ కింజల్కసన్నిభులును, రుక్మవర్ణాంబరాశ్రితులును నేల యీనినట్లు వొల్చిన నయ్యవనమిశ్రితంబైన సైన్యంబుధాటకు నరేంద్రుని మొనలు సుడివడియె; నంత నత్తుద్రవాత్ర తేజంబు ప్రజ్వలించె.

మ. ప్రళయార్క ప్రతిమాన తేజ మొలయన్ బ్రహ్మాండముం దూదిబుం
గలుగాఁ జేయు తెఱంగునం గనకపుంఖ ప్రేంఖదుగ్రాశుగం
బుల నొక్కుమ్మడిఁ గుప్పఁ గూరలుగ నిప్పుల్ రాలఁ గుప్పించె ల
క్షలు కోటుల్ శతకోటు లర్బుదములై వ్యోమండలిన్ నిండఁగన్.

చ. సుతశతకంబు తోడయి వసుంధర గోడివడంగ నాహవో
ద్ధత రథ దంతి ఘోటక పదాతిబలంబులు పేర్చి యార్చి య
ప్రతిహతరీతిఁ దాఁకిన నభంబును భూమియుఁ బూరటిల్లె ఘీం
కృతులును డాంకృతుల్ శ్రవణకృంతనదుందుభిఘోరభాంకృతుల్

తే. మంట లెగసి విశ్వామిత్రు మార్గణాగ్ని
కామధుక్సృష్టి వేగితోద్దామబలులఁ
గాల్చె నిబిడాటవింబోలె ఘనతరచ్ఛ
టచ్ఛటరవం బజాండభాండంబు నిండ. 2

వ. అది గాంచి బ్రహ్మర్షి మఱల సృజింపు మని ప్రేరేచిన మేఘ
దుందుభిరావిణియగు నక్కామధేనుసంభవ మఱల హుంభారవం
బొనరించె. 209

సీ. హుంభారవంబున నుత్పన్నులైరి కాం
భోజు లసమసమిద్భూరిబలులు
యోనిదేశంబున నొదవిరి యవను ల
ద్భుత తేజులును మహోన్నతశరీరు
లలశకృద్దేశంబునం దుదయించిరి
శకులు శస్త్రాస్త్ర నిస్తంద్రభుజులు
పొదుగులోపలఁ బప్లవులు రోమముల మ్లేచ్ఛ
లుఁ గిరాతహారీతులును జనించి

తే. పరశు పట్టిస కుంత తోమర గదాసి
కార్ముక ప్రాస పరిఘ చక్రములఁ దాల్చి
యున్నటులెయుండి యొకపరి యుట్టిపడిరి
పిట్టపిడుగున దివి భువి పట్టకుండ. 210

వ. ఇట్లువ్వాసిష్ఠ బలంబులు పరసైన్యంబులం దలపడి రథంబులం
గూల్చి, కేతనంబుల రాల్చి, యేనుంగుల మోది, హయంబులఁ

చెదిపి, కాల్వుర నుక్కడంచి యొక్క ముహూర్తమాత్రంబున రాజేంద్రుండునుం దత్పుత్రు లొక్క నూర్వురుం దక్కఁ దక్కటివా రొక్కరుం జిక్కకుండఁ జక్కుఁ జేసిన నరేంద్రుం డాగ్రహోదగ్రుండై సుతశతకంబు తోడురాఁ గదలి వీరవిహారం బొనరించె. 211

శా. సంధుల్ గాఁడఁగ నేసెఁ గొందఱిని, మస్తంబుల్ దెగం గొందఱిం,
బంధించెన్ మఱికొందఱిన్ శరములన్, మధ్యేసముద్రంబునన్
మంథానాచలమో యనంగఁ దిరిగెన్ మార్తాండకోటిప్రభా
బాంధవోజ్జ్వలదుగ్రతేజమున విశ్వామిత్రుఁ డత్యుద్ధతిన్. 212

క. పిడుగ డఁచినట్లు వడి; రె
క్కడివా రక్కడనె యవనకాంభోజముఖుల్;
కడు వింత యయ్యె ఖచరగ
రుడ కిన్నర యక్ష కింపురుష ముఖ్యులకున్. 213

చ. తలఁచిన వచ్చుసైన్య మది; దానికి మేరయె లేదు; చచ్చినన్
మొలుచుచునుండు; నింతబలమున్ బరిమార్చిన గాధిపుత్రుదో
ర్బలమున కేది సాటి? బళిరా! యని యద్భుత మంది రంద; ఱా
వల నరనాథసూనులు నభంబును భూమియు బ్రయ్యనార్చుచున్.

శా. ఈ యక్షౌహిణిఁ బాడుఁజేసిన శఠుం డీ బాపఁడే, వీనిఁ బో
నీయం గూడ దటంచుఁ బై కుఱుక వానీశానుఁ డోరోరి! మీ
యాయుశ్శేషము నేఁటితో ముగిసె నం చగ్నిజ్వాలజ్వాలికా
ప్రాయోదగ్రసమీక్షు హుమ్మనినమాత్రన్ భస్మమై రందఱున్.

వ. ఇట్లు సగజాశ్వరథపాదాతంబుగ నంద ఱొక్కనిమేష మాత్రంబున భగ్గునం బుగ్గియై పడిన నిర్విణ్ణుండై. 216

సీ. కోఁతి లాఁడ్చినఁ జిక్కి క్రూరాహివదువున
ఘోరంబుగా బుస గొట్టికొట్టి
నిశ్వేగమగు మహాసీరనిధిం బోలె
నిశ్శబ్దముగ నట్టె నిలిచి నిలిచి
యుపరక్త రవిబింబమో యనఁ గాంతిహీ
నంబైన మోముతో నలిగి నలిగి
తెక్కలం దులిచిన పక్కితేనివిధానఁ
జేఁ గాలుఁ గదుపక చిక్కి చిక్కి

తే. సిగ్గు మానంబు నలుక గాసియును వనట
రూపుఁ గొనినట్లు బ్రమ్మపడి, యేపు సెడి, ది
గుల్పడి, మనంబు సెదరి, గగ్గోలుపడి, ద
హించుశోకాగ్ని భోరున నేడ్చె విభుఁడు.

ఉ. హా సుకుమారులార! భువనైకధనుర్ధరులార! జీవమున్
బాసిన మీ మొగంబుల క్షణంబయినం గనకుండ బూదిగాఁ
జేసెనె యేకకాలమునఁ? జిన్నికుమారకు లింతమంది నన్
బాసినఁ జూచియుందనువుఁ బాయవు రోయవు మొండిప్రాణముల్

ఉ. అందని పండుఁ గోరి ఫల మందకపోవుట యట్లుుండ మి
మ్మందఱుఁ గోలుపోయి బల మంతయుఁ బాడొనరించుకొంటి; నా
బందుగు లాడిపోయఁ దలవంపులుఁ గాఁగ, భరింపరాని యీ
కొందలపాటునం జివికి క్రుంగి యయో చెడినాఁడ నన్నిటన్. 219

మ. నను గెల్వంగల బల్మిగండును జగానం దోఁచెనా? యాత్మఁడై
న నిరాధారశరీరమాత్రవిభవుండా? స్వప్నమా? లేక దై
వనియోగంబ? మహేంద్రజాలమ? మహీపాలుండ నే జన్నిగ
ట్టునకున్ లొంగితి, భంగపాటు నగుబాటుం జేటునుం జెందితిన్.

ఆ. ఆయుధముల? రథములా? గర్జితంబులా?
భ్రుకుటిమాత్రముననె బుగ్గిఁజేసె
నింతపెద్దబలము; నేమందు? నిది త్రాడు
లేనికట్టు, కోలలేనిపెట్టు. 221

చ. నలువురిలోని కేగతిఁ జనంగలనో? తల యెత్తి యేగతిన్
మెలఁగుదునో? దురాశఁగొని మిత్తికిఁ గన్నకుమారు లందఱన్
బలియిడినట్టి మూర్ఖనరపాలుఁ డితం డని లోకు లంద ఱ
గ్గలముగ నన్ను ముందుఁ జనఁగా వెనువెన్కల గేలిసేయరే!

ఆ. జన్నిగట్టితండు, జగతీపతిని నేన
టంచు మోసమాయె; నకట! తుదకు
వెక్కిరింపఁ బోయి వెలికిలఁ బడిన చం
దంబు వచ్చె; నిదియ దైవఘటన. 223

తే. కుడిచి కూర్చుండ కేల? యీదుడుకుసేఁత?
యింతకాలంబు సురభి లేకేమికొఱఁత
కానిపించె? దురాశ దుఃఖంపుఁ జేటు
వలచి రెంటికిఁ జెడిన రేవఁడుగ నైతి. 224

తే. ఉర్వి మానవుఁ డెవఁ డుత్తరోత్తరాభి
వృద్ధి నాశింపఁడే? దురదృష్ట మిట్లు
మిడిసి మీఁగాలఁ దన్నిన మేయఁబోయి
మెడకుఁ దగిలించుకొన్నట్లు మిడుకవలసె. 225

ఉ. ఎట్టి కొఱంత లేక జగమేలఁగవచ్చును గామదోగ్ధ్రి యు
న్నట్టయినన్ సుభిక్షము గదా! యని చూచితిఁగాని యద్దిరా!

పట్టినపట్టు వీడఁడఁటె బ్రాహ్మణుఁ; డెందును వేల్పుటావు లే
నట్టి మునీంద్రులందఱు మహాత్ములు గారె? తపంబు సెల్ల దే?

చ. దొరలకు మాత్ర మీ సురభితోఁ బనియే? మది లేక రాజ్యముల్
జరుగవె? యన్నచో నది నిజం బగుఁగాని ప్రజాసమృద్ధికై
నిరతముఁ గోరి జీవితమునే సరియొడ్డెడివార మేము; తా
నరయఁగ నొక్కప్రాణి; యెటులైనను నేమి? జగంబు క్రుంగునే?

ఉ. పెద్దలటన్న నాకుఁ గడుఁబ్రీతియె; లేచినవేళ యెట్టిదో?
రద్దికి మూలమైనది; పరాత్పరుఁడేమి ఘటింప నెంచెనో!
పద్దును వీడఁగూడ దనుపద్ధతి నా; దిటుపై నిఁ కేదియో
పెద్దవిశేష మున్న దనిపించెడు; నావల దైవ ముండెడున్. 228

ఉ. మంచియొ? చెడ్డయో? యదొక మార్పు ఘటిల్లు నటంచు లోన బో
ధించెడు నాత్మసాక్షి; దిగితిం దెగియించి; యెటైన నీఁతకున్
మించిన లోఁతు, నింతకును మించినహానియుఁ గల్గఁబోదు; యో
జించినచో మహాత్ములకుఁ జేయు విరోధముఁగూడ మేలెయౌ.

మ. ఎదియో హేతువు లేక నాదు హృదయం బీరీతి బ్రహ్మస్వమున్
మదిఁ గాంక్షింప; దకార్యముం దడవు టస్మత్సంప్రదాయంబునన్
మొదలే లేదు; చరాచరాళి తలక్రిందుల్ చెందినం బట్టు వీ
డద యంతఃకరణంబు; సంశయముపట్లం దా ప్రమాణం బగున్.

వ. అని తలపోసి యొక్కనిశ్చయంబునకు వచ్చి చావఁగా మిగిలిన యల్పపరివారంబుతో నిజపురంబగు మహోదయపురంబు సొచ్చి మిగిలి యుండిన యొక్కకుమారుని రాజ్యంబునకుం బట్టాభిషిక్తుం జేసి గురుపురోహితామాత్యప్రముఖులకుం గుమారు నొప్పఁజెప్పి హిమవత్పార్శ్వంబున కరిగి పరమేశ్వరుంగూర్చి తీవ్రంబుగఁ దపంబున కారంభించిన వత్సరసహస్రంబు కడచనియె నంత. 231

సీ. తొలుఁదొల్త వినువీథి నలవోకఁ గాన్పించెఁ
దరుణేందుకోటీరధవళరుచులు
నావెన్క వినిపించె హరజటాజూటగాం
గతరంగ ఘుంఘుమ ఘనరవంబు
తరువాత శ్రవణగోచరములయ్యెను శైవ
కరతాడనముల జేగంటరొదలు
నావెంట వినివించె 'హరహర శంభో మ
హాదేవ!' యను ప్రమథాళినుతులు

తే. నంతలోనఁ దుంబురు నారదానుగీయ
మానగానప్రసక్తి రంభాముఖాప్స
రః ప్రపంచితలాస్య మేర్పడఁగఁ, దోఁచె
నల వృషోపరి గౌరీసహాయుఁ డెదుట. 232

వ. ఇట్లమ్మహానీయనిధానంబగు దివ్యతేజంబు సాక్షాత్కరించిన రాజర్షి హర్ష పులకితగాత్రుండును, నర్ధనిమీలితనేత్రుండును నై సాష్టాంగదండప్రణామంబు లాచరించి, 233

మ. నిరతజ్యోత్స్నము నిష్కళంకమయి తండ్రీ! నవ్యకోటీరసుం
దరబాలేందు కలావిలాస మొకదండన్, జూటజూటస్థల
త్సరిదాలోల తరంగశీకర సహస్రం బొక్కచోఁ బ్రేమ ని
ర్భరముల్ చల్లనిచూడ్కు లొక్కదెస నాపైఁ జూపవే యీశ్వరా!

మ. బహిరంతస్తిమిరంబు దేనిఁ గనినన్ బ్రధ్వంసమౌ, దేనికి
న్మహి మంజూషిక లేదు, శాణము జగానం గానరా, దేఖనిం
గ్రహియింపంబడ, దెద్ది యోగుల కఖండప్రేమపాత్రంబౌ యు
న్మహితామ్నాయశిరోవతంసమణి కాత్మజ్యోతి కే మ్రొక్కెదన్.

వ. ఇట్లు ప్రార్థించిన సుప్రసన్నుండై యప్పరమేశ్వరుండు నీ యభీప్సితార్థం బెయ్యది ? నీ తపంబునకు సంతసించితి ననిన గాధేయుం డమందానందంబున దేవా! నాయందుఁ బరిపూర్ణానుగ్రహంబు గలిగెనేని సరహస్యం బగు ధనుర్నిగమంబు సమగ్రంబుగ నను గ్రహింపవే! త్రయస్త్రింశత్కోటిత్రిదశసంఘంబుచేంతను, దపోధనులైన సమస్తమునిజనంబులచేంతను నేయే దివ్యాస్త్రంబులు గల వట్టి మహనీయాస్త్రంబు లన్నియు నాకు సిద్ధింపవలయు; ననిన నట్లకాక యని యగ్గౌరీరమణుండు తిరోహితుండైన విశ్వామిత్రుండు వసిష్ఠుండు తనచేత నీల్గినవాఁడకా తలంచి వసిష్ఠాశ్రమంబున కరుదెంచి సింహనాదంబుఁ గావించి, ధనువు సారించి శంఖంబుఁ బూరించిన. 236

మ. కలఁగెన్ శైలగుహావిహారవిలసద్గంధేభ శార్దూల ఖ
డ్గ లులాయ ప్రముఖోగ్రజంతుతతి; కొండల్ మాఱుమ్రోసెన్;వన
స్థలి ఘూర్ణిల్లె; మునీంద్రు లాదిగ సమస్తప్రాణిసంఘంబు కా
ల్కొలఁదిం బర్విడెఁ ద్రోవ డొంకయును దిక్కుందోఁప
కొక్కుమ్మడిన్. 237

ఉ. ఎక్కడి దీ మహాధ్వని ? యిదేదొ యనర్థ ! మటంచు నందఱుం
దిక్కున కొక్కరై పరుగుదీసిరి; మంట లరణ్య మంతటం
బిక్కటిలెం; జ్వలజ్జ్వలనఫీట్కృతులుం బ్రబలెన్; క్షణంబులోఁ
జక్కడఁగెన్ వనం; బిరిణసన్నిభమయ్యె నరణ్యమంతయున్.238

మ. అది బ్రహ్మర్షి యెఱింగి కౌశికుని దుర్వ్యాపారమూలంబుగా
నొదవెన్ బాణమయాగ్నికీల లివి; యోహో! భీతిలం బోకుఁ డా
పద వారించెద; నేఁటితో నతని శాశ్వాసాంతమున్ సంతరిం
చెద నంచున్ దనయోగదండము గ్రహించెం దీవ్రకోపంబునన్.

వ. ఇట్లు యోగదండంబుఁ జేతం గొని నిశ్చేతనంబులై చూచు చున్న భూతజాతంబులపైఁ దోతెంచు నుత్పాతంపు బాణపాతం బుల కా తపస్విశ్రేష్ఠుండు పట్టరానికోపంబున. 240

సీ. సరభసంబునఁ బోవ సంధ్యారుణద్యుతి
చ్ఛటల నీనెడు జటాపటలి చెదరఁ
బ్రళయ భైరవ మహార్భటుల కుపాధ్యాయ
పదవిఁ దాల్చుచు గళధ్వాన మడర
సంవర్తసమయజాజ్వల్యమాన మహాగ్ని
సఖములౌ తీక్ష్ణవీక్షణము లెసఁగ
యోగదండముఁ గేల నూని యుద్దండ దం
డధర ప్రచండ తాండవము దనర

తే. నిటలతటమున వికటభ్రుకుటి ఘటిల్ల
నలికమున నక్షి దాఁచినయట్టి రుద్ర
మూర్తియో యనఁ గ్రోధవిస్ఫూర్తిఁ దాఁకె
దుర్నిరీక్ష్యమహామహోద్ధురత నృపుని. 241

వ. మఱియు నదభ్ర కాలాభ్ర గర్జార్భటీవిభ్రమం బొదవ నా బ్రహ్మర్షి యిట్లనియె. 242

క. జందెముల బాపఁ డని చు
ల్కందనముగఁ జూచితివో? యిఁకన్ నిలువుము నా
జందెముల పాటవము నీ
కుం దెలిపెదఁ గనుల నున్న క్రొవ్వు దులిపెదన్. 243

వ. అనిన విశ్వామిత్రుండు. 244

చ. సమరహిత ప్రచండమగు క్షత్రియ తేజము, గాధివంశ సిం
హ మిది మెఱుంగుమీ! యెచటనైన నమాయికు లున్నచోట జం

దేముల పరాకు సెల్లు; నిటఁ దెల్పకు మయ్యది; యయ్యవారిజం
దేము లయవారి కేయురి; మునిప్రవరా! వినవాక్కొకసామెతన్ ? 245

వ. అని పలికి కనుల నగ్నికణంబు లొలుక మహాసంవర్తసమయ ప్రచండమారుత క్షుభిత పుష్కలావర్తక కఠోర స్తనిత ఘుర్ఘురాను నాది యగు టంకారం బెలయించి ప్రళయాగ్ని జ్వాలలు గ్రుమ్మ రించు శరపరంపరలు పరగించిన. 246

శా. ఆగ్నేయాస్త్రము రూపుమాసినది, వాయవ్యాస్త్రమున్ వీడినన్
భగ్నంబైనది; సౌర ముక్కసెడె; నైంద్రంబోడె; గాంధర్వ ము
ద్విగ్నంబైనది; యంతకాస్త్ర మడఁగెన్; విద్యాధరం బాది కా
లాగ్నిప్రాయము లన్నియొక్కగడెలో వ్యర్థంబు లయ్యెం దుదిన్.

వ. మఱియు నాగాస్త్రంబును, వారుణంబును, గారుడంబును, నర్ధ చంద్రంబును, రౌద్రంబును, ద్వాష్ట్రంబును, జృంభణంబును, సంతా పనవిలాపనంబులును, ప్రస్వాపనంబును, మానవంబును, రాక్షసం బును, సమ్మోహనంబును, గంకాళంబును, గాపాలంబును, గాల పాశంబును, వరుణపాశంబును, నాగపాశంబును, గాలచక్రంబును, ధర్మచక్రంబును, విష్ణుచక్రంబును, శూలంబును, ముసలంబును, ముద్గరంబును, శక్తియు, గదాదండంబును నిది యది యన నేల? సమస్త బ్రహ్మాండ మండలంబునం దెన్ని యమోఘాస్త్రంబు లెన్ని దివ్యాయుధంబు లున్న వన్నియు గౌరీరమణ ప్రసాదాసాది తంబులై గాధేయునకు సంక్రమించినవి గాన నతండు వానిలోనఁ బాశుపతంబును బ్రహ్మాస్త్రంబునుం దక్కఁ దక్కటి యాయుధం బుల నన్నింటినిఁ గుప్పఁగూరలుగాఁ గుప్పించిన నవి కల్పాంత కాల సంజాత జాతవేదో జ్వాలామాలికా విభ్రమ భ్రమాపాది తాదభ్ర జిహ్వాలంబులై బ్రహ్మాండంబుఁ గాల్చుచు మునీంద్రు నంతి కంబున కరుదెంచిన నమ్మహానీయుండు నిప్పులకుప్ప లుప్పతిల్లఁ జురచురం జూచి దండంబు జిరజిరం ద్రిప్పి తత్ప్రభావంబునం బ్రతి

హాతంబులం గావింపఁ జల్లార్పఁబడిన కొఱవులచందంబున నిష్ప్రభంబు లయ్యెఁ; నంత నక్కౌశికుండు కోల నడవఁబడిన మహానాగంబునడువున బుసఁగొట్టుచుఁ బాశుపతంబు నావాహనంబుఁ గావించె; నంత. 248

స్రగ్ధర. కలఁగెన్ సప్తార్ణవంబుల్, కదలెఁ గులగిరుల్, గాఢనిర్ఘాతపాత
ప్రళయోద్యన్మేఘగర్జార్భటుల దెసలు బంభజ్యమానంబులై భూ
వలయం బుఱ్ఱూఁతలూఁగెన్; వడఁకె భువనమాబ్రహ్మకీటంబునుద్య
జ్జ్వలనజ్వాలాస్ఫులింగచ్ఛటలు బహుసహస్రంబులై యుప్పతిల్లెన్.

వ. ఇట్లప్పాశుపతం బనేక సహస్రకోటి సూర్యబింబంబు లేకమైన జోక నురవడించి విరించిసూతిపైఁ బఱతెంచిన నమ్మేటి తపసి మిడుంగురులు సెదర వీక్షించి హుంకరించి 'ఓం శాంతి శ్శాంతి' నుచ్చరించిన నద్దివ్యాస్త్రంబు చప్పునఁ జల్లారి నిర్వాణ జ్వాలా మాలాలాతలాఘవం బయ్యెఁ; నంత నమ్మనుజేంద్రవ్యాఘ్రుంబు బ్రహ్మాస్త్రంబు ధనువున సంధించె నంత. 250

మ. తిరిగెం గుమ్మరిసారెయో యన ధరిత్రీచక్ర; ముగ్రార్భటిం
బరియల్ వాఱె మహాశనిప్రతతిచే బ్రహ్మాండభాండంబు; దు
ర్భరకాలానలకీల లుట్టిపడెఁ; బైపైఁ దాండవం బాడె భూ
ధరముల్ గాలిపటంబుల ట్లెగసి మాద్యద్ఘోరవాతోద్ధతిన్. 251

వ. ఇట్లద్దివ్యాస్త్రం బనేకకోటిసహస్రమహానిర్ఘాత సకృత్సంపాత సదృక్షోపద్రవాపాదియై యమ్మహర్షిపైఁ బఱతెంచిన విమానచారులగు దేవ గరుడ గంధర్వ కిన్నర కింపురుషాదులును, భూచారులగు మునీంద్రులును, నాటవికకిరాతులును, బశుపక్షిమృగగణంబులును, మఱియు నిఖిల ప్రాణికోటులును నిదియో విలయకాలమో యని గడగడ వడఁకుచుఁ బెదవులు దడు భయభ్రాంతస్వాంతులై యింకెక్కడి బ్రహ్మర్షి? మె

జీవితం? ఎక్కడి ప్రపంచం? ఏటిమాట! యని పలుగు వాఱుచుండ నెక్కడికక్కడనే యుప్పతిలి బుగబుగం బొగలు బుగుల్కొనుచు దగదగం జిచ్చు దగుల్కొనుచు మింట మంట నేకరీతిగా మంట లెగసి వెంట నంటి చుట్టుకొనిన నాఱ్ఱి జెంది వార్తాకంబులక్రియ నుడికి యుడికి మాఁడి బొగ్గులగు జీవులును, గుడియలు నీరై కదల మెదల నోపక నిర్విణ్ణులై ప్రాణ్నశి నిశ్చేతనంబులైన చిత్తరుబొమ్మలవఱువునఁ బ్రళయశిఖ శిఖావలయంబులు చుట్టుకొని నిట్టనిలువునం గాలి బూదియగువారును, హాహారవంబులు సేయువారునునై యతిజుగుప్సావహంబును, బీభత్సంబునునై యుండ నా బ్రహ్మాగ్ని సత్తముండు. 252

మ. తలఁగం బాఱఁడు, ధైర్యముం జెడఁడు, వక్త్రంబందు వైవర్ణ్యముం గలుగన్ లేదు, చరాచరోన్మథన జాగ్రత్కాల రుద్రోద్ధృత ప్రళయాభీల మహాత్రిశూలసమ భాస్వద్బ్రహ్మదండంబుఁ దా వలకేలం ధరియించి నిప్పుకలు కుప్పల్ రాల వీక్షింపుచున్. 253

మ. నిలిచెన్ మేరుధరాధరంబుపగిదిన్ నిర్ణిద్రధైర్యంబుతో నలవిన్ మీఱిన బ్రహ్మవర్చసము గ్రీష్మాదిత్యకోటిప్రభోజ్జ్వలమై దిక్కుల నాఱసాతల నభఃపారంబుగాఁ బ్రాఁకి యస్ఖలితస్ఫూర్తి నజాండభాండము సమస్తం బావరించెం దగన్.

వ. మఱియు నమ్మహనీయ దివ్యబ్రహ్మతేజంబులోన నా బ్రహ్మాస్త్రంబు మహాసముద్రంబు సొచ్చి యడఁగు స్రోతస్వినివడువునం, బ్రళయాగ్నిజ్వాలలోన లీనంబగు వేఱొక యగ్నిచిదుంగురు తెఱంగున ఖద్యోతబింబంబు విద్యోతమానంబగుచుండ నాద్యావాపృథివీ ప్రసారంబగు తత్తేజంబులోన మిణుకరించు మిణుఁగురుఁబురువుకరణి నంతర్హితంబయ్యె; నిట్లమ్మహనీయబ్రహ్మతేజంబులోన నంతర్హితంబైన దివ్యాస్త్రరూపకంబగు రుద్రశక్తి కౌశికుని యందు న్యాసభూతంబై భవిష్యత్కాలంబున భగవదంశసంభూతుం

డగు శ్రీరామచంద్రమూర్తికి సంక్రమించి జగత్కల్యాణా
స్పదం బగు; నిది పరమేశ్వరోద్దిష్టం బగు దేవరహస్యం; బది
యట్లుండె; నంత నమందానందకందళితంబులైన డెందంబులతోడ
నందు సన్నివేశంబైన భూతగ్రామం బేకగ్రీవంబుగ నెలుంగెత్తి
యిట్లని యుద్ఘోషించె. 255

మ. జయ లోకైకతపోనిధాన! జయ విశ్వామిత్రదోర్గర్వదు
ర్జయ మత్తేభ మృగాధిరాజ! జయ సాక్షాద్బ్రహ్మ తేజస్తిర
స్క్రియమాణాఖిలలోకసార! యని నిస్సీమప్రసారంబుగా
జయఘోషంబులు మాఱుమ్రోసె దశదిక్చక్రంబు ఘూర్ణిల్లఁగన్.

వ. మఱియు దేవదుందుభులు మ్రోసె; బృందారక బృందంబులు నంద
నోద్యానానితంబు లగు పారిజాతకుసుమమాలికాసందోహంబులు
బ్రహ్మమునీంద్రునిపై వర్షించి; రిట్లు బ్రహ్మాస్త్రగ్రసనప్రసరదస
మాన బ్రహ్మతేజోబల సంపన్నంబైన యమ్మహాత్మునిరూపంబు
త్రైలోక్యమోహనంబును, దారుణంబును నై ప్రకాశించె; నట్లు
దుర్నిరీక్ష్య బ్రహ్మతేజోభిరామభీమంబైన తద్రూపంబు చూపఱుల
కనులకు మిఱుమిట్లు గొలుపుచుండఁ జూడనోపక సకలప్రాణి
సందోహంబులు గడగడలాడుచుండు నవసరంబున సురాసుర
దేవర్షి బ్రహ్మర్షి ప్రముఖు లిట్లని తలంచిరి. 257

మ. కనులం దొట్టిన మంట లాఱవఁటె! యింకన్ రోమకూపంబులం
దును ధూమాకులపావకార్చులు సముద్భూతంబు లౌఁ, గాలదం
డనికాశం బగు బ్రహ్మదండ మటు మంటల్ గ్రక్కుచుండెన్ క్షణం
బున వాసిష్ఠరుషాగ్ని ముజ్జగములం బూర్ణాహుతిం జేయుఁబో. 258

వ. అని యిట్లు భయభ్రాంతస్వాంతులై యమ్మహాత్ముని శాంతుం
జేయు టెట్లొకో? యని యోజించి తత్ప్రాంతంబునకుం బోవ

ధైర్యంబు సాలమి దూరంబుగ నంతరిక్షంబున నిలిచి కేలుదమ్ములు
మొగిచి యందఱు నైకకంఠ్యంబుగ నిట్లనిరి. 259

శా. "ఆపాతాళ నభస్థ్సలాంతభువనైకావిస్ఫురజ్జ్యోతిషే
తాపోపద్రవహారిభూరికరుణాధారాసుధావర్షిణే
పాపఘ్నాయ నమోऽస్తుతే భగవతే బ్రహ్మణ్యమూర్తే! విరా
డ్రూపి!" న్నంచు జపించి రొక్కపగిదిన్ రుద్రానువాకంబులన్.

క. అంతశ్శమయ విభో! త్వ మి
మం తే క్రోధానలం సమస్తభయద; మోం
శాంతి శ్శాంతి శ్శాంతి; ర
నంతశ్రేయో జగత్త్రయాయ విదధ్యాః, 261

క. శాంతాయ చిదానందని
శాంతాయ జగద్వ్యాపనసంతాయ నమోఽ
నంతా యాంతర్విద్యా
క్రాంతధ్వాంతాయ భువనకారణమహసే. 262

ఉ. ఆపద వాపెఁ దావకమహత్తరతేజము కౌశికాస్త్రసం
తాపితమై నశించుభువనత్రయిఁ; గరుణాలవాల! యు
ద్దీపితమైన తేజ మిఁకఁ దేజమునందు భరింపకున్న నీ
రూపుఁ గనన్ మహాప్రళయరుద్రుఁడు తాండవమాడిన ట్లగున్.

శా. శాంతింజెందెను క్షాత్రబాడబము; విశ్వామిత్రరాణ్మౌళి యు
ద్భ్రాంతుండయ్యెను; బ్రహ్మతేజమది వ్యాప్తంబయ్యెలోకంబులన్;
సంతోషించిరి లోకపాలురిఁకన్ శాంతింపు బ్రహ్మర్షికీ
టాంతప్రాణులఁ జూడు మెల్లయిరో? నిర్వ్యాజపారమ్యద్ధాకృతిన్.

శా. సాంగోపాంగముగా ధనుర్నిగమమున్ సాధించె గాధేయుఁ డా
గాంగేయాచలధన్విమెప్పు గని; తత్క్షాత్రానలజ్వాలలో
ర్వ్యాం గాలాంతకుఁ డోపఁ; డట్టి యఖిలాస్త్రజ్ఞాత యన్నన్న! కా
లుం గేలాడక చిక్కె; నింకెవఁడు నిల్చున్? నీ సమక్షంబునన్. 265

వ. అని యనేకవిధంబుల మునీంద్రు ననునయించి వినమ్రులై కినుక
వాపి శాంతుం గావించి రంత. 266

మ. ప్రళయాభీల మహాగ్ని చల్లవడియెన్; బ్రహ్మాండజాలంబులుం
బలవద్దివ్యసుధాభివృష్టిఁ బునరుత్పన్నంబులయ్యెన్; గృతా
ర్థుల మంచున్ సురసిద్ధసాధ్యులు మహర్షుల్ మున్నుగా నెల్లవా
రలు 'బ్రహ్మర్షికి జే' యటంచు ముదమారం జేరి రావాసముల్.

వ. అంత గాధేయుండు. 268

ఉ. గారుడమంత్రబద్ధమయి కాలు గదల్పఁగ లేక చిక్కు దు
ర్వారమహాభుజంగము తెఱంగున శీర్షము వంచి వెల్వెలం
బాఱుచు విన్నఁబాటు, నగుఁబాటును, గొందలపాటు, సిగ్గునుం
గూరినవేదనన్ మది విఘూర్ణితమై తలపోయు నివ్విధిన్. 269

ఉ. పాశుపతంబు రూపు సెడె, బ్రహ్మశరం బటు వ్యర్థమయ్యె, స
ర్వేశుఁ డనుగ్రహించినవి యెల్లఁ బరాస్తములయ్యె; నక్కటా
యా శశితారకం బయిన యాఱడియయ్యె; ఫలంబుఁ గోర ఘో
రాశనిపాతమా? శివశివా! కుశరాజకులాభిజాత్యమా? 270

ఉ. అంకెకు మీఱె నెప్పగిది నారసినన్ దురదృష్టభూత మా
తంకము లేకిటుల్ ప్రళయతాండవ మాడిన దీయభాగ్యుపై;
శంకరుప్రాపుఁ గాంచియును జాలమి నా కొనఁగూడె నన్నచో
నింక జగత్త్రయంబున నహీ ప్రతి యాజడదారిధాటికిన్. 271

ఉ. ఏల వృథాభిమాన? మిఁక నేను ధనుశ్శరముల్ ధరించుటల్
గేలియొనర్పఁగాఁ బడుటకే; యొక బ్రాహ్మణమాత్రు నోర్వఁగాఁ
జాలని క్షాత్ర మేల? జనసంఖ్యకుఁగా జగతిన్ సృజించెఁ గాఁ
బోలు విధాత రాకొలముఁ; బుణ్యవశంబున నబ్బె రాజ్యముల్. 272

ఉ. జందెపుఁ బోఁచలోఁ గలుగు సారము శస్త్రమునందుఁ గాన; మిం
కెందుల కిట్టి క్షాత్ర? మిటు లేడ్చుటకా? బల మన్న బ్రాహ్మ్యమే
ముందున కంజవేయు; నది పూర్వభవార్జితపుణ్యలభ్యమౌ;
సందియ మింత లేదు; శతశః ప్రతిపాదనఁ జేసి చెప్పెదన్. 273

శా. హుంకారంబుననే సమస్తభువనం బుజ్జూఁతలూఁగుం; దదీ
యోంకారంబె చరాచరంబులకు శ్రేయోదాయకంబౌను; త
త్సంకల్పంబుననే సమస్త; మది సాక్షాద్బ్రహ్మతేజంబు; సా
తంకంబుం బరిహాసమూలమగు క్షాత్రం బాఁగునే? దానికిన్. 274

మ. ధరణీపాలనవృత్తి క్షాత్రముపకుం ధర్మంబు; తన్మూలముల్
దురహంకార దురాశ; లందువలనన్ దుష్కృత్యముల్; దానికిం
బరిహాసంబె ఫలం బగుం దుదకు; దౌర్భాగ్యంపు క్షాత్రంబువం
బరమార్థం బిది;-బ్రహ్మతేజ మెడయైనం గవ్వకుం జెల్లునే? 275

మ. ఇది యేనాఁడో గ్రహించితిన్; హృదయమిట్లేడ్చెన్; విధిప్రేరణం
బిది;-యేదో యొక హేతు వున్న దని నన్నిప్డుం బ్రబోధించుచు
న్నది యంతఃకరణైకసాక్షి యటు ఘంటాఘోష మేపార; నా
మది యెన్నం డపథప్రవర్తన సహింపంబో; దిదే హేతువో? 276

వ. అని యొక్క ముహూర్తకాలంబు కనులుమూసి నిస్తరంగ సము
ద్రంబుచందంబున స్తంభించి 'ధిగ్బలం క్షత్రియబలం, బ్రహ్మ
తేజోబలం బల'మ్మని మూఁడుమాఱు లుద్ఘోషించి కన్నులం దెఱచి
సావష్టంభసంరంభ విజృంభణంబుగా నిట్లనుకొనియె. 277

శా. గాధేయుండన యేని ఘోరతపముం గావించి యెట్టైన స
ర్వాధిక్య ప్రతిభాసమాన మగు బ్రహ్మర్షిత్వ మిండంచు న
వ్వేధోరుద్ర చతుర్భుజప్రముఖులన్ వేధించి, బాధించి నే
సాధింతున్ సచరాచరాఖిల జగజ్జాలంబు ఘూర్ణిల్లఁగన్. 278

శా. విశ్వాసంబునఁ గన్నులం దెఱతురే? వేధోముఖుల్ నాకు?; స
ప్తాశ్వుఁడున్, శశియున్ గతుల్ దొఱఁగి సర్వానర్థపాతంబుగా
నిశ్వాసంబు లడంగి లోకములు సందిగ్ధస్థితిం జెందినన్
విశ్వామిత్రుఁడు కన్నులంబడును గానీ మాటలం దీఱునే? 279

తే. ఈ సముద్యమమును దొల్తనే కడంగి
తారసిల్లిన నీ యనర్థంబు గాదు;
దైవకృత మిది; యింతకుఁ దడిసి గాని
గుడిసెఁ గప్ప; రదే యొనగూడె నాకు. 280

వ. ఇట్లు యోజించి యొక నిర్ణయంబుఁ గావించి భార్యాసహితంబుగా హిమవత్పార్శ్వంబునకుం దపోభిగమనప్రయత్నంబునంజనియె.

—. ఆశ్వాసాంతము .—

శా. కారుణ్యామృతపూర! నీరదశుభాకారా! జగజ్జీవనా
ధారా! సారవచోవిచక్షణ! లసత్కల్యాణమూర్తీ! దర
స్మేరశ్రీకమనీయవక్త్ర! త్రిజగజ్జేగీయమానోజ్జ్వల
ఘోరాపారపటుప్రతాపవిచలల్లోకోద్దండదీక్షాగురూ! 282

క. బాల్యవశోత్సుకతా చా
పల్యకృత స్పర్శమాత్ర భవకార్ముకశై
థిల్యక్రియోత్కభంజన
తౌల్యాచరణా! సమస్తధర్మోద్ధరణా! 283

మాలిని. పరమమునిహృదంతర్భాస్వదానందఖేలా!
నిరవధికకృపాసందీపితాపాంగమాలా!
స్మరదశశతకోటిస్ఫారశృంగారలీలా!
సరసగుణవిశాలా! జానకీప్రాణలోలా! 284

గద్యము

ఇది శ్రీరామచంద్ర కరుణావిభవ కవితానుభవ
శివార్య తనూభవ సుధీజనవిధేయ సుబ్ర
హ్మణ్యానామధేయ ప్రణీతంబైన
బ్రహ్మతేజోబలంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీరామచంద్రగురువరబ్రహ్మణే నమః.

# బ్రహ్మతేజోబలము

లేక

# విశ్వామిత్ర చరిత్రము

## ద్వితీయాశ్వాసము

శ్రీ నిలయదివ్యమూర్తి! చి
దానందనిధాన! త్రిభువనావన! లీలా
మానుషవిగ్రహధర! ల
క్ష్మీనాయక! దివ్యధామ! సీతారామా! 1

వ. దేవా! యవధరింపు మక్కుశనాభపౌత్రుం డట్లు భార్యాసహితం బుగా హిమవత్పార్శ్వంబునకుం జని యం దొక్కయాశ్రమంబు నిర్మించి, యందుం దపంబున కుపక్రమించె; మఱియు నం దే హవిష్యందుండును, మధుష్యందుండును, దృఢనేత్రుండును, మహారథుండు నను పుత్రు లుదయించిరి. 2

మ. ఒకవేయేండ్లు దీక్షఁబూని తప మత్యుగ్రంబుగా సల్పె; దా
నికి సంప్రీతి వహించి బ్రహ్మ విబుధానీకంబుతోఁగూడఁ జెం
తకు విచ్చేసి, ప్రసన్నదృష్టిఁ గని వత్సా! మెచ్చితిన్ నీదుశ్ర
ద్ధకు; రాజర్షివి గమ్ము; లెమ్మనుచు నంతర్ధానముం జెందినన్. 3

ఉ. కన్నులు విచ్చి చూచి తనగాఢసమాధిపరిస్ఫురత్తపో
భ్యున్నతి మెచ్చి, యంబుజభవుండు ప్రసన్నతఁ జూపినట్టి యా
మన్ననయున్, వరంబు నణుమాత్రము తృప్తినిడంగఁ జాలమిన్
విన్నఁదనంబు, వేసటయు, వెక్కసమై తగ వెచ్చ నూర్చుచున్. 4

మ. ఒకనాఁడా? యొక యేఁడ? ఘోరతప మత్యుగ్రంబుగా వేయియేం
డ్లకు నిర్విఘ్నసమాప్తి సల్పితి నఖండప్రజ్ఞ; నేఁ గన్న దిం

తకు రాజర్షిపదం బటన్న నని కొండం ద్రవ్వి చిట్టెలుకం బ
ట్టికొనం గల్గినచందమయ్యెం; గనుంగొంటెం ఘాతిచాతుర్యమున్.

మ. సహజం బైనది మా కులంబునకు రాజర్షిత్వ; మే నింత దు
స్సహమౌ ఘోరతపంబు సల్పి యదియే సాధించినం జూచువా
రిహిహీ నాంగ శిరంబు నెత్తంగలనే? యేమైనం గానిమ్ము; ని
గ్రహ మేపారంగ నెంతకాలమయినన్ బ్రాహ్మ్యంబె సాధించెదన్.

వ. అని నిశ్చయించి మఱలం దపంబున కారంభించె; నది యట్లుండె.

—• త్రిశంకుని చరిత్రము •—

మ. ప్రజలం జల్లనిచూడ్కిం జూచుచు మహాప్రాశస్త్య మేపార స
ర్వజనానందముగాం ద్రిశంకుం డను భూపాలుడు పాలించు నీ
రజమిత్రాన్వయసంభవుం డొకండు సామ్రాజ్యంబ యోధ్యాపురిన్
విజితారాతి దిగంతసంతత యశోవిఖ్యాతి నా నొప్పుచున్. 8

మ. సవనంబుల్ భగవత్ప్రియంకరము, లిష్టాపూర్తముల్ మున్నుగా
నవిశేషంబులుగా సశాస్త్రవిధిగా సాధించె ధర్మంబులున్;
సవరించెన్ సురవిప్రబాంధవసుహృత్సంతుష్టి; వేయేల? సం
స్తవనీయంబు లఖండపుణ్యఫల సత్సంతానసౌభాగ్యముల్. 9

వ. ఇట్లారాజేంద్రుం డనేకయజ్ఞంబు లొనర్చి సశరీర స్వర్గప్రాపకం
బయిన యొక్కజన్నం బెదియేనిం జేయం దలంచి యద్దాని నిర్ణ
యింపను, నాధ్వర్యవం బొనర్పనుం గులగురుండైన వసిష్ఠమహర్షి
నాహ్వానింప నెంచి సాంతఃపురంబుగా, సమిత్రపుత్త్రపౌత్త్రంబుగాం
దదీయాశ్రమంబునకుం జని యమ్మహనీయు పదసరోజంబులకుం
బ్రణమిల్లి సవినయంబుగాం దనమనోగతాభిప్రాయంబు నివేదించి
ప్రార్థించిన నమ్మునీంద్రుం డిట్లనియె. 10

ఉ. ఎందుల కీదురాశ ? యిది యెవ్వరికిం ఘటియింప; దీజగం
బందుఁ బరంపరానుగతమై ప్రసరింపదె యట్టిదైన ? నీ
కందని మ్రానిపం డిది సుమా! యెవఁ డీయుపదేశ మిచ్చె? నీ
యందు లఘుత్వబుద్ధి నిటు లాడితి నంచుఁ దలంపఁ బోకుమీ! 11

ఉ. నావలనన్ లభింప దిది; నాయన! తాదృగనన్యభోగ్య భా
గ్యావహకార్యదక్షు లెవరైన ఘటించిన నంతకంటె మే
ల్గావలెనే? యనేకభవలబ్ధమహాసుకృతైకవాసనా
ప్లావితు దివ్యభోగసుఖభాసితు నిన్ గని సంతసించెదన్. 12

వ. అని నిరవకాశంబుగాఁ బలికిన నతం డచటు వాసి యమ్మహాత్ముని సుతశతం బున్న తపోవనంబున కరిగి వేర్వేఱఁ దత్పదంబుల కెఱఁగి యందఱ నొక్కయెడ సమావేశం బొనరించి సవినయంబుగా ని ట్లనియె. 13

మ. సశరీరంబుగ స్వర్గపుంబరిచితిన్ సాధింపఁగాఁ గోరి తా
దృశపుణ్యోదయలబ్ధియౌ మఖము నిర్దేశింపఁ దత్కార్యమున్
నిశితప్రజ్ఞ సమీకరింపను గడున్ నిష్ణాతులౌ మిమ్ము స
ర్వశుభారంభుల నస్మదీయగురులన్ బ్రార్థింపఁగా వచ్చితిన్. 14

మ. జలజాతప్రభవప్రభావులు, గురుస్వాముల్ భవత్తాతపా
దులు నాపై దయ దప్పి రెందులకొ? నాతోఁ గాదటం చాడి; రా
వల మీరైన ననుం గృతార్థు నొనరింపం జూడరా? యంచు, న
న్నలతిం జూడ రటంచు నమ్మికొని కొండంతాశతో వచ్చితిన్.

మ. గురుపాదుల్ పరమాప్తులై యెపుడు మాకుం గూర్త్రు; మాపూర్వులం
దఱికిన్ మీరె పురోహితుల్, గురువులుం దైవంబులుం; దాననే
చరితార్థుల్ స్థిరకీర్తులైరి మనువంశప్రోద్భవుల్; గాన మీ
చరణంబుల్ శరణంబు లంచు భవదాచార్యత్వముం గోరితిన్.

వ. అని ప్రార్థించిన నవ్వాసిష్ఠు లమ్మహీవల్లభశ్రేష్ఠున కిట్లనిరి. 17

మ. గురుపాదుల్ నెఱవేఱదన్నపని నీకుం గూర్పమే మేల ? యీ
శ్వరుఁడుం జాలఁడు; కానిపోనిపని కాశాపాశముల్ చుట్టి నీ
పరిమాణంబు నెఱుంగలేక వృధగాఁ బోరాడుచున్నా; విసీ !
పౌరసా; క్షేమనివచ్చి ? తీ దొరతనంపుంబట్టు గట్టెక్కునే ? 18

ఉ. కా దనుమాటలో విలువఁగానవు; గొంతెమకోర్కె లూరినం
గా దది, కాఁపు కాదు; వృథగా బలవంతముసేయఁబోకు; నీ
పై దయఁ దప్పిగాదు గురుపాగులు కా దని తెల్పు చెల్ల; న
త్యాదరదృష్టి నిదు హితమారసి తెల్పిరటం చెఱుంగుమా. 19

క. నా విని దివ్యసుఖంబుభు
క్తావేశితకలుషితాంతరాశయుఁడై యే
దో విపరీతగతి నతఁడు
భావించి వచించెఁ గర్మ బలవత్తరమై. 20

శా. ఇంకేలా ? సెలవిండు; నేఁ జనెద; స్వామీ ! దైవికం బిద్ది; నా
వంకన్ మీదయ దప్పె నేఁటి; కిది యేపాపంబొ ? కానిండు; నే
సంకోచింప; విశాలమైనది ప్రపంచం; బెందఱో పెద్ద; లే
సంకల్పం బుపసంహరించుకొనఁగాఁ జాలన్; క్షమింపుం డిఁకన్.

వ. అని యిట్లు సవినయ మృదుమధుర సౌమ్యతర వచనరచనాకౌశల్యంబున సౌశీల్యంబు మెఱయఁ బలికిన పలుకులనుండి మొలకలెత్తి వెలికిఁ దోఁచు సమగ్రం బగు నిగ్రహంబున నాగ్రహంబుఁ జెంది కోల నడవఁబడిన మహాభుజంగంబుల వడువున, సిఖ్ఖు సూపిన మదకరీంద్రంబుల తెఱంగున, సటలు వెఱికిన సింగంబుల భంగిఁ, జలితేంధనంబులగు ననలజ్వాలాజాలంబులపోలిక నురవడించి చురచురం జూచి తాపసర్షభు లిట్లనిరి. 22

—॰ వసిష్ఠపుత్రులు త్రిశంకుని శపించుట ॰—

శా. ఏమీ? నీకొఱకే సృజింపఁబడె నట్టే యీ ప్రపంచంబు? నీ
కై మోముల్ పయి కెత్తి చూచెదరుగా? యాధ్వర్యవప్రాప్తికై
శ్రీమంతుల్ మహనీయు లందఱు; యశశ్శ్రీ నిన్నె కాంక్షించె; నిం
కేమీ? నీమొగమంద ప్రొద్దు వొడిచెన్ హేరాళదీప్తిచ్ఛటన్.

వ. అని యెకసక్కెంబు లాడి వెండియు నిట్లనిరి. 24

శా. నీకంటెన్ మతిహీనులైరె? చెపుమా! నీపెద్ద; లీజోలికిన్
రాకుండం గతమేమి? నాఁడు సశరీరస్వర్గమార్గంబు లే
దా? కాకుండిన స్వర్గనిర్మితియె కాదా? క్రొత్తగా నేఁడు నీ
కై కట్టించిరొకో? దివంగతునిఁ జేయంబూని లోకేశ్వరుల్! 25

ఉ. చాలదురాశఁ బూని తెగసాగకు మూరక; నక్క యేడ? నా
కాలయ మేడ? మూర్ఖ! పరమార్థము వల్కి హితంబుఁ దెల్పినన్
బాలిశవృత్తి నిట్లు గురుపాదుల ధిక్కృతిఁ జేసినట్టి చం
డాలుఁడ వీవు; నీకు సవనక్రియలా? యని రొక్కపెట్టునన్. 26

వ. అంత 27

ఉ. చూచుచునే జగం బఖిలశూన్యముగాఁ గనుపట్టె నంతలో;
బూచులు గ్రమ్మెఁ గన్నులకుఁ; బూర్తిగ నంధతమిస్ర మెల్లెడన్
దోఁచె; మహత్తరంబును, సుదుస్సహమైన వికార మేచె; నే
దో చెడుగాల మున్నటులఁ దోఁచె మదిన్ నరనాథమౌళికిన్.

సీ. వలిపె క్రొంబట్టు దువ్వలువ లే మయ్యెనో?
కసుమాల మగు బొంత కటిని దనరెఁ
మణిగణోజ్జ్వల విభూషణము లే మయ్యెనో?
కడు హేయమగునుక్కుతొడవు లమరె

జారు సౌవర్ణకోటీర మే మయ్యెనో?
చిరిఁగిన కుళ్ళాయి శిరము నెక్కె
సహజలక్ష్మీవిలాసమ్ము లేమయ్యెనో?
నెమ్మోము పెద్దమ్మ నిలయ మయ్యె

తే. దినమణిసమాన కాంతి దేదీప్యమాన
నవనవోన్మేష రాజరాజ్యమహితశోభ
మాయమై త్రుటిలో నెందుఁ బోయెనొక్క-?
కటికి చండాలరూపంబు గానుపించె. 29

మ. గురుధిక్కారసమిద్ధకోపరభసోద్ఘుష్టంబులౌ వాక్కు లు
క్షురముల్ దప్పక యట్టె యుట్టిపడియెన్ జంఘాలభావంబు మా
యురె! భూజానికి; నట్లు కాదె మహనీయుల్; మాట లేమాత్రముల్,
కరుణాసూక్తులె దీవనల్, ప్రకుపితోగ్రవ్యాహృతుల్ శాపముల్.

వ. ఇట్లు గురుశాపోపహతుండైన నరేంద్రుదర్శనం బెల్లరకుం జుగుప్సా
వహంబై. 31

మ. తొలఁగం బాఱిరి దూరదూరముగఁ బుత్రుల్ మిత్రులుం బంధుగుల్;
కలఁ గన్నట్లు, మహేంద్ర దజాలము క్రియుం, గంధర్వమాయావిధిం
బలె మాయయ్యెన్ సముదోద్ధత ప్రబల శుంభ త్కుంభికోశంబు గాఁ;
దలఁపం గేవల మీ నృపాజ్ఞ కిదియే తార్కాణమై చెల్ల దే? 32

ఉ. 'అక్కట! యెన్నఁడుం దలఁచనట్టి తలంపుగ నొక్క పెట్టునన్
రక్కసతాపుఁ దాఁచి రభ బ్రాహ్మణు' లంచు నతండు గుండియల్
పక్కన వ్రీలిపోఁ బిడుగుపడ్డ వనస్పతిరాజమట్లు లో
నెక్కొను శోకవహ్ని ధరణిస్థలిపైఁ బడియెన్ గుబాలునన్. 33

వ. అంతఁ గొంతవడికి లేచి కన్నులం దెఱచి దిగ్భ్రాంతుండై
పెద్దయుం బ్రొద్దుఁ జింతించి. 34

ఉ. కంపితగాత్రుఁడై యొకటఁ గాల్ నిలుపం దరిగాన కాత్మలో
అంపపుఁ గోఁతయై నెఱనెఱల్ దనుకన్ మది గ్రాఁగి పొంగువా
టింపుచు నున్న శోకము భరింపఁగ లేక దురంతవేదనల్
పొంపిరివోవ తేఁడు తలపుచ్చిన కుక్క యనంగఁ ద్రిమ్మరున్. 35

వ. ఇట్లు పల్లియలుం, బత్తనంబులుం, గ్రామంబులు, నరణ్యంబులుఁ,
గొండలుం, గోనలు, నుపవనంబులు నిచ్చోటచ్చో టన కెల్లెడలం
ద్రిమ్మఁ దిరిగి పొమ్మసిల్లి యుమ్మలిక గదిరి యమ్మహీవల్లభుం
డెట్టకేలకు హిమవత్పార్శ్వమ్మున విశ్వామిత్రాశ్రమమ్ముం గాంచి
యచటికిం బఱతెంచి యమ్మహాత్ముని పదమ్ములకుం బ్రణమిల్లిన
నయ్యనఘుం డతనివంక నెగాదిగం జూచి. 36

క. ఇది యేమి? త్రిశంకూ! నీ
కొదవిన కర్మంబు? నిన్న యో! గుఱుతింపన్
మది చాల దయ్యె; నెట్లా
స్పదమైతివో యిట్టి నీచభావంబునకున్? 37

వ. అనిన నమ్మహానీయు పదసరోజంబులకుం బునఃపునః ప్రణామంబు
లాచరించి నరేంద్రుం డిట్లనియె. 38

చ. అనఘ! వసిష్ఠపుత్త్రుల దురాగ్రహ మీఁగతిఁ జేసె న; న్నిఁక నే
మని వచియింతు? నాదు బ్రతుకు కాఱడి యయ్యె; ఫలంబు లేకపో
యినను గులంబు గూడఁ జెడిపో దది; భిక్ష మిడంగ లేక కు
క్కను గవియించు దాతె నడుగం జనుజోగికిఁ దోడువచ్చితిన్.

చ. అనృత మెఱుంగ నెన్నఁడు; మహాత్మ! మదీప్సితసిద్ధి లేకపో
యిన సరియేకదా! హరిహరీ! పయిపెచ్చు పవిత్రవంశమం
దున జనియించు నన్నుఁ బడఁద్రోసిరె యీనరకంపుగోతఁ; బా
వన సశరీర దివ్యసుఖభాగ్యముఁ గోరుట నాది దోసమే? 40

చ. ప్రజలకు హాయిఁ గూర్చు పరిపాలన, ధర్మపథానువృత్తి, స
ర్వజనమనఃప్రియం బయిన పద్ధతి, నిత్యగురుద్విజాతిథి
వ్రజ పితృ దేవతాగణ సపర్యలునున్, బలి హోమ దాన య
జ్ఞ జప తపంబు లిట్టివరకంబునకా? చలపోరి చేయుటల్. 41

తే. ఎట్టి దోసంబు నణుమాత్ర మెఱుఁగఁ; గ్రతుశ
తంబులను దైవతగణంబుఁ దనిపి పుణ్య
మూర్తి యన వచ్చుకీర్తిస్ఫూర్తి నెగడి
చెల్లరే! నాదుబ్రతు కిట్లు తెల్లవాఱె. 42

ఆ. మోక్షమునకుఁ బోవ మొసలివాతను బడు
పోల్కిఁ, బుణ్యమునకుఁ బోవఁ బాప
మెదురు వచ్చినట్టు లేపాటి తుదకు నా
తెలివి తేట లిట్లు వెలిఁగిపోయె. 43

తే. సకల సామ్రాజ్య విభవ నిస్తంద్రుఁడైన
దొర యఁటే దార సుత హితదూరుఁ డగుచు
దిక్కు లే కెల్లెడలఁ ద్రిమ్మఁ దిరుగవలసె?
దైవగతి బ్రహ్మకైనను దాఁటఁ దరమె? 44

తే. అని త్రిశంకునృపాలుండు కనుల నశ్రు
కణము లెడనెడఁ దొఱఁగ గాద్గద్యమున నె
లుంగు రాల్పడ నంతంతఁ బొంగి పొరలి
యుబికి వచ్చు శోకంబున నూరకుండె. 45

వ. అంత నంత కంత కమ్మహీకాంతునంతరంగంబు దురంత చింతా
నల సంతప్తంబై కొంతవడి వెక్కి వెక్కి యొక్కుమ్మొగి వెక్కసం
బగు నెగులునం బొగిలిపొగిలి, సహజ సిద్ధంబైన ధైర్యంబున

శోకంబు నెట్టెట్టులో దిగమ్రింగి, నిట్టూర్పు లెగయఁ గట్టా!
కట్టిఁడి దైవం బెంత రట్టుఁ జేసె? నారా! పురుషకారం బింత
నిస్సారం బగునే? యని పల్కి వెండియు నిట్లనియె. 46

మ. దురహంకారమునన్ సమస్తమగు నాతో నంచు మీసంబులం
బురివెట్టున్ మనుజుండు; తా నొకతలంపుం బూన దైవం బొకం
డరయున్; నెగ్గిన నాప్రభావ మను; వ్యత్యస్తంబుగా నైన ను
స్సురు మంచుం గుఱితప్పె దైవిక మిదంచుం దిట్టు విభ్రాంతిమై.

శా. 'దైవాధీన మిదం జగ' త్తని మహాత్మా! సత్యసిద్ధంబ, 'ని
ర్జీవంబే పురుషప్రయత్న' మను నీసిద్ధాంతమున్ నేఁటికిం
దేవా! స్వానుభవంబునం దెలిసె; కానీ నన్నె తార్కాణగా
భావింపంగల; రెంత మే లిది? తలంపన్ భావికాలంబునన్. 48

క. అని పల్కు త్రిశంకునృపా
లు నెగాదిగఁ గౌశికుఁడు విలోకించి మొగం
బునఁ గరుణయు, ధీరోద్ధతి
యు నొకమ్మడిఁ దోఁప ఖండితోక్తుల ననియెన్. 49

శా. ఆ! యేమంటి? త్రిశంకు! దైవ మనివార్యంబౌనె? నిర్జీవమై
పోయెంగా పురుషప్రయత్న మది? పోపో; యిట్టివాక్యంబు గా
థేయుం డుండిన యేడువాడలఁ బ్రసక్తింజేయు; కింకం దృణ
ప్రాయంబై చనుఁ బౌరుషంబునకు దైవంబే పటాపంచలై. 50

తే. భయపడకు మేమి చండాలభావమైన?
గాధిసుతు నాశ్రయించినఁ గలదె లోటు?
బ్రహ్మ దలఁవ నాయువు కొఱవడునొకో? స
దేహదివ్యపదంబు సంధింతుఁ గొనుము. 51

మ. ఎవ రడ్డం బయినన్ సరే! తుదకు బ్రహ్మేంద్రాది సర్వామర
ప్రవరుల్ వచ్చినఁ గాని, నీకు సశరీరస్వర్గ మిప్పింతు; న
న్నెవఁ డాక్షేపణ సేయునో? కనెద; నేనే యిం దధిష్ఠాతనై
సవరింతున్ సవనంబు; స్వర్గ మిఁక హస్తప్రాప్య మం చెంచుమా!

తే. అయిన దైనది; శాప మీ వనుభవింపు;
మది మరల్పఁగ లేరు బ్రహ్మను లైన;
ఇట్టి దేహంబుతోడనే యింద్రలోక
మధిగమించు టసామాన్య మని యెఱుంగు. 53

వ. ఇవ్విధంబున నతనికి ధైర్యంబుఁ గఱపి యేకాంతంబున నిట్లు యోజించె. 54

భుజంగప్రయాతము. ఉపాసించు గాయత్రి-యూర్జస్వలంబౌ
తపశ్శక్తికిం దోడు దైవారుఁగా కీ
నృపుం గూర్చి యెంతెంత లేపారునో! యీ
కృపాణం బొకం డున్న క్షేమం బటంచున్. 55

వ. శుచియై వార్చి, యేకాగ్రతం జేర్చి నిమీలితనేత్రుండై భువనైక సవిత్రి యైన గాయత్రి నాహ్వానించిన నద్దేవి ప్రత్యక్షంబై యతని యీప్సితార్థం బడిగిన నమ్మహాదేవిపాదసరోజంబులు ఫాలంబున నంగీలించి వినమ్రుండై యిట్లనియె. 56

మ. ఎది యెట్లుండునొ? నేఁ ద్రిశంకుఁ ద్రిదివం బేఁగింతునంటిన్; ప్రతి
జ్ఞ దిగం జారుట కోర్వ; నాకుఁ బ్రతిసర్గప్రక్రియాశక్తిసం
పద లిప్పింపుము తల్లి! యంచొరఁగెఁ దత్పాదద్వయిన్; లోకమా
త దరస్మేరముఖాంబుజాత యగుచుం దా నిట్లనున్ మౌనితోన్.

మ. ఎటులున్ వారు త్రిశంకు నచ్చటికి రానీ; రింత నిక్కంబ; నీ
వటుపై వారల నొంపఁ జూచెదవు; దివ్యబ్రహ్మతేజోబల
స్ఫుటశక్తిన్ మదుపాసనంబున లభించుంగాని, మాత్సర్యలం
పటధార్ష్ట్యక్రియ కెప్పుడుం బొసఁగ దప్పా! స్వప్నమం దేనియున్.

వ. అనిన నమ్మునీంద్రుం డిట్లనియె. 59

శా. నా కాబ్రహ్మపదం బొసంగినను మాన్యంబౌనె? దత్తాభయ
శ్రీకిం దప్పిన ధర్మమా చెడుఁ; దపస్వివ్రాతమా దూరమా;
నాకల్పం బయశోభరంబునఁ గులంబా నల్పగున్; బ్రాహ్మ్యమున్
నా కత్యంతముదావహంబ; యిది యైనం దాని సాధించెదన్. 60

ఉ. సత్యమె ధర్మమూల మగు; సత్యమె సర్వశుభప్రదం బగున్;
సత్యమె బ్రాహ్మ్యధర్మవిలసత్ఫలసాధక మౌను; సత్యమే
నిత్యము; దాని మానఁ జనునే? జననీ! విను; నా కిదే దృఢ
ప్రత్యయ; మిందు దోషము లవం బయినం గల దేమొ చెప్పుమా!

మ. శరణన్నం గరుణింపఁ డేఖలుఁడు తజ్జన్మం బిసీ! భూమికిం
బరువౌఁ; దన్ముఖదర్శనంబున మహాపాపంబు ప్రాపించు; వాఁ
డరివైనం, దురితాత్ముఁడైన, బలగర్వాయత్తుఁడైనన్ వెతన్
శరణంచుం జరణంబులం బడినఁ బ్రాణం బొడ్డి రక్షింపనౌ. 62

చ. భయముననో, పరాకుననొ, ప్రజ్ఞఁ దొఱంగియొ, స్వార్థకాంక్షనూ
నియొ శరణన్నవానిఁ గరుణింపఁడయేనిఁ దదీయపుణ్య మం
తయుఁ గొని యేఁగు; నింతకు నతండు నశించియు రిత్తవోవఁ; డ
ట్లయినఁ గృతాత్ముఁ డోపఁగలయంతప్రయత్న మొనర్చి ప్రోవనౌ.

వ. అనిన నజ్జగన్మాత యిట్లనియె. 64

మ. శరణార్థిం గరుణించు టొప్పు; నది దోసం బం చనన్; గాని యం
తరువున్ మించిన కోర్కె లిచ్చిన ననర్థంబే గదా! దానికే
గురుశాపంబు దహించె నానృపుని; నీకుం గోర్కెయే యున్న ని
ర్భరశాంతస్థితి బ్రహ్మవర్చసము సంపాదింపు మం చాడినన్. 65

తే. నమ్ముకొని శరణుం జొచ్చి పదమ్ముం గఱచె;
నతని కభయం బొసంగి దత్తాపహరణ
పాపజీవచ్ఛవం బయి భారజీవి
తము నడుపం బాల్పడండు గాధితనయుం డెపుడు. 66

ఉ. ధర్మపథంబుం దప్పనుగదా! జగదంబ మదీప్సితంబులో
మర్మ మెఱుంగదా? యను భ్రమన్ శ్రమ కోర్చి నినున్ భజించితిన్;
నిర్మమతాకఠోరసరణిం బరినిష్ఠిత వౌ టెఱుంగ; నం
తర్ముఖు లెట్లు గొల్తురో? వృథా ప్రణిధానవిధానమన్నలై. 67

ఉ. నా యనుభూతి యివ్విధువునం గనుపట్టిన; దేరికైన ని
ష్ఠే యనుకొందుం; గా దనెద వేని నిజంబుగ నీమనంబునం
బాయని పక్షపాత మని పల్కినచో నది యొగ్గు గాదు; న
న్నేయవినీతిం జూచి యిటు హీనునింగాం గనుంగొంటి? వమ్మరో!

వ. అని కటకటం బొంది యజ్జటాలుండు నిటాలంబున వికటభ్రుకుటి
ఘటించి కటంబు లదర నిట్లనియె. 69

—, శాప మిచ్చి పశ్చాత్తప్తుండైన విశ్వామిత్రుని గాయత్రీదేవి యనుగ్రహించుట. —

తే. కాకులకుంగాని నెమ్ములు కాచి యేమి?
పూచి యేమి? తాం గ్రుంగుట పుడమిక్రుంగు
దలయ; తనకల్మి లోకంపుం గలిమి; నాకుం
గాని గాయత్రిమనువు లోకమున కేల? 70

శా. 'నీమంత్రంబు జపించువారికి ఫలోన్మేషంబు లేకుండుఁ గా
కేమాత్రం'బని రోషభీషణమహాహింబోలి వీక్షించి వి
శ్వామిత్రుండు శపించె నుగ్రుఁడయి సాక్షాద్బ్రహ్మతత్త్వప్రధా
నామేయప్రతిభాసవిత్రియగు గాయత్రిన్ బవిత్రాత్మికన్. 71

వ. అంత నప్పరదేవత తదీయభవిష్యదుదంతం బంతయు నంతరంగం
బునం జింతించి ప్రశాంతస్వాంతంబున నిట్లనియె. 72

మ. నను నేమన్న సహింతుఁ గాని యకటా! నామీఁది కోపంబునన్
ఘను లావారల నందఱిం జెఱచి; తన్నా! దీన నీ వేమి యా
ర్జనమున్ సల్పితి? క్రిందుమీఁ దరయ కీచందాన నీ వన్నమా
త్రన నా కేమి? పురోభివృద్ధికి నిరాధారుండ వీవే కదా! 73

మ. అని సూచించె భవిష్యదర్థముల కవ్యాఘాతమా రీతి సాం
త్వనవాక్యంబుల నజ్జగజ్జనని; యాతం డంత సింహావలో
కనముం జేసి దురాగ్రహంబుకతనం గైకొన్న యాత్మైకవం
చనమున్ బూర్తిగ గుర్తెఱింగి మదిఁ బశ్చాత్తాపసంతప్తుఁడై. 74

వ. మ్రాన్పడి నిలిచి కొంతవడిఁ జింతించి యప్పరమేశ్వరిపదాబ్జంబు
లకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి. 75

శా. తల్లీ! నాయపచారముల్ తనయవాత్సల్యంబునం ద్రోచి యు
ష్మల్లోకోత్తరసత్కృపామృతము నాపైఁ బర్వఁగా క్షేమసం
పల్లాభం బొడఁగూర్చు; నీవలె దయాపారీణ-నన్ బోలు గ
ర్వోల్లిప్తుండును లేరు లేరు భువనవ్యూహంబు గాలించినన్. 76

ఉ. నాయవివేకముం దెలిపినాఁడను నీదయకల్మి; నైనదే
దో యయిపోయె; వీడినమహోజ్జ్వలసాయక మాఁగ దింక; నే
దో యొకరీతి నామదికిఁ దోఁచినమార్పు ఘటింతు; నీదుభ
ద్రాయితసత్కటాక్షవిసరప్రసరంబులచే దయామయీ! 77

శా. ఆత్రంబో? భవితవ్యతాబలమొ? మాయాదుర్విలాసంబొ? శా
పత్రైవిక్రమవిక్రమక్రమము దుర్వారంబుగా రేఁగి స
ర్వత్రైలోక్యమునం దుపాసకుల కాపాదించెఁ దాపంబు; గా
యత్రీమాత! సమీకరింతు నిదె సర్వానందకందంబుగాన్. 78

క. మైత్రిం దిలకింపుము గా
యత్రీమంత్రర్షి గాఁగ నమ్మరొ! విశ్వా
మిత్రు; నుపాసకులకు గా
యత్రీచ్ఛందమున నది మహాఫల మిచ్చున్. 79

క. ఇది యాచంద్రార్కము న
భ్యుదితమహాబ్రహ్మతేజ మూర్జస్వలసం
పదలం బొదలం గుదురై
పదిలం బగు బ్రాహ్మ్యమున శుభప్రాపకమై. 80

వ. ఇట్టి నా నిర్ణయంబు సిద్ధింప భవదనుగ్రహంబ పట్టుగొమ్మ యని తదీయపదాంభోజయుగ్మంబు ఫాలంబునం గీలించి కనుల కద్ది కొనినఁ దద్దయుం బ్రీతి భవదుద్దిష్ట నిర్ణయంబు సిద్ధించుఁ గాత మని యప్పరాశక్తి తిరోభూత యగుటయు, నతం డిది యొక్క యవితర్కితంబైన మహాప్రసాదం బని సంతసింపుచుఁ బ్రధానోద్దిష్టంబు ఫలింపమికిం జింతింపుచుఁ గొంతవడి విచారించి తొల్లి చ్యవనప్రేరణంబున జంభారిని స్తంభితుం జేసిన ప్రత్యంగిరః ప్రభావంబు భావంబునం దట్టి యుపాంగిరోనామకం బగు నొక మంత్రరాజంబు నుత్పాదించెఁ; దదామంత్రణంబున నఖిలతంత్రంబులు సమర్థింపం గలవాఁడై. 81

ద్రుతవిలంబితము. చని మునీంద్రులఁ జయ్యన నామతిం
పను రయంబునఁ బంపెను శిష్యులన్
నను నెవండయినం గొఱమాట లా
డినను డాఁపకుఁడీ యని యుద్ధతిన్. 82

ద్రుతవిలంబితము. సవనశాల వెసన్ నెలకొల్పెఁ దా
భువనవిశ్రుత భూరిమనోజ్ఞమై
అవసరార్హములైన సమస్తవ
స్తువులతోఁ బరిశోభితమై తగన్. 83

ద్రుతవిలంబితము. ఉదధిపారమహోన్నతధారుణీ
పదసమస్తవిభాసితరాజ్యసం
పద స్వపుత్రుని పాలిటిదే గదా!
కొదవ యున్నదొకో ధనసంపదన్. 84

ద్రుతవిలంబితము. తన మహోద్ధతధార్ష్ట్యవిధానము
న్ఘనతపశ్చరణప్రతిభానమున్
సునిశితామితశోభి స్వభావమున్
గనిన మార్వలుకం గలరే యొరుల్ ? 85

వ. ఇట్టు లా దిట్టతపసి బెట్టిదంపు శాసనమున కట్టిట్టనలేక పట్టిన వాఁడెల్ల మానిసిమై యెట్టెట్టు వనిచె నట్టట్టొనరింప నన్నియుం దట్టునం గట్టాయితంబులై యుండె; నంతలో ఋషిగణంబు నామంత్రణంబు సేయ నరిగిన తదంతేవాసు లమ్మునికాంతునంతికంబున కరుదెంచి నమస్కరించి యిట్లనిరి. 86

తే. తమ ముదలమేర కఖిలాశ్రమములఁ దిరిగి
మునిగణంబుల కాహ్వానములు వచింప
నొకరు మాటాడరు; మహోదయుఁడు, వసిష్ఠ
సుతులు మాత్రము చాల ధిక్కృతుల ననిరి. 87

శా. 'వహ్వా! యాజకుఁజూడ క్షత్రియుఁడ? యజ్ఞంజూడఁజండాలుఁడా?
జిహ్వాచాపల మూని హవ్యముల కాశింపన్ మొగాల్ వాఁచి మ
మ్మాహ్వానించు టదెప్పుడా యనరొ దేవాధీశ్వరుల్! బాపురే!
బహ్వాసక్తి నిఁకెప్పు డప్పు డనరే బ్రహ్మర్షులార్త్విజ్యమున్?88

ఉ. ఆ సవనంబులోఁ గుడిచినప్పుడకాని తరింప మంచు నా
సాసల నిక్కినిక్కి కనరా? మఱిమోములు వాఁచియున్న దే
వాసురమర్త్యముఖ్యు' లని యందఱు గేలియొనర్చి రట్టె! రా
కాసులమూకయో యనఁ బకాపక నవ్వుచు నొక్కపెట్టునన్. 89

వ. అనిన నవ్విశ్వామిత్రబాడబంబు జాజ్వల్యమానంబుగ రేఁగె. 90

—, విశ్వామిత్రుఁడు తన్ను నిందించిన వసిష్ఠపుత్రులను, మహోదయుని శపించుట, —

మాలిని. నిటలతటి సముద్యన్నిష్ఠురక్రోధవహ్ని
చ్ఛట లనఁ గనుఁగొల్కుల్ సస్ఫులింగంబు లయ్యెన్;
ఝుటితిఘటితభీమశ్యామధూమచ్ఛలంబై
స్ఫుట వికట కఠోర భ్రూకుటిస్ఫూర్తి యొప్పెన్. 91

తే. ఆప్రళయరుద్రతాండవం బరయఁ జాల
కచటివా రెల్ల గడగడలాడి యెదుట
నిలువఁ జాలక ప్రక్కప్రక్కలకుఁ జనిరి;
మించి మునిసింహ మిట్లు గర్జించి పలికె. 92

మ. 'నను నిష్కల్మషు దీనబాంధవు శ్రితానందైకసంధాయి స
త్యనిరూఢాత్ము నకారణం బెవరు నిందన్ సల్పిరో యట్టి దు
ష్టనికాయంబు వసిష్ఠపుత్రశత మస్మచ్ఛాప నిర్ఘాతపా
త నిఘాతంబున భస్మమై తొఱఁగుఁగాతన్ శీఘ్రకాలంబునన్'. 93

వ. అని మఱియు నిట్లనియె. 94

మ. 'అతి నీచప్రకృతిన్ శ్వమాంసనియతాహారంబులం బొల్చుచున్
మృతపుల్ ముష్టికనాములై మిగుల నైర్ఘృణ్యంబు, వైరూప్యవై
కృతులుం బొప్పడ సప్తజాతిశతముల్ పృథ్విన్ వసిష్ఠాత్మజుల్
సతమున్ ముష్కరులై చరించెదరు నాశాపం బమోఘంబుగన్'. 95

శా. ఆ ధూర్తుండు మహోదయుం డల వసిష్ఠాపత్యముం జేరి తా
గాధేయాప్రతిమప్రభావము నెఱుంగన్ లేక దూషించి మ
త్క్రోధజ్వాల రగిల్చె; వాఁడిదె మహాక్రూరస్వభావంబుతో
వ్యాధుండై చరియించుఁ గాత నిఖిలప్రాణాతిపాతస్పృహన్'. 96

వ. ఇట్లు సమహోదయుల వాసిష్ఠుల శాపదగ్ధులఁ గావించె. నది యట్లుండె; జన్నంబున కాహూతులైన దేశాంతరముల యందలి యాశ్రమవాసు లందఱు గుంపులుగుంపులై యిట్లని యోజించిరి.

చ. 'కుశికతనూభవుం డమితకోపనుఁ; డా ప్రళయాగ్ని కెవ్వఁడై
న శలభ మౌ బదుల్ వలికినన్; మన కేటి కటంచు నెంచి య
య్యశనికఠోరబుద్ధి కెడమైనఁ దిరస్కృతి యౌను; గానఁ ద
ద్వశతఁ జరింపఁగావలయుఁ; బాప మొ పుణ్య మొ తప్ప దెమ్మెయిన్'.

వ. అని యొక్కనిర్ణయంబు గావించి మునిబృందారకు లందఱు విశ్వామిత్రాశ్రమంబునకుం బఱతెంచిన, నయ్యనఘుండును వారి నందఱిని యథార్హంబుగ గౌరవించి త్రిశంకునిం జూపి వారితో నిట్లనియె.

ఉ. ఈతఁ డకల్మషాత్మకుఁ; డనేకమఖంబుల నాచరించి వి
ఖ్యాతి గడించినట్టి జలజాప్తకులావనిపాలరత్న; ము
ద్యోతితకీర్తిశాలి, సుగుణోత్తరుఁడైన త్రిశంకు భూధవుం
డీతఱి బొందితోఁ ద్రిదివ మేఁగఁదలంచి మఖం బొనర్చెడిన్. 100

తే. మము శరణుఁ జొచ్చె నిట్టి జన్నము నమోఘ
ముగ సమర్థింప; మీ రెల్లఁ దగు విధాన
మరయుఁ డార్త్విజ్యము వహించి సాంగముగ, స
శాస్త్రముగ సర్వసామరస్యంబుఁ గాఁగ. 101

వ. అనిన వా రంద ఱిట్లు యోజించిరి. 102

మ. అతఁ డేమే విధియింపనీ మనకుఁ జేయంగాఁ దగున్; తేనికిన్
గ్రతుదీక్షన్ సశరీరదివ్యసుఖమా కానిండు, పోనిండు; బా
ధ్యత గాధేయునిదే కదా! మన కదేలా? తత్ప్రభావంబుచే
నతఁడిష్టార్థములందెనా? మనకు దోషాసంగ మేముండెడున్? 103

వ. అని యిట్లు నిశ్చయించి యంద తేకముఖంబుగా నక్కార్యంబున కియ్యకొనినవా రైరి; యజ్ఞంబు ప్రారంభంబయ్యె; నంత. 104

—, విశ్వామిత్రుండు త్రిశంకుని స్వర్గంబున కనుపుట, —

మ. అమితోత్సాహముతో మఖంబుఁ గనఁగా నాబాలగోపాల మా
శ్రమ పల్లీ పుర పట్టణప్రజలు చేరం బాఱె; కాఁగాదె? లో
కమునం దేఁబదియామడల్ నడచి యజ్ఞంబున్ నిరీక్షించు టు
త్తమ మన్ సామెత సుప్రసిద్ధమగుఁగాదా? నాఁటికిన్, నేఁటికిన్.

వ. అదియునుం గాక శాపదగ్ధుం డగు త్రిశంకు యజ్ఞం బగుట నాశ్చర్యజనకంబై దేశ దేశములవా రద్ది యెట్లు పరిణమించునో చూడవలయు నను కుతూహలాతిశయంబున నిసుక వైచిన నేల రాలనిపగిది వచ్చి మూఁగినవార లైరి. 106

ఉ. యాజకుఁడై కుశాన్వయశశాంకుఁడు నిల్వఁ, ద్రిశంకు యాజి వి
భ్రాజదనూనదీక్షఁ దనరన్, మునిరాట్సముదీరితాగమో
త్తేజితదివ్యఘోషముల దిక్కులు పిక్కటిలన్, సమంతత
శ్రీజనకంబు గాఁగఁ బొలిచెన్ సవనంబు సలక్షణంబుగన్. 107

క. ఋత్విజు లధిగతమఖవిధి
తత్త్వులఁట-యథావిధిగ, యథాకల్పముగాఁ
గ్రత్వంగంబుల దీక్షా
సత్త్వసమావిష్టు లగుచు సల్పిరి వేడ్కన్. 108

శా. శశ్వత్సుస్వరమంత్రఘోషములతో శాస్త్రోక్తధర్మంబుతో
నాశ్వాసం బొదవం ద్రిశంకునకు, నాహ్వానింపఁ జండాలజు
ష్టైశ్వర్యం బని రోసి దేవతలు హవ్యంబుల్ గొనన్ రామికిన్
విశ్వామిత్ర యుగాంతబాడబము జృంభించెన్ మహోగ్రంబుగన్.

తే. స్రువము నెత్తి మహోగ్రంపుఁ జూడ్కిఁ గనుల
నిప్పు లురల దిగ్గున లేచి నిలిచి భయద
మేఘ గంభీర భీషణోన్మేష నినద
భాషణములఁ ద్రిశంకుతోఁ బలికె నిట్లు. 110

తే. నా తపోబలమున నిన్ను నాకమునకుఁ
బంపెద సదేహముగ; హవిర్భాగములను
గోల్పడిరె కాని సురలు నీకుఁ గొఱ యేమి?
యయ్య రాకున్న నమవస యాఁగునొక్కొ? 111

మ. ఇదె యర్ధాంశము ధారవోసితిఁ దపం; బేతత్క్షణం బేఁగి నె
మ్మదిగా స్వర్గకృతాలయుండ వగు, మస్మచ్ఛక్తిఁ దేజోబలా
భ్యుదయం బంది హుటాహుటిం జను; మహోద్యదగ్రధాటీగతిం
బద, లేలెమ్మ' 'శుభస్య శీఘ్ర'మనె; శుంభద్వేగసంరంభియై. 112

మ. కలఁడే? దుర్లభసిద్ధి కాసపడుచుం గష్టార్జితంబౌ తపః
ఫలముల్ లోకుల కిచ్చుచోఁ దృణకణప్రాయంబుగా నారయం
గలధీరుండు చరాచరంబు గలయం గాలించినన్? స్వార్థకాం
క్షులు, నాజన్మపరాసహిష్ణువు లధీశుల్ దీనులం గాంతురే? 113

వ. ఇట్లగ్గాధేయుండు తన తపంబునం దర్ధాంశంబు ధారవోసి పను
చుటయు. 114

మ. జలదంపుం దెరఁ జిమ్మి వెల్వడిన భాస్వద్బింబమో ? కాక ప్ర
జ్వలితంబైన విధూమపావకమొ నా భాసిల్లె నైత్యాకుఁడు
జ్వాల దుర్ధర్షమహోగ్ర తేజమున, విశ్వామిత్రుతత్త్వం బటం
గలవా రంద ఱెఱుంగ నిల్చిన మహాజ్ఞానప్రదీపం బనన్. 115

వ. అంత నచట సమావేశంబై యున్న మహాజనసంఘం బతనిం గాంచి యిట్లని తలంచె. 116

ఉ. పావితుఁ జేసె నిమ్ముని యపారతపోవిభవానుభావసం
భావితమౌ ప్రభావము నృపాలుని; దోష మొకింత లే దిటన్;
దేవత లింకనైన గుఱుతించిన మే; లటు గాకయున్న న
త్యావిలమై జగత్ప్రళయమైన నగున్ మునికోపవహ్నిచేన్. 117

వ. అని యెల్లరుం బలువిధంబులఁ బలుకుచుండఁ ద్రిశంకుండు, 118

ఉ. ఆర్తుల మంచిచెడ్డ లరయం దలపోయక మాన మూన ము
మ్మూర్తులు, దేవతల్ చలముఁ బూనఁగఁ, 'కర్త మకర్తుమన్యథా
కర్తు' మటంచు నిల్చిన యఖండతపోవిభవాభిరామచి
న్మూర్తి కుదారకీర్తికి 'నమో నమ' యంచుఁ గరంబు
మోడ్చుచున్. 119

వ. ఇట్లు గాధేయునకు సాష్టాంగదండప్రణామం బాచరించి మఱియు, ఋత్విక్ప్రకాండంబునకుం బెద్ద లందఱికి నమోవాకంబులం జెప్పి, మహాజనంబునకు నమస్కరించి విశ్వామిత్రమునీంద్రు ననుజ్ఞఁగొని.

మ. అట యజ్ఞోత్సవదర్శనాగతజనం బాశ్చర్యనిర్మగ్నమై
నిటలంబుల్ పయి కెత్తిచూడ, జయ మౌనిశ్రేష్ఠ! యంచున్ మహో
ద్భటధాటిం బయి కేఁగె ఱివ్వున; సుధాంధశ్శ్రేణి యౌత్పాతికో
త్కట దుష్టగ్రహ దుర్నిమిత్త మనుశంకం దందడిం బొందఁగన్.

వ. అంత నయ్యుజ్ఞవాటియందున్నవా రంద ఱాశ్చర్యసంభరితాంతః
కరణులై యిట్లనిరి. 122

మ. రథమా? వాహనమా? విమానమ? యపారంబై నిరాధారమా
పథమా? మానవమాత్రుఁడా? గమన మాపై నిర్నిరోధంబ? యు
త్పథమాత్సర్యపరీతచేతసుల కావాసంబు గమ్యంబ? పై
కథ లేమౌనో? బలే! కుశాన్వయశశాంకా! నీప్రభావంబునన్.

క. అని పల్కుచుఁ గనుఁజూపం
దినమేరకు మెడలు సాఁచి నిక్కి కనుఁగొనం,
జనియె నతఁ డొక్కనిముసం
బునఁ గనులకు దూరమై నభోమార్గమునన్. 124

ఉ. తోయదమండలంబును విధూత మొనర్చి, మరుత్పథంబున
త్యాయతశక్తిఁ జీల్చి, యమృతాంశునిధాన మధఃకరించి, శో
భాయతమూర్తియై రవిమహస్సులతో నెదురొడ్డి యుక్కునం
డీ యని యింద్రుతోఁ బ్రతిఘటింపఁగఁ బాఱె శతఘ్ని యో యనన్.

ఆ. అతనిరాకఁ గని వియచ్చరు లటమున్న
యతనికథ యెఱింగినట్టివార
లగుట, గాధిసూతి యనిన సింహస్వప్న
మగుట వచ్చెరా! యనర్థ మనుచు. 126

భుజంగప్రయాతము. జటాలోద్భటక్రోధజాజ్వల్యమానో
త్కటజ్వాలికామాలికా విస్ఫులింగ
చ్ఛటల్ పర్వెనో! పూరుషచ్ఛద్మ నంచుం;
బటాపంచలై దేవవారంబు వాఱెన్. 127

చ. త్రిదివము నేఁటితోడ విపరీతగతిం గడజాతివారి కా
స్పదమయిపోయెఁ; గౌశికుని భాగ్య మయో! యెవ రేమి సేయువా;

రది బడబాగ్నికీల; ప్రళయం బానరింపకపోదు రేఁగినం;
బెదవికి మీఱుప; ల్లనుభవింపఁగరా, దనరా దొకింతయున్. 128

శా. ఆశ్చర్యం బనువారు, కౌశికుఁ డిదే మన్యాయ మన్వార, లీ
దుశ్చారిత్రునిఁ జేరఁదీసె ననుచుం దూషించువా, రెంతయో
పశ్చాత్తాపము నొందువార, లెవ రీపాపాత్మునిం ద్రోచి ప్రా
యశ్చిత్తం బిడువార? లం చనిరి వా రత్యార్తినిర్మగ్నులై. 129

వ. అయ్యవసరంబున. 130

తే. అది గని మరుద్గణంబుఁ, బాకారియును 'దు
రాత్మ! గురుశాపదగ్ధ! నీకా? సురాల
యంబ! నీ కెన్నఁటి కిట స్థానంబు లేదు; దె
గసి పడకు తలక్రిందగుదు సుమి కడకు'. 131

క. అని పల్కినంతమాత్రం
బునఁ దలక్రిందై త్రిశంకుభూపాలుం డ
మ్మునఁ జిమ్మినవడువునఁ బడి
యెను; 'త్రాహి త్రాహి' యని మునీంద్రుఁ దలఁచుచున్. 132

శా. ఆక్రోశింపుచుఁ గ్రిందికిం బడు నయోధ్యాధీశు నీక్షించి, ని
ర్వక్రప్రాభవశాలి కౌశికుఁడు 'భూపా! నిల్వుమల్లే యిఁకన్
శక్రుం డేమి యొనర్చునో? కనెద' నన్నన్ నిల్చె నట్లే దివిన్;
సక్రోధుం డయి పల్కె నిప్పగిది విశ్వామిత్రుఁ డత్యార్భటిన్.

క. ఇఁక నేమి? యిట్టటులఁ గూఁ
తకు వచ్చెం గోడి; మొదలు తపసు లతని కం
టికిఁ గనఁబడుదురొకో? యిం
తకు మగతన మతని దేకదా! యని నగుచున్. 134

శా. ఆటాడించెదఁ జూడుఁ డింద్రుని, మదీయంబౌ తపశ్శక్తిచేఁ
బోటీసల్ప మఱొక్క యింద్రు నయినన్ బుట్టింతు; లేకున్న బా
హాటం బొప్ప జగం బనింద్రకముగా నైనన్ సమర్థింతు; జం
జాటంబుల్ కుశవంశసింహముకడన్ సాగింపఁగా శక్యమే? 135

క. అనుచు నుపాంగిర హృదయం
బునఁ దలఁచుచుఁ దత్ప్రభావమునన యురిమి చూ
చిన, నదియె పరిణమించిన
దనువుగఁ బ్రతిసృష్టి కంకురారోపణమై. 136

మ. క్షణమాత్రన్ సృజియించె నూతనముగా సప్తర్షులన్; వారె ద
క్షిణమార్గస్థులు; వారివెంటనె సృజించెం బ్రజ్వలద్దివ్యల
క్షణ నక్షత్రకులంబు; దానివెనుకన్ సాగింపుచుం దేవతా
గణ, మాపై దిగధీశవర్గమునకున్ గావించె నాందీవిధిన్. 137

మ. వడఁకెం దేవగణంబు, లోకములు సంభ్రాంతంబు లయ్యెన్, మహేం
ద్రుఁడు గగ్గోలుపడెన్; దలంకిరి మునీంద్రుల్, దిక్పతుల్ వెల్వెలం
బడి; రింకేమి యొనర్చునో తుదకు విశ్వామిత్రదావాగ్ని యం
చడ లూనెం ద్రిదివంబు కూ డుడికిన ట్లాబాలవృద్ధంబుగన్. 138

శా. అంకూరంబు వసిష్ఠునందుఁ, దదపత్యంబందు మాఱాకు, ని
శ్శంకం దోహద మాత్రిశంకుఁ డయి, వైశ్వామిత్రరోషద్రు వే
సంకోచంబును లేక దేవతలపై శాఖోపశాఖానిరా
తంకంబై ఫలియించె బ్రహ్మకుఁ బ్రతిద్వంద్వచ్ఛలం బొప్పఁగన్.

తే. ఇనుమునకుఁ బెట్టు పెట్టున కింగలంబు
గుఱి యయినరీతి నింద్రునిఁ గూర్చి రేఁగి
నట్టి క్రోధాగ్ని తుదకు బ్రహ్మవఱ కడరెఁ;
దీవ గదలింపఁ బాదమొల్లఁ దివియఁ బడదె? 140

చ. గజిబిజియై తడంబడి కకావిక లౌచుఁ బ్రచండమారుతో
ద్రగజవజనిష్యమాణ పరికంప వశీకృతమౌ వనస్పతి
వ్రజమును బోలి యిట్టటులఁ బాఱుచు వచ్చుచు నింద్రుఁ డాదియౌ
నజరకులంబు తాఁ దహతహల్ గనెఁగా లోకచోట నిల్వమిన్.

—. విశ్వామిత్రుం డొనర్చిన ప్రతిసృష్టికి దేవతలు బ్రహ్మతో మొఱపెట్టుకొనుట. —

క. త్వరపడుఁడు రండు పోదము
విరించికడ; కతఁడు వేల్పుపెద్దగద! యెదో
తెరువు దొరకింపఁడా? యం
దఱును గదలి రండు; పెండ్లినడకలు చాలున్. 142

వ. అని యిట్లందఱుం బోయి. 143

క. వెలవెలఁ బాఱుచు నవ్వే
ల్పులు జలజాసను పదాబ్జముల కెఱఁగి కడుం
గలఁగుండువడుచు మది వె
గ్గలముగ బెగ్గడిలి పలుకు గద్గదికమెయిన్. 144

మ. గతియేమి యింక? జగం బరాజక; మనేకత్వంబు మూలంబుగా
నతుకుల్ దప్పెఁ బ్రభుత్వమంతయును; విశ్వామిత్రుఁడే యాతఁ; డీ
ప్రతిసర్గంబునకుం బ్రతిక్రియ యొనర్పం జూడవే యింక మా
బ్రతుకే వ్యర్థ; మొక ల్లోకళ్ళపలుకుల్ పాటించువా రుందురే?

ఉ. ఒక్కనిమేషమాత్రమున నుక్కిరిబిక్కిరిఁ జేసెనంట! వాఁ
డెక్కడి మానవుండొ? యిహిహీ యలవేలుపురాచవారి; నం
చెక్కడఁ జూత మన్న నిగిలింపులునున్ సగిలింపులయ్యె; మా
కెక్కడ సేమ? మేటిబ్రదు? కేమిసుఖంబు? మహాత్మ! చెప్పవే

శా. ఆలస్యం బయినన్ నిమేషమున సర్వానర్థ మౌ; నేఁటి చం
డాలస్వర్గము-దివ్యధామమును-బోటాపోటి గాఁగన్ శిర

ఖ్యాలం గొల్వఁగఁ బుణ్యాలబ్ధవిభవస్ఫూ_ర్తిన్ సుఖంబున్న యా
భూలోకాగతు లందఱాస లెడలన్ బోరే? పటాపంచలై. 147

శా. కర్ణాకర్ణిక నెల్లలోకములలోఁ గాలూన కట్టే సమా
కీర్ణం బైనది దుష్ప్రవాద మిది నిష్కృష్టంబుగా; వర్ణసం
కీర్ణంబై చెడినట్టి స్వర్గపదవిం గ్రీడింపఁగా నింక నీ
యర్ణోరాశిపరీతభూవలయమం దాశించువాఁ డుండునే? 148

ఉ. ఏటికి జన్మముల్? తపము లేటికిఁకన్? బలి హోమ దాన తీ
ర్థాటన ముఖ్యధర్మఫల మారయ స్వర్గసుఖంబ; దాని కు
చ్చాటనసేయఁగా నిటఁ ద్రిశంకుఁడు నిల్చె; నిఁకేల? వట్టిజం
జాటము; నేఁటినుండి కొనసాగవు వైదికధర్మకర్మముల్. 149

తే. శ్రౌతధర్మము లేఁక నిమ్నజాతిపాలు
గాఁగ వారి కఖండ భోగ్య మగు స్వర్గ;
మెచటఁ దలదాఁచికొందు? మే మింక దూది
కంటెఁ దేలికమై బ్రదుకవలె సురలు. 150

క. అనుటయు జలజాసనుఁ డి
ట్లను; నోక్కొ-కతూరి యిటు లవాంతరములు వ
చ్చును, బోవుఁ; దునిసిపడి యుడు
కును జుట్టిన, నోరు గాల్చుకొనుటె ఫలం బౌ. 151

ఉ. నీచులకున్ బ్రతిక్రియల నేర్పుమెయిన్ ఘటియింపవచ్చు; వా
రే చను దెంతు రొద్ద; కెగిరింతలు వెట్టిన యెద్దె గంతలన్
మోఁచు; నితండు మంత్రములఁ బూ_ర్తిగ నేర్చిన భూత; మింతకున్
మోఁచెయి ముద్దు వెట్టికొనఁబోయినచో నగుబాటుగాదొకో! 152

మ. సకలామ్నాయములన్ సలక్షణముగా సాంగంబుగా నేర్చి శా
స్త్రకలాతత్త్వములన్ పఠించిన సమగ్రప్రజ్ఞుఁ; డుద్దండవై
దిక ధర్మాఖిల మర్మకర్మఠుఁడు గాధేయుండు లోకం బనిం
ద్రకమున్ జేయమి మీ యదృష్ట మనుచున్ సంతోషమున్
చెందుఁడీ! 153

ఆ. తపమునష్టమునకుఁ దలఁకఁ, డుద్దండ త
పస్వి సాహసికుఁడు, పట్టు వీడఁ;
డలవి మీఱినప్పు డధికుల మన నేల ?
సానునయవిధంబు సాధనంబు. 154

క. నావుడు సుర లిట్లని రో
దేవ! సమస్తంబు భవదధీనము; యేదో
త్రోవ దొరకింపుఁ డని; రవు;
దేవునకైనను దలంప దెబ్బయె గురువౌ. 155

క. అందఱుఁ గలిసి ధరాతల
మందునఁ గుశవంశజాతు నాశ్రమమున కేఁ
గం దలఁచి విమానంబులఁ
గ్రిందికిఁ బఱపి; రటు చెవులు గింగురు మనఁగన్. 156

ఉ. ఆతఁడు తమ్ముఁ జేరఁ జనఁ; డాతనిచెంతకె పోద మన్నచో
భూతల మన్న వారిపదముల్ స్పృశియింప వనర్హ మంచు; న
ల్లై తగ నంతరిక్షమున నందఱు నిల్చిరె యేకవాక్యసం
ఘాతముఁ గాఁగ 'జే మునిశిఖామణికిన్ గుశవంశమాళికిన్'. 157

క. అని జయజయ శబ్దంబులఁ
గొనియాడి తదుద్ధతియును గొంత శమింపన్
గనుఁగొని చతుర్ముఖుం డి
ట్లనియె నమృతరసముఁ జిల్కినటు నేర్పుమెయిన్. 158

మ. మము రక్షించిన నీ సమర్థతకు సేమం జేకదా! వత్స! యం
చమితాశ్లేషముతో, హాసన్ముఖముతో, నవ్యాజపుం బ్రేమతో
నమృతజ్యోత్స్నలఁ గ్రుమ్మరించెడి యమందానందఖేలత్కటా
క్షములన్ జల్లఁగ వెల్లిఁగొల్పె; నదె యోంకారంబు తచ్ఛాంతికిన్.

వ. అంత నవ్విశ్వామిత్రుండును వినయవినమితగాత్రుండై కరంబులు శిరంబునం జేర్చి విరించిదెస మొగంబై నిల్చిన వికసిత ముఖకమలచతుష్టయుం డగుచుఁ గమలసంభవుం డిట్లనియె. 160

ఉ. ఇంతటి యద్భుతంబు ఘటియించిన ధీరతపస్వి సృష్టిలో
నింతకుమున్ను లేఁ; డిఁక నహిప్రతి; మా కుశవంశమందుఁ గా
కింత యనర్ఘరత్న మిఁక నెం దుదయింపవలెన్? నిజంబు; మా
యంతటివాఁడ వైతివిగదా! యని నాయన! పొంగిపోయెదన్. 161

చ. అటు కనుఁగొమ్ము; దేవపతియంతటివాఁడు త్రిలోకభర్త య
ట్లటమటఁ జెంది దిక్పతుల నందఱఁ దోడ్కొని తాఱుమాఱుగా
నిట కరుదెంచినాఁ డనిన నెంతవిపర్యయ మయ్యెనో! భవ
త్పటువికటాట్టహాసపుఁ బ్రభావము వత్స! యిఁ కేమి సెప్పుదున్?

చ. అటు చెవియొగ్గు; మాకసమునందున నిన్నుఁ బ్రసన్ను సేఁత దు
ర్ఘటమయి యెట్లు వారినిధిరంగదభంగతరంగ ఘుంఘుమా
ర్భటి కెనయై జయధ్వనులు పర్వెనొ నా, వినిపించె నంతలో
నటఁ గుశవంశకీర్తిపటహస్ఫుట నాదములై జయధ్వనుల్. 163

తే. నాకుమారుండ కాదె? జ్ఞాననిధి కుశమ
హీవిభుఁడు వంశకర్త నీ; కిట్లు సంప్ర
దాయసిద్ధంబుగా సృష్టిఁ జేయు నేరు
పలవడె ననన్యలభ్య మైనట్టి ప్రభుత. 164

ఉ. కాని భవిష్యదర్థము లగణ్యముగా విపరీతభంగియై
కానఁబడెం జుమీ! యదొక గ్రంథ మగున్ వివరింత మన్న; న
ద్దాన ననర్థమం చనక తప్ప; దెఱింగి యొనర్చినట్టి నీ
కే నెఱిఁగింపఁగావలయునే? యది చర్విత చర్వణంబుగాన్. 165

మ. క్రమబద్ధంబయి సర్వసమ్మతము గాఁగాఁ బూర్వకార్యావిరో
ధముగాఁ గార్యము నిర్వహించు టది మేధావిత్వ; మిందుం బ్రధా
నముగాఁ దద్విపరీత హేతుకవిధానం బే పొసంగెన్; యథా
ర్థముగా నెవ్వరియందు దోష మణుమాత్రం బేనియున్ లేదిటన్.

మ. గురుశాపోపహతుండు గావునఁ ద్రిశంకున్ వారు దూరీకరిం
చిరి; నీ కాశరణార్థి నెట్లయిననుం జేపట్టి రక్షించు టే
పరమం బై తగుధర్మ; మక్కతమునం దైవ్యధీభవత్సృష్టియే
శరణం బై విధిగా నొనర్పవలసెన్ సామర్థ్య మున్నందునన్. 167

మ. ఒక యింద్రుం డొకస్వర్గ మొక్క యజుఁడయ్యుం గూడ నేదో యరా
జక మొక్కొక్క యుగాంతరంబునఁ దటస్థంబౌ; దురాచారదై
త్యకులంబుల్ చెలరేఁగి-దానికి ప్రభుత్వం బేకసామ్రాజ్యమై
నకతం బేకద; కావ డెన్నిగతులైనం గొంపఁ జేరుం దుదిన్. 168

మ. ఇపు డాయింద్రునకున్ విరోధియగువాఁ డీయింద్రునిన్ జేరు; నిం
దపలాపం బొకయింతఁ గన్పడినచో నాయింద్రునిం జేరు; వీ
రిపృథక్త్వం బితరేతరాసహనవర్ధిష్ణుత్వమూలంబు; దా
నిపయిం బుట్టుసెగం జగం బఖిలమున్ నిర్ధూమధామం బగున్.

మ. తలఁపన్ హవ్యములన్ గ్రహింపక మహేంద్రత్వంబు సిద్ధింప; దిం
దుల కాయాబిరుదంబు, లాకథలు, వ్యక్తుల్ గావలెన్; దానిపైఁ
దలరుం బ్రాక్తన నూతనత్వ విచికిత్సల్; దానిపైఁ జేటుఁ బా
టులు; కౌపీననిమిత్తసాధితపటాటోపంబు నీ కేటికిన్? 170

క. కాల మకాలము నాక త
టాలునఁ బ్రాణులను జంపుటయె? యెందొరు పో
టీలయి దీర్ఘాయువులుగఁ
బాలించుటొ క్రొత్తయముఁడు ప్రాఁతయముఁడు నై. 171

ఉ. నీ యొనరించు ప్రేతపతి నీకడకుం జనుదెంచు; నట్టులే
నాయొనరించినాతఁడును నాకడకుం జనుదెంచు; నాపయిం
జేయువిధాన మెద్దియొ వచింపుము; నీకును, నాకుఁ జూడు మ
న్యాయముగాఁ గుటుంబకలహంబున కయ్యది త్రోవ దీయదే?

చ. అనవుడు గాధిసూనుఁడు కరాంబుజముల్ శిరమందుఁ జేర్చి యి
ట్లనియె; మహాత్మ! మీ రెఱుఁగనట్టి విశేషము లున్నవే? త్రిశం
కునిఁ గొని పోటిసేయ మదిఁ గోరఁ; గడుందురవస్థఁ జెంది తాఁ
బనివడి వచ్చి నాపదముఁ బట్టిన నే నభయంబొసంగితిన్. 173

ఉ. అంతటివానికిన్ సుతుఁడనై, కుశవంశమునందుఁ బుట్టి, నీ
యంతటివాని సంతతికి నంకురమై, శరణార్థిఁ ద్రోచి, య
త్యంతముగా నకీర్తిపటహాన దిగంతము లాక్రమింపఁ గ
ల్పాంతముదాఁక నీఁగఁగలవా? తలవంపులు నాకతంబునన్. 174

చ. అనుచితముల్ సహింపను జరాచరముల్ తలక్రిందులైన; నీ
వని దరిఁ జేరినట్టి యభయార్థి భరింపఁగలేని వ్యర్థజీ
వనము భరించి త్రిమ్మరు శవంబగు నొక్కొ? భవత్కుటుంబమం
దును జనియించువాఁ డెటులఁ; దోఁచెను? తాత వచింప నీక్రియన్.

చ. నిజమున కీ నరేశ్వరుఁ డనింద్యచరిత్రుఁ డటం చెఱుంగు స
ర్వజన; మెదో యవాంతరము వాటిలెఁబో; పరిశుద్ధుఁ జేయలే
ని జపతపంబు లేమిటికి? నిక్కము కుక్కలు నక్కలొల్ల వ
ట్టి జడుని రక్తమాంసముల, డీకొని చేసినబాసఁ దప్పినన్. 176

తే. అశనిపాతకఠోరమైనట్టి శాప
మునకు గుఱియౌట కెయ్యది మూల—మట్టి
దివ్య సుఖభోగలబ్ధికై తివిరి యెంత
మురిసెనో? పాప మీతఁ; డిం తరయవలదె? 177

శా. ఏ పాపం బొనరించినాఁ డని ధరాధీశుం జెడం దిట్టెనో?
చూపింపన్ వలదే? యెవం డిఁక యజించున్ దేవతాకోటి? నీ
శాపంబుల్ కొదవయ్యెనంచు? నకటా! శాస్త్రంబిఁకం గాల్పనే?
పాపంబుల్ శ్రుతిచోదితక్రియలు, తద్వ్యాఘాతముల్ పుణ్యముల్!

సీ. నిఖిల ధర్మాధర్మనిపుణుఁడై ప్రజలఁ బా
లించు ధర్మంబైన నెంచవలదె?
వివిధాధ్వరంబుల వేల్పులఁ దనియించు
విఖ్యాతియేని భావింపవలదె?
తమ తండ్రి కులగురుత్వమున శోభిలు సంప్ర
దాయమైనను జింత సేయవలదె?
సకలజగత్కర్మసాక్షి పునాదియౌ
కులము గౌరవమైనఁ దలఁపవలదె?

తే. ఇంతకు గురుత్వ మర్థించెనే కదా! య
దేమి తప్పని యటు శపియింపవలసె?
నెటు హితం బయ్యె సురల? కి ప్డెల్లు పరుగు
వాఱె? రితరులు తమవంటివార కారె? 179

ఉ. పాత్ర మపాత్రమం చను విభాగము లున్నవె ప్రత్యగాత్మ? కీ
షేత్రము లెల్లఁ దా నధివసించుఁ ద్యజించు; మరీచిమాలి స
ర్వత్ర సమప్రసార మశుభప్రతిపాదక మయ్యెనే? సురా
పాత్రమునన్, సురాపగను బర్వి రవిప్రతిబింబ మొప్పదే! 180

చ. నిజముగ సూక్ష్మదృష్టి గమనించితిమేని శ్వపాకుఁ డెవ్వఁడో?
ద్విజుఁ డెవఁడో? జడంబయిన దేహమొ? సర్వగతుండనామయుం
డజుఁ డజరామరుం డయిన యాత్మయొ? యింత కనర్థ వస్తుసృ
ష్టి జగతి కేమి లాభ మని సేయుదు వీవు? జగత్పితామహా! 181

ఉ. కాన ననర్థుఁడం చనుట కానిమతం; బధికారగర్వముం
బూని త్రిశంకు గెంటెఁ గ్రతుభుక్తతి; నావిధి నిర్వహింప నె
ట్లై నొక స్వర్గమైన సృజియించి త్రిశంకునిఁ బంపకున్న వా
గ్దానము వీటఁబుచ్చవలదా? కలదా? కులధర్మ మీక్రియన్. 182

శా. తిర్యగ్జంతువుఁ బాఱఁద్రోలినక్రియం ధిక్కారముల్ సల్పియుం
బర్యాలోచన లేక వాక్చిరముగాఁ బైనుండి త్రోయింప నే
ధైర్యం బూని కడంగి రింతటి దురంతక్రూరదుశ్చేష్టకుం?;
బర్యాప్తిం గనఁగా? శ్వపాకుఁ డనినం బాషాణ మేమోకదా!

శా. ఏ ప్రారబ్ధమొ కాని యిన్ని కథలయ్యెన్; బొందితో నింద్రలో
కప్రస్థాన మఖండపుణ్యపరిపాకం బందురా? కాద? యిం
దప్రత్యక్ష మొకండు లేదుకద? దోషాసంగ మెం దుండె? నీ
యప్రాశస్త్యపు ఘోరకృత్యములు తాతా! పాపమా? పుణ్యమా?

చ. గతజలసేతుబంధన మిఁకం బనిలే; దొక రస్మదీయులై
యితరు లొకళ్ళు లేరిచట; నే సురవర్యులజోలి యింతయున్
మతిఁ దలపెట్టలే దిపుడు; మాట యొసంగితి; వీని కేదియో
గతిఁ గలిగింపకున్నను జగంబున నేఁ దల యెత్త నేర్తునే? 185

శా. నా కేట్లున్ మొడఁబడ్డచో మభయదానం; బాజ్ఞఁ గైకొందు; నేఁ
డీకార్యంబు ఘటింతు; నావల నెవం డేమేటిలో మూఁకినన్
నా కేలా? యభయార్థి నెడ్డయినఁ బ్రాణం బొడ్డి రక్షించుటే
సాకల్యంబుగ నెన్నతో నిడిన దస్మత్సంప్రదాయంబునన్. 186

వ. అని పల్కి విశ్వామిత్రుం డూరకున్న, విరించి ముఖచతుష్టయార
విందకందళిత మందహాససుందరంబుగా మునీంద్రసందోహంబును,
బృందారకబృందంబును సాభిప్రాయంబుగాఁ జూచిన వారును
నిరుత్తర మౌనముద్రాంకితు లగుటయు, విశ్వామిత్రునివంక
వాత్సల్యపూరితనిరీక్షణంబుల వీక్షించి యిట్లనియె. 187

మ. అపరబ్రహ్మవు నాయనా! యెవఁడు నిన్నాఁగా దనున్? నీవు దృ
ష్టిపథంబందున నిల్చినంతటనె గుండెల్ బ్రగ్గునన్ బ్రీలిపో
నపలాపంబున కాస్పదం బెచట? కీలాభీల కాలాగ్నిరు
ద్ర పటుభ్రూకుటి నారయం దలఁతురే ప్రాణంబు లాసించినన్?

వ. అని సాదరమేదురంబులగు విలోకనంబుల విశ్వామిత్రునాననం
బాలోకింపుచు సకలసుధాంధస్సందోహంబును, మునిబృందంబును
వినుచుండ నిట్లనియె. 189

ఉ. ధాతను లోకనాటకవిధాతను సర్వసుపర్వకార్యసం
ధాతను — నీకు తాతనుగదా! యుభయుల్ నను గారవింతు; రీ
నీతికి సంతసింపవలె; నిక్కము; నే నొకమాటఁ జెల్పెద;
న్నోఁతును బాఁతు నారసి వినుండు జగత్త్రయశాంతి చేకుఱున్.

వ. ఇట్లు వచించి వెండియు సరోజసంభవుండు గాధిసంభవునితో
నిట్లనియె. 191

ఉ. నీవు వచించిన ట్లితఁడు నిర్మలుఁడున్ గుణశాలియే; యదే
దో విధివైపరీత్యమున నుద్ధతిమై గురుధిక్కృతైకదో
షావిలమైన దింత కిపు డారయ నీనరనాథు జీవయా
త్రావిధి; దాన నీతనియుదంతము మాఱెఁ బ్రశాంతిమారమై. 192

మ. హరి కోపింప గురుండు ప్రోచు; గురుఁడే యౌద్ధత్యముం బూనినం
బరిపాలించెడివాఁ డెవండు గలఁ? డప్పా! నీప్రభావంబునన్
సురలోకంబును జూడఁగల్గె; నదియే సూత్రంబు; నీయాశ్రయం
బరయం గల్గిన దొక్కటే సుమి యితం డార్జించు పుణ్యం బిటన్.

మ. అపవిత్రుండు పవిత్రుఁ డం చనెదు భేదాభేదముల్ గానరా
వెపుడున్ సంవిదనూనదృష్టి; కది యేదీ? భేదభావప్రపం
చపథంబందున సాగుచున్న దఁట ప్రస్థానంబు; తద్భేదమూ
లపటిష్ఠంబఁట సృష్టి; యెవ్వరి నుపాలంభింతువో? చెప్పుమా?

శా. ఆహారంబు విహార మాదియయి న్యూనాధిక్యభేదాప్తికిన్
దేహివ్రాతము తా నిసర్గవిహితాధిష్ఠానమై యొప్పెఁ; ద
న్మాహాత్మ్యంబున జాతి రూప గుణ వర్ణ స్థాన వైవిధ్య మా
రోహించెన్ మృగ పక్షి వృక్ష నర వీరు న్ముఖ్యభూతంబులన్.

ఉ. ఆంతరదృష్టి కీకనున దంతయు మిథ్యయ కాదె! యట్టివే
దాంతము వ్యావహారికమునం డిడి నోటికి వచ్చినట్లు వా
దింతురు; నీవు నే నను మతిభ్రమ వీడని వట్టి మెట్ట వే
దాంత మిసీ! పొసంగునె? యథార్థవిచార మొనర్చి చూచినన్.

మ. తనధర్మంబును నిర్వహించుకొనునంతశ్శుద్ధి లేమిన్ దటా
లున నద్వైతమ యూఁతయౌ నరునకున్ లోకంబుఁ గన్మాయ; నం
చ నడల్ రావు, బకప్రయాణము లనిష్టంబుల్; తుదిన్ రెంటఁ ద
ప్పి నశించున్ మృగ పక్షి కీట ముఖమౌ బీభత్సజన్మాప్తిచేన్.

తే. అని వచింపుచుఁ గొంత యాతనికిఁ జేరు
వగునటుల నంతరిక్షంబునందు క్రిందిది

భాగమున నిల్చి యారీతిఁ బల్కె; 'నో కు
శాన్వయాబ్ధిశశాంక! ముఖ్యాంశ మొకటి. 198

క. మనలోని మాట నీ వి
చ్చినశాపం బెదో యల వసిష్ఠసుతుల? కీ
తని కిప్పు డీ వొసఁగు మ
న్నన యెదో? సింహావలోకనము సేయు మిటన్. 199

వ. అమ్మాట కొక్కింత సే పూరకుండి, వెండియు విశ్వామిత్రమునీంద్రుం
డిట్లనియె. 200

ఉ. నావచనంబు వ్యర్థమయినం బనియే మిఁక నీప్రపంచసం
భావనతోడ నాకు? చెపుమా? శపథంబును దప్పనంత దు
ర్భావము నొందఁ డీకుశికవంశజుఁ; డింక ననుజ్ఞ యిమ్ము; నా
శావల నెల్లు గావలసె నట్లగు; మీ రిఁక నడ్డురాకుఁడీ. 201

క. అనినఁ జతుర్ముఖుఁ డను; నా
యన! నీవచనము వృథావ్యయం బగుటకు నే
మును సమ్మతింప మెన్నఁటి
కిని; సర్వసమంజసంబు గీల్కొనవలయున్. 202

మ. అలవైశ్వానరమండలంబు వెలిగా నాః స్ఫురజ్జ్యోతిరు
జ్జ్వలముల్ గాఁగ భవత్కృతంబులగు నక్షత్రౌఘముల్ శాశ్వతం
బులుగా నిల్చు; నవాక్షరంబు వెలయన్ భూనాథుఁ డందే సము
జ్జ్వలతేజంబునఁ బొల్చు దేవనిభుఁడై చంద్రార్కు లున్నంతకున్.

తే. అదియు నీవాక్ప్రభావంబ; యవనిఁ బడెడు
నధిపు నిల్వు మందే యను నాశయమున

నిలుపు మఱ్ఱె యనవె త్వరాన్వితుఁడవై? య
మోఘవచనుఁడ వీవు; తప్పునె? కుమార! 204

శా. శోభాబంధురరీతిఁ దా ననుగమించున్ నేఁటి జ్యోతిర్గణం
బీభూపాలుని స్వర్గలోకగతు నఱ్ఱె కీర్తిమంతున్ గృతా
ర్థీభూతుం; గొద వేమి? యెందయిన నీరీతిన్ సమర్థించిరే
స్వాభిప్రేతము నీచతుర్దశజగజ్జాలంబునం దెవ్వరేన్? 205

మ. ఇదియే నూతనమైన స్వర్గ; మితఁడే యింద్రుండు తాఁ గోరుకొ
న్నది స్వర్గంబ; తదాధిపత్యమును సంప్రాప్తించె; బృందారకుల్
మది కానందముఁ జెంది రొక్కమొగి; నామాధ్యక్ష్యముం జెల్లె; స
ర్వదిగంతంబుల నిండె నీకథలు; వహ్వా! తీర్థమున్ స్వార్థమున్.

చ. అనవుడు గాధిసూనుఁ డిది యా ననుచుం దలయూఁచె; నానృపుం
డును ముద మందె; దేవతలునుం బళిరా! యని; రమ్మునీంద్రు లా
నని కొనియాడి; రా సవన మయ్యె శుభాంతము; గాధిపుత్రు జే
యని కొనియాడుచున్ నిజగృహంబులకుం జని రెల్లవారలున్.

—, ఆశ్వాసాంతము ,—

శా. వేదాంతప్రతిపాదితస్ఫురణ! సంవిద్వేత్తృవేద్యస్వరూ
పా! దివ్యప్రతిభా! నిరంతర దురంతాజ్ఞానతామిస్ర వి
చ్ఛేదప్రోద్యదఖండచండకిరణా! శ్రీజానకీహృత్సరో
జాదిత్యప్రతిమానవిగ్రహా! మహోద్యన్నిగ్రహానుగ్రహా! 208

చ. వరమునిమానసాంబుజనివాస! విభాసితచిద్విలాస! సుం
దరవదనారవింద! పరితఃప్రసరత్కరుణావలోకనా
విరతసుధాప్రవాహ! సువివేకిజనప్రచయప్రసన్న భా
స్వరముఖ! సంతతోజ్జ్వలశుభప్రకృతీ! సుమనోహరాకృతీ!

మాలినీవృత్తము. పరిణతహృదయాంతర్భాగవిజ్ఞానదీప!
స్ఫురణ విదితనిత్యస్ఫూర్జదానందరూపా!
విరచితజగదండావిష్కృతిధ్వంసఖేల
ద్గురుతరనిజమాయాకుంఠశక్తిప్రకోపా! 210

## గద్యము

ఇది శ్రీరామచంద్ర కరుణావిభవ కవితానుభవ
శివార్యతనూభవ సుధీజనవిధేయ సుబ్ర
హ్మణ్యనామధేయ ప్రణీతంబైన
బ్రహ్మతేజోబలంబునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః.

# బ్రహ్మతేజోబలము

లేక

# విశ్వామిత్ర చరిత్రము

## తృతీయాశ్వాసము

శ్రీ కళ్యాణగుణా! గుణ
వైకృత్యవిదూర! దూరపరిహృతవిషయా
నీకః సుఖభోగజనల
క్ష్మీకృతశుభరూప! రూపజితమారశతా! 1

వ. దేవా! యవధరింపు మట్లు సకల ముని సురాసుర నికరంబులతో
విరించి తిరోహితుం డగుటయు యజ్ఞోత్సవదర్శనాగతులైన జాన
పదులందఱుం దమతమ నివాసంబులకుం జని; రిట విశ్వామిత్రుండు.

క. అంతఁ గృతకృత్యుఁ డగుటకు
సంతస మొకవైపు, నటఁ బ్రశాంతి దొరకమిం
జింత యొకవైపు దోఁపఁగఁ
బ్రాంతస్థితమునులఁ బిలిచి పలికె మృదుగతిన్. 3

శా. నాకీ దక్షిణదిక్కునం బ్రబలవిఘ్నం బావహిల్లెం జగం
బాకంపింప; నిఁకేల! పుష్కరములం దాపశ్చిమాశం దప
శ్శ్రీకల్యాణవిధానమున్ సలుపఁ గాంక్షింతుంజుఁడీ! యంచు లో
కైకోదగ్రతపోభియోగవిలసద్వ్యాపారపారీణుఁడై. 4

వ. పశ్చిమాభిముఖంబుగాఁ జని పుష్కరంబులం దపోవనంబునకుం
దగినప్రదేశంబు నిర్ణయించి, యం దొక్కపుణ్యాశ్రమంబు

నిర్మించి, యందు దక్షిణదిక్కుం బూని, యుద్దండతపంబున కారం భించె; నది యట్లుండె; విశ్వామిత్రు శాపానలంబున నిజపుత్ర శతంబు భస్మసాత్కృతం బయ్యె నని చెవిం బడినమాత్రంబునం బిడుగుపడిన వృక్షంబుపగిది నేలం బడి పొరలి లేచి వసిష్ఠమునీం ద్రుండు. 5

—, వసిష్ఠుండు పుత్రశోకంబున విలపించుట ,—

క. కన్నీరు వఱదలై పా
ఱ న్నిరవధిశోకసాగరము పొంగ ననన్
మిన్నును మన్నెకం బగు
తెన్నున వాపోవఁ దొడఁగె దీనముఖుండై. 6

చ. కడుపెడు బిడ్డలం గని యొకండును జేరెడు నీళ్ళచుక్కలన్
విడువఁగ నోచనైతిఁగద! వెన్కటిబామున నెట్టి తండ్రులం
గొడుకులఁ బాపినాఁడనొ? రగుల్కొను శోకదవానలంబు నా
కడుపు దహించె; జీవిత మిఁకన్ భరియింపఁగఁజాల దైవమా!

క. కట్టా! మారి మసంగిన
యట్టుల నూర్వురు కుమారు లరనిముసములో
నిట్టులఁ దలవనితలఁపునఁ
బిట్టపిడుఁగు గాఁగ నొక్కపెట్ట మడిసిరే? 8

చ. కొడుకుల నూర్వురం గనుటకున్ ఫలమా యిది? వార్ధకంబునన్
వెడవెడ బాష్పముల్ దొరఁగ వెక్కసమై తగు శోకవహ్నిచే
నడలుచు నేకకాలమున నందఱికిం బరలోకకర్మముల్
నడఁకుచుఁ జేయుటల్ శివశివా! మును చేసినపాప మెట్టిదో! 9

ఉ. అంపపుఁ గోఁతమై కఱకఱం దెగ వాంతరమర్మముల్; విదా
రింపుచు నేదియో హరిహరీ! పుటపాకమురీతి లోనఁ దె

ర్లింపులు వాఱుచున్నది భరింపఁగఁ జాలను; జీవితంబుపైఁ
దెంపు వహింతునా? హతవిధీ! యెటు దుర్మరణంబు నోపుదున్?

మ. కడుపుంగోఁత భరింపఁజాల కొకచోఁ గాలూనలేకే సుడిం
బడుచుంటిం దల పుచ్చిన; ట్లకట! విశ్వామిత్రుచిత్తంబు నా
మిడిమేలంబున నూర్వురున్ సుతులు భస్మీభూతులై పోవ నె
ట్లుడుకల్ వాఱెనొ? నాఁడు; నావలె నెకాడో యన్యసంతాపముల్.

క. ఆచేతఁ జేయు కర్మం
బీ చేతన యనుభవింప కెన్నఁటికిని బో
దా చతురాస్యునకైనను;
నాచేసిన దుష్కృతంబు నను వేధించున్. 12

తే. 'ఆత్మవ త్సర్వభూతాని' యను యధార్థ
మవగతం బయ్యె నీనాఁటి; 'కనుభవరసి
కో విజానాతి' యనెడు పల్కును నిజంబ;
యరసి వచియింపరే? పెద్దలైనవారు. 13

చ. హృదయము బ్రద్దలయ్యె; దెసలే కనుపింపవు; కాఱుచీఁకటుల్
గదిరె; దవానలం బడరి కాల్చుచునున్నది; వార్ధకంబుచే
నదవదలైన దేహ మసియాడఁగ నెప్పుడొ రాలిపోకివే
యదుకున నిల్చెనో? కటకటా! గతియింపవు మొండిజీవముల్!

ఉ. ఏమి సుఖింపఁగోరి భరియింతును జీవిత? మేరిఁ జూచి నే
నీమెయి నిల్పికొందు? నిఁక నెవ్వరు వీనులవిందు గాఁగఁ దం
డ్రీ! మహనీయమూర్తి! యని ప్రేమరసం బొలుకంగఁ బిల్తు? ర
న్నా! మరణంబుగూడఁ గఱవో ననుఁబోలిన పాపజీవికిన్. 15

చ. కొడుకులు నూర్వు రొక్క-మొగిఁ గూలిరి; పక్కన వ్రీలిపోవ; దె
క్కడిడి పెనురాతిగుండె యనఁగావలె? నిక్క-ము సారహీనమౌ
నొకలు రుచించునే బలిసియుండిన మిత్తికి? దానిపైఁ జవిం
జెడినది మృత్యుజిహ్వయు వసిష్ఠతనూజశతంబు మెక్కుటన్. 16

ఉ. కాటికిఁ గాలు సాఁచితి; సగంబుగఁ జచ్చిన మొండిజీవితం
బేటికి? నే నిఁకం బ్రదికి యెవ్వరి నుద్ధరణం బొనర్తు? నా
చేటున కంగలార్పఁదగు చిన్నిసుతుల్ మునుముందె పోయి; రే
నాఁటికి నాశ లేదు గద! నాకిఁకఁ జేరెఁడు నీళ్ళుచుక్కకేన్! 17

మ. అనుచుం జయ్యనఁ బాఱి దూఁకె రభసోద్యద్వీచిమాలా పునః
పునరుద్వేగ నభస్స్పృశంబగు మహాంభోరాశిలో;—దూఁకినం
తనె యత్యద్భుతదృశ్య మేర్పడె: సముద్రం బింకె; నౌర్వానలం
బు నదృశ్యంబయిపోయె; జంతునివహంబుల్ మాయ మయ్యెం
దుదిన్. 18

వ. ఇట్లా సర్వభూతమయంబైన బ్రహ్మతేజో నిధానంబు నా జల
భూతం బడంప సామర్థ్యంబు చాలమిం దాన తిరోహితం బయ్యె
నంత; 19

మ. కనులం దశ్రునిపాతముల్ జడి గొనంగా భోరునం బెద్ద పె
ట్టున రోదింపుచు వెఱ్ఱియై యలవసిష్ఠుం డొక్కకాంతారమం
దున దావానలమధ్యముం జొరఁబడెం; దోడ్తోన శాంతించె న
య్యనలం; బగ్నినిసర్గదాహకగుణం బగ్నిం బ్రవర్తించునే? 20

ఉ. అంతటనైన మార్చికొనఁ డా హృదయంబు; విషాదమేదుర
స్వాంతమునన్ వెకారుచు వెసం జని పర్వతకూట మెక్కి ప్రా
ణాంత మొనర్పఁగాఁ దెగిన నయ్యది మాటె సమస్థలంబుగా;
నంతట నిస్పృహుండయి యహా! యనుచుం దలయూఁచియిట్లనున్.

తే. చావఁ డీపాపజాతి; వేసార్లు ప్రళయ
భైరవకఠోరదంష్ట్రలం బడినఁగాని,
క్షుభితకాలాగ్నిరుద్రచాక్షుషమహాగ్ని
కీలలం బడి గనగనఁ గాలెనేని. 22

మ. ఇఁక దుర్వారదురంతదుఃఖమున కే యీ మొండి చైతన్య మి
ట్లొకఁ బేరీతిగ నస్థిపంజరములో నుట్టూఁతలై పాయ; దం
తకు నింతయ్యె; నిఁ కాళ లే దొకనికై నన్ ప్రేలెఁ డంకూర; మే
టికి నిర్భాగ్యులు పుట్టి గిట్టి యిటు లేడ్పింపంగ వ్యర్థంబుగన్? 23

శా. ఈ పాపిష్ఠునితో సమాప్తమయిపోయెన్ మాదువంశంబు, మా
కీపైఁ జేరెఁడు నీళ్ళుచుక్కలకు నేదీ యాస్పదం? బం చటన్
మాపెద్దల్ పరలోకమం దడలఁగా నాయీ యభాగ్యంబు వం
శాపాయంబునెకాని వీని మసిఁజేయం జాలదేమో కదా! 24

వ. ఇప్పాపాత్ముని యాతనానుభూతి కంతంబు లేదు గావున నా యీ దౌర్భాగ్యదేవత నన్నంతంబు నొందింపఁ జాలదయ్యె, నని చింతించి యంతకంతకు దురంతచింతాక్రాంతంబగు నంతరంగంబు సంతసింపఁ గొంతవడి మ్రాన్పడి, స్థాణువుపగిది స్తంభించి యెట్ట కేల కొక దీర్ఘనిశ్వాసంబు పుచ్చి, ముక్కుపయి వ్రేలు గీలు కొల్పి, కాలవైపరీత్య మారా! యని కాలు గదల్చి, యిచ్చో టచ్చో టను నిర్ణయంబు లేక వెఱ్ఱి యెత్తినపగిది దిశావిభేదంబు సైత మెఱుంగక, వెక్కివెక్కి వెక్కసంబగు నెగులునం బొగు లుచు నరుగుచుండఁ బశ్చాద్భాగంబున మృదుమధురస్వనంబుతో సుస్వరంబుగా వేదనాదంబును, స్త్రీకంఠరోదనధ్వనియునుం జెవిం బడిన నమ్మునీంద్రుండు వెనుకకుం దిరిగి చూచుటయు. 25

సీ. మత్తాళు లాలసిన నెత్తమ్మిపైఁ దోఁగు
    ప్రాలేయనిష్యందజాల మనఁగ
నాలోలకబరిక మైన నెమ్మోమునఁ
    గన్నీరు జడిఁగొని చెన్ను దొరఁగ
నడుగులు తడఁబడ నార్తయై జవజవం
    దూఁగాడు నిండుప్రొద్దుల కఠోర
గర్భభారంబుతో, దుర్భరం బగు నూత్న
    వైధవ్యదుఃఖంబు ప్రాప్త మగుట

తే. సిగ్గు వగ పెనఁగొన మది చివికి పాఱు
టాకుఁబయ్యెద కన్నీటివాక నాని,
పరగ మూర్తీభవించు నపారకరుణ
రస మనఁగఁ దన్వి యోర్తు దూరమునఁ దోఁచె. 26

వ. మఱియు న త్తపస్వినియు దుర్భరం బగు గర్భభారంబున నడుగులు తడఁబడుచుండ నడువనోపనిదయ్యు నెడనెడం బొడమెడు నశ్రుకణంబులు దృష్టినిరోధకంబు లగుచుండ, వెక్కి వెక్కి యేడ్చుచుం దొలుతనుండి తన్ను వెన్నంటి వచ్చుచుండుట శోకావేశవివశుండై యమ్మునీంద్రుం డెఱుంగనికతంబున నతిదూరంబున వచ్చుచున్న యయ్యువ యెవరో యని యించుక నిలిచి చూచుచున్నంత నంత కంతకుం దన యంతికంబునకుం జేరవచ్చునయ్యింతిం గాంచి, తన యగ్రనందనుం డగు శక్తి యనువాని సహధర్మచారిణి యనియు, నంతర్వత్ని యనియు, గుర్తించి పట్టరాని శోకావేశంబునకుం గొంత మనశ్శాంతికిం గుఱి యగుచు నాసాధ్వీమణి గర్భకుహరంబులోన నుండి శ్రుతం బగుచున్న యౌపనిషదర్థంబు నరసి వ్యర్థంబుగ నింతవఱ కావరించిన యజ్ఞానంబును నిందించి పవిత్రంబైన వంశాంకుర మున్నదిరా యని సంతసించె; నింతలో. 27

మ. పిడుగుం బోలిన దుర్విపాకమునకున్ ఛేదిల్లు డెందంబుతో
విడుపుంగానని వేధ గాఁగ శ్వశురున్ వీక్షించి, హాహారవం
బడరన్ బోరన నేడ్చె నత్తపసియిల్లా; లశ్రుపో దుఃఖముల్
వడి నాత్మీయులఁ గన్నమాత్ర వివృతద్వారంబులై పొర్లెడిన్. 28

మ. నవవైధవ్యము ఘోరవజ్రహతి; తానా? నిండు చూలాలు; లో
నివురంబాఱెను ధైర్యసారము; జగంబే శూన్యమై తోఁచె; నా
క్కఁవడిం దెప్పునఁ గూలి రాలు గరఁగంగా నేడ్చెఁ గన్నీరు కా
లువలై, వెల్లువలై, ప్రవాహమయియాలోకింప ఘోరంబుగన్.

వ. ఇట్లతికరుణంబుగా విలపించు నక్కోమలిం గాంచి, కన్నీ రాఁపు
కొనుచు సాదరంబుగా, సకౌతుకంబుగా మునీంద్రుం డిట్లని
యోదార్చె. 30

—, వసిష్ఠుండు వైధవ్యపీడిత యగు కోడలి నోదార్చుట ,—

మ. కలదమ్మా! కల మూర్జితంబయి భవద్గర్భంబునం దుజ్జ్వలో
జ్జ్వలమా తేజ, మమోఘు, మాతతతపస్స్వాధ్యాయ; మా
దివ్యమం
గళ చారిత్రుని జూచికొంచు నిఁక నీ కాలంబు వెళ్ళింపఁగాఁ
గల; విశ్లే మొలలోఁతు దుఃఖమున మోకాల్ బంటిసంతోషముల్.

సీ. ఈశ్వరసంకల్ప మేవేళ కెట్లో? యె
ఱుంగఁగ దేహధారులకు వశమె?
యొకఁడు నవ్వుచునుండ నొక్కఁ డేడ్చుచు నుండు;
నవ్వినవాఁడె చింతను మునుంగు;
నగవులో నేడుపు నగు, నేడుపున నగ
వగు; దార బంటు, బం టగును దొరయుఁ;
గలలోనఁ గన్గొన్న కరణిఁ, గనుకట్టుచం
దమునఁ గన్పట్టు; సర్వమును గల్ల;

తే. నిజము నెఱుఁగంగ లేక కన్నీరు దొరఁగ
నేడ్చుచుందురు బోరన; నిదియె పార
మేశ్వరి యనంగఁబడు మాయ; యెంతవారు
దీని భేదింపలేరు; బిడ్డా! నిజంబు. 32

మ. నను సర్వజ్ఞుఁ డటంచు నెల్లజను లానమ్రాస్యులై కొల్తు; రి
ష్టనుసంధించిన పామరత్వ మది యేయజ్ఞానికిం గల్గ; దే
మనవచ్చున్ ? భగవద్విలాస మది; వత్సా! యింతకుం జావఁగా
మనఁగానై నస్వతంత్రుఁ డెందుఁ గలఁడమ్మా? దైవికంబంతయున్.

శా. ప్రారబ్ధంబును బట్టి కష్టసుఖముల్ ప్రాప్తంబులౌ; నే క్రియం
దీఱం బోదది బ్రహ్మకైన ననుభూతిం గాంచు పర్యంతము;
స్థిరుం డెప్డుఁ జలింపఁ డాపదను గాని, సంపదం గాని యా
త్మారాముండయి యంటియంటక యవశ్యంభావిభావంబులన్. 34

శా. నానాథుం డని, నాదుదైవ మని హృన్మర్మంబు భేదిల్ల నెం
తో నిర్వేదముఁ జెందె దీ; విటులనే తొల్లింటి జన్మంబులం
దీ నిర్భాగ్యుని కెందరాం డ్రయిరో? ముం దిం కెందఱో? నీకు; ని
ట్లే; నిక్కంబు నెఱుంగ దుఃఖమున కేదీ తావు? యోజింపుమా.

తే. లోకనాటకరంగంబులోన వేష
ధారులే కాని, యెక్కడి తల్లిదండ్రు?
లెచటి యిల్లాం? డ్రెచటిబిడ్డ? లేటి బంధు?
లేమి సంబంధ? మెవ్వరి కెవరు? చెపుమ! 36

చ. అలమిన వేడ్క మార్గమున నాడుచుఁ బాడుచు నేఁగుపైనపు
వ్వలయిక! యెంతకాలము గనందగు, నంతియ సుమ్ము! బంధుమి
త్రులు, పతులున్, సతుల్. సుతులు; తోడయి రా రొకరున్; ఋణానుబం
ధ లతలు ద్రెళ్ళఁగా నెవరిదారిని వారె కదమ్మ! కోడలా! 37

శా. నాకుం బుత్రుఁడు గాఁడె? నీకు మగఁడైనన్? నావలెం దంద్రులై
యీ కష్టాత్మున కెంద ఱేడిచిరో? వీఁ డీరీతి ము న్నెందఱం
బోకల్ వెట్టి తపించెనో? యిటు లిఁకన్ ముం దెన్ని గానున్నవో?
రాకల్ పోక లవెన్నొ జీవులకుఁ? బ్రారబ్ధానుసారంబుగన్. 38

మ. అని బోధింపుచుఁ గోడలిం గొని స్వకీయంబైన పుణ్యాశ్రమం
బునకుం జేరిచి, యూర్ధ్వదైహికములన్ బూరించి పుత్రాళికిం,
దన యాథార్థ్యము నాత్మ నెంచుచుఁ బ్రశాంతంబైన స్వాంతంబునం
దను దాఁ గాంచి సుఖించి మైమఱచె నానందానుసంధానతన్. 39

శా. ప్రారబ్ధానుభవం బవశ్య మగుటన్ బ్రహ్మర్షి తేజంబు మా
యామాప్రతిసీరప్రాప్తుఁ గని తాదాత్మ్యాభినేయక్రియల్
బారం బందుటయున్, బరిస్ఫురితమై ప్రజ్ఞావికాసంబు వి
స్మేరాగ్నిప్రతిమానమై పొలిచె రాశీభూత మైనట్లుగన్. 40

వ. అంతఁ గొంత కాలంబున కంతర్వత్నియై యున్న తదీయ స్నుష యొక్క శుభముహూర్తంబునం బరాశరుం డను దివ్యతేజోరాశి యగు నొక్క కుమారుఁ గాంచె; నతనిచే రచింపఁబడినదియ పరాశరస్మృతి యనం బ్రసిద్ధంబై యుండె; మఱియు. 41

క. ధీరుం డయ్యనఘునకే
పారాశర్యుండు వ్యాసభగవానుఁ డనన్
నారాయణాంశమున జగ
దారాధ్యుం డవతరించె; నది యట్లుండెన్. 42

—, ద్వాదశవార్షిక వీరక్షామము ,—

వ. విశ్వామిత్రుండు పుష్కరంబులం దపం బాచరించుచుండు కాలంబున ద్వాదశవీరక్షామంబు తటస్థంబై — 43

చ. అటుకులకైన గింజ కఱవయ్యెఁ గదా యనుచింత కొన్నినా
ళ్ళటవులఁ గాయలున్ గసరులై నను లేవని కొన్నినాళ్ళునై,
గుటకెఁడు నీరుఁ జిక్కమికి గొంతుక లెండి నశించి రెందఱో,
పుటుకున నొక్కచిన్కయిన భూమిపయిం బడ దెన్నినాళ్ళకున్.

చ. గగనము నంటి క్రాలిన నగమ్ములు నిల్వున నెండి కూలె; నెం
దగపడ దొక్కతీవయు; మహానదు లింకఁగఁబాఱె; గువ్వ ద్రా
వఁగ నొక గ్రుక్కెఁడున్ జల మభావము; నాఁటి యవస్థలం దలం
పఁగఁ బగవారికైనఁ దగవా? భగవంతున కెంత క్రౌర్యమో! 45

మ. జపముల్, ఘోరతపంబులున్, బ్రబలదీక్షల్ పూని యెన్నాళు లెం
త పరాకాష్ఠ వహించి చేసిన నసాధ్యంబైన దుర్యోగ మా
టుపయోగింప దటంచు నాఁటి మహర్షియుల్ నిస్పృహన్ జెందఁగా
విపరీతంపుఁ బరీక్ష యేర్పడె ననావృష్టిన్ జగం బంతటన్. 46

మ. తుద కాహారము మృగ్య మాకతన 'జంతోర్జంతు రాహార' య
న్నది సార్థంబుగఁ బక్షులై, పశువులై, యారణ్యసత్త్వంబులై
యెదియున్ జాలద మానవాళి; కిఁక నేదీ యాశ? శార్దూలముల్
మొదలైనట్టి పలాశపాళి; కుదరంబుల్ మాఁడి చాకుందునే? 47

చ. ఒకరి నొకళ్ళు పీఁకి తినుచుండిరి; తిన్న క్షణంబులోననే
తికమక లాచు నీల్గుదురు; దీనిఁ గనుంగొనువాఁడు నట్టి కా
టకమునె చేసి చచ్చు; నకటా! యది యెంతటి పాపకాలమో!
యొకదినమా? నెలా? యెటుల నోర్చెద రన్నములేక ప్రాణముల్?

వ. అట్టి సమయంబునం గాధేయుం డెన్నిదినంబులనుండియో
యొక్క కడి యన్నంబుఁ గన్నులం గానక యాకు లలములుం
గడ్డి గాదం బేనియుం దొరకని వఱపై తిరిగితిరిగి సుడివడి యొడలు
వశంబుఁ దప్పి, సొరిఁగి పడుచు, లేచుచు, నాహారకాంక్ష నొక్క-

జీర్ణారణ్యంబులోనం బర్యటింపుచు నొకానొకనాఁటి యర్ధరాత్రంబునం దొక్క చండాలవాటికకుం జని యం దొక్క కుటీరంబు ముంగిట నపు డపుడ యొలిచి యాఱవైచిన సారమేయచర్మంబులునుం, బాఱవైచిన యస్థిపంజరంబులునుం గాంచి, యిచ్చోటం గుక్కనంజు డెక్కరణినేనియుం జిక్కవచ్చు; నొక్కింత సంగ్రహించి ప్రాణంబులం దక్కించికొని తక్కుంగల్గు పాపపుణ్యవిచారం బావలం జూచికొందమని మెల్లమెల్ల లోనికిం జని భాండంబునం బదిలపఱచియుంచిన మాంసంబు నొక్కింత గ్రహించికొని పోవుచుండ యజమానుండు మేల్కాంచి, నిలునిలు మెందుఁ బోయె? దెవఁడవురా? యని హాటాహాటిం గటారిఁ గొని తుటారింపుచుఁ దటాలునఁ బయింబడ దూఁకి యెగాదిగం జూచి నివ్వెఱపడి చేత నున్న యసిపత్రంబు విసర్జించి, సాగిలిపడి నమస్కరించి డగ్గుత్తికతో నిట్లనియె. 49

మ. ఇది చండాలగృహంబు; బ్రాహ్మణులు మీ; రిందున్ శ్వమాంసంబ; య
య్యాదియుం దొంగతనంబునం గుడుచుటా? హా! యెంత ఘోరంబు; నా
మది కెంతో వెత యయ్యెఁ గక్కుఱితికిం బాలౌ మిముం జూడ; మీ
మది కె ట్లింపితమయ్యెనో! విధికృతంబా? లేక ప్రారబ్ధమా? 50

మ. అనినం గౌశికుఁ డీగతిం బలికెఁ; నీ వన్నట్టి దెల్లన్ యథా
ర్థనిబద్ధం; బిపు డన్నటుల్ విధియుఁ, బ్రారబ్ధంబు రెం డేకమా
టనె ప్రాప్తించెడు నిట్టిఘోర దురనుష్ఠానోద్యమానర్థముల్
జననం బందిన సర్వజీవుల కవశ్యంభావిభావంబులై. 51

వ. విధికృతంబై యిట్టి ద్వాదశవార్షికహీరక్షామడాంబరంబు సమస్తప్రపంచంబున కేర్పడియెఁ; దన్మూలంబునం దత్తత్ప్రారబ్ధానురూపంబుగనే యవాంతరభేదంబు లఖిలప్రాణిసమూహంబున కాపాదించెఁ; గర్మానురూపంబుగనే నా కీయనర్థం బావహిల్లె. 52

తే. ఎంతవారి కుపాధి యున్నంతవఱకు
క్షుత్పిపాసలు తప్పవుసుమ్మి; ధర్మ
సూక్ష్మము దురవగాహంబు; చూచిచూచి
నిందు ప్రాణంబు వాయుట మొండితనము. 53

చ. అసువులు వోవుచున్న; వహహా! నిలుపోపఁగఁజాల; నేదియో
మెసవినఁగాని నిల్వదుసుమీ! తను; వంతఁ దపోగ్నికీలచే
మసిరొనరింతుఁ బాపము; లమానుషభంగి సమస్తధర్మక
ర్మసముదయం బొనర్తు; నది ప్రాణము లూడిన నెట్లు శక్యమా? 54

మ. తన ప్రాణంబుఁ బరిత్యజించిన జగత్కల్యాణ మేదేఁ బోసం
గునెడం దప్పక ప్రాణముల్ విడువ సంకోచింపరా; దే నెఱుం
గనె? నిష్కారణ మాత్మహింసకుఁ గడంగన్? దీన నేధర్మసా
ధనమౌఁ? బాపమె కా! మనం గలుగుచందం బుండియుం జచ్చినన్.

ఉ. ఏ నొనరింపఁగాఁ దగిన వెన్నియొ ధర్మము లాఁగిపోవు నా
ప్రాణము లూడెనేని; యది బాగొ? శ్వమాంసము మెక్కి వచ్చు పా
పానలముం దపోబలమహత్తరధాటి నడంగఁ ద్రొక్కి, య
న్యానుపలభ్యపుణ్యసముపార్జనసేయుట బాగొ? చూడుమా! 56

క. నా పావిత్ర్యము సెడు నని
యే పశ్చాత్తాపమేని యిట ముచ్చిమి నా
కాపాదింపదు గద! నీ
వే పంపుము మాంస మిడి; య దెంతో సుకృతమా. 57

వ. ఇప్పాపంబు వాపిన సుకృతంబునకన్నం బ్రాణదానం బొనర్చిన సుకృతంబు ద్విగుణితంబై తప్పక ముప్పిరిం గొనఁగలదు; నీవలన నాయొనర్చిన తస్కరత్వాచరిత దురితంబు నపనయించిన యుపకృతి నాకును, నావలనం బ్రాణదానమహాసుకృతలాభతాపం

బునం బ్రత్యుపకృతి నీకును సిద్ధించు; నీ వల్పుండ వయ్యు వినయ వివేకంబులంబట్టి నీ విందుల కర్హుండ వని నీ కీఫలంబు నేనై యొసంగుచుంటిఁ; జౌర్యకృతంబైన పాపం బొక్కటియ నీకుం బాపశక్యము; తక్కుంగల్గు సమస్తంబునకు మదీయ తపోబలంబ యున్నది; నీ కీ ప్రాణదాన మహాఖండ సుకృతం బప్రయత్నలబ్ధం బగుచున్న; దనిన వాఁ డమందానందంబున వినయ వినమిత గాత్రుండై చేతులు మొగిచి యిట్లనియె.  58



ఉ. అంతటి యాఁకటం గుమిలి యక్కట! మీ రిది యైనఁగాని ర
వ్వం; తయినన్ గ్రహింప; రెటులాఱెడు నాఁకటిచిచ్చు దీన? నిం
కింత గొనుం డనన్ వల దిఁకెందటినో బ్రతికింతు వీవు; నా
కింతియ చాలుఁ; బ్రాణముల కించుక యాదరువైనఁ జాలదే? 59

వ. అని వానివలన మాంసంబుఁ గొని, నిజాశ్రమంబునకుం జని యిట్లని యోజించె.  60

తే. ఎప్పటికి నెట్టి భుక్తి ప్రాప్తించు నదియు
దైవదత్తంబ; యట స్వతంత్రత హుళక్కి;
దైవ మిడినది తన్ని వేదనమె; మఱచి
యట్టె కబళింప నది తన యబ్బగంటె! 61

వ. అట్లు భుజించినవాఁడు తస్కరుండ కాఁడె! వాఁడు భుజించినది పాపంబ కాని యన్నంబు గాదు; 'కేవలాఘో భవతి కేవలాదీ'; అని శ్రుతియు, "తై ర్దత్తా నప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః", "భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మకారణాత్", అను స్మృతియు బ్రమాణంబులై యుండ దేవతలకు నివేదింప కిమ్మాంసంబు భుజింపరాదు; తనకు దైవం బిడిన యాహారంబు దైవంబున కొసంగుట కర్హతానర్హతా వివేచనం బక్కఱ లేదు; "యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః" అని

నిశ్చయించి, యమ్మాంసంబుఁ దనసహధర్మచారిణిచేఁ బచనంబు సేయించి, శుచియై వార్చి, దేవతాహ్వానంబుఁ గావించి, వైశ్వదేవం బొనరింపనున్న నింద్రాది బృందారకులు వితాకుఁ జెంది, విస్మితులై వెల్లఁబోయి, యుల్లంబులు పల్లటిల్ల నిట్లని విచారించిరి. 62

ఉ. కారణజన్ములై తగు జగన్నుతనిర్మలధర్మకర్మదీ
క్షారతు లిట్టి చెట్టకుఁ దెగంబడ నెట్టిదురంతరఘోరదు
ర్వారమహోగ్రకారణమొ వాటిలకుండినఁ గాదు; నిక్క; మిం
దారయ వైశ్వదేవమునకైనఁ బ్రసాదము సున్నయౌటయే. 63

మ. పదిరెండేండ్లు పుటుక్కునం జినుకు భూభాగంబుపై రాల; దె
ట్లొదవుంగూ? డమృతాంధసుల్ కఱవులేమో? కాటకా లేమొ? యే
కొదవై వారు గ్రహింతు? రంచిటుల మాకున్ సాకుతోఁ దెల్పినాఁ;
డదిరా! చిక్కని పండువాఁత యిది యం చల్లాడి రుల్లంబునన్. 64

శా. వర్షావర్షకృతాధికార మది మా వాల్లభ్యమై, తామసం
ఘర్షం బొంది జగం బరాజకము కాఁగా, వైశ్వదేవంబు రా
జర్షిశ్రేష్ఠుఁ డొనర్చినన్ మన యదృష్టం చెం తనన్ వచ్చు? సా
మర్షుండై కను విప్ప నిప్పటికిఁ బోమా? భస్మసాత్కారమై.

ఉ. ముందుగ నట్టిసాహసముఁ బూనినఁ గాటక మౌ నటంచు మ
మ్మందఱ హెచ్చరింప మృదువౌ సదుపాయము, ధర్మసూక్ష్మమున్
గ్రందుకొనం జమత్కృతి యొనర్చి, స్వధర్మము నిర్వహించె; నే
మందము? దోస మెల్ల మనయంద కనంబడుచుండె స్పష్టమై. 66

ఉ. చండతపస్వి కౌశికుఁ డసాధ్యుఁ; డ దెట్టిటొ సాహసింపఁ బూ
నం; డిఁకనేఁ స్వధర్మము నొనర్పకపోయిన దేవతాళికిం
గండము తప్పదం చని; రిఁకం బనిఁ బూనుఁ డటంచు వేగ మా
ఖండలుఁ డానతిచ్చెఁ ద్వరగా నని పల్కుచు మేఘరాజికిన్. 67

వ. అంతఁ బర్జన్యుం డార్జవంబునం గర్జారవంబు లెసంగ, దిగం తంబులు ఘూర్ణిల్ల వర్షించి, యేకార్ణవం బొనర్చె; నాక్షణంబ గాధేయుని యాఁకటిచిచ్చుతోపాటు ప్రపంచం బంతయుం జల్ల వడియె; నక్కతన నతండు భగవంతుండు నా కీశ్వమాంసభక్షణ దోషం బాపాదింపకుండ రక్షించె నని సంతుష్టుం డయ్యె; నిదియ మహాత్ములయం దున్న వైశిష్ట్యంబు. 68

మ. పదిరెండేడుల క్షామమై కడుపు మాడ్పన్ రాలిపోనున్న యా
పదయై యాకలమేనియుం దొరక కాపద్ధర్మమం చెట్టిటో
మది గాధేయుఁడు తా శ్వమాంసమునకుం బ్రాల్మాలెనం! టాక్షణం
బ దెసల్ బ్రగ్గనఁ గ్రుమ్మరించెనఁట! కుంభద్రోణ మంభోదముల్.

మ. కఱవుం గాటక మెందుఁ బోయెనొ? సుభిక్షుం బొటచే జీవులం
దఱిమోముల్ సవికాసభాసురములై దైవారె; సర్వోషధుల్
పఱగెన్; బైరులుఁ బంటలుం బెరిఁగె; దుర్వ్యాపారదుష్కామము
ల్తొఱగెన్; బెద్దలెటుల్ చరించినను బొల్చున్ లోకకల్యాణముల్.

చ. అనుచితముల్ శుభప్రదము లౌను మహాత్ములయందు; నీచులం
దు నుచితముల్ విపర్యయగతుల్ వెలయన్ ఫలియించుచుండు; శం
భునకు విషాగ్నికీలయె విభూష; సుధారస మల్లసైంహికే
యునియెడ మృత్యుజిహ్వ; తమయోగ్యతఁబట్టి క్రియల్
ఫలించెడిన్. 71

వ. మఱియు నగ్గాధినందనుండు మాంసభక్షణంబు సేయకున్నను, సంకల్పమాత్రంబునకే తపం బొనరించి విధూమాగ్నిహోత్రంబు చందంబునం బ్రకాశించె; నైనను విశ్వామిత్రుండు శ్వమాంసంబు భుజించె నను నలీకప్రవాదంబు లోకంబునం బ్రాఁకె; విజ్ఞులైనవా రంద ఱమ్మహాత్ము శక్తిసామర్థ్యచాతుర్యధర్మసూక్ష్మ వైలక్షణ్యంబుల వేనోళులం బొగడిరి. 72

—, అంబరీషుండు యజ్ఞం బొనరించుట ,—

శా. అంతం గొన్నిశతాబ్దముల్ సన నయోధ్యాపట్టణం బేలు భూ
కాంతుం డొక్కరుఁ *డంబరీషుఁడను నైక్ష్వాకుండు సూర్యాన్వయుం
డెంతో ప్రీతి మఖంబు సేయ మఘవుం డేతెంచి మాయావిధిం
బంతం బొప్ప హరించె యాగపశువున్ మాత్సర్యసంపూర్ణుఁడై.

చ. తికమకలైరి యాజకులు; దిగ్భ్రమఁ జెందిరి ఋత్విజుల్; కడుం
గకవికలైరి బందుగులు; కంపము నొందెను రక్షకవ్రజం;
బిఁక గతియేమొకో? యనెడు నెల్గులు చెంగున నింగిదాఁకెఁ; ని
ప్పుకలు దొలంగఁ జూచెను నృపుండు భటాలిఁ గఠోరహుంకృతిన్.

వ. అపు డచటి రక్షకశాఖాధికారులలోని ప్రధానవ్యక్తు లందఱును
వినయవినమితవదనులై తేని కిట్లనిరి. 75

మ. చతురంభోధిపరీతభూవలయరక్షాదక్షుఁడై యాగదీ
క్షితుఁ, డవ్యాహతశాసనం బయి,యసంఖ్యేయుల్ భటుల్ గాచుసీ
క్రతుశాలం బ్రతు కాసయున్నయెడలన్ గాలూన లేఁ డెంత యు
ద్ధతుఁడైనన్; మఱి దైవమాయ యిది; సత్యం బింత భూమీశ్వరా!

వ. అమ్మాటల కనుగుణంబుగాఁ గొంద ఱిట్లని; రగునగు నిది
యమానుషికం బయిన ప్రమాదం బిటఁ బొసంగినది కాని
యన్యంబు గాదు. 'ఛిద్రం హి మృగయం త్యేతే విద్వాంసో
బ్రహ్మరాక్షసాః' అని పెద్దలు వక్కాణింతురు గాన నిట్టి
కార్యంబులందు విద్వాంసులగు బ్రహ్మరాక్షసు లావరించి, సమ
యంబు వేచియుండుట సాజంబై యుండుఁ గాన నేదియో పొసం
గిన దని చెప్పుచుండ నుపాధ్యాయుం డిట్లనియె. 77

---

*ఈకథ వాల్మీకిరామాయణము ననుసరించి వ్రాయఁబడినది. దేవీభాగవతములో హరిశ్చంద్రుఁ డని భిన్నముగా నున్నది.

మ. పశునష్టం బగునేని దీక్షితున కాపాదించుఁ దద్దోష; మ
య్యశుభం బింతనరాదు; నిల్పఁదగ దీయాగంబు; వేగంబునం
బశువుం దెచ్చి సమీకరింపవలె; సంపాదింపుఁ డెందైన నా
కృశుచిన్, సత్కులజున్, సజీవపితృకుంగాఁ జూచి యెట్లైనియేన్.

వ. మఱియు వాఁడు వినయాదిగుణశోభితుండును, నభినవయావనో
ల్లసితుండును, నస్ఖలితబ్రహ్మచర్యవ్రతుండును, ననవరత వేద
పారరతుండును నై యుండవలయు; నతని తలిదండ్రులు మనసార
సమ్మతించి యర్పింపవలయు; నతండునుం గంటఁ దడివెట్టనివాఁడై
యందుల కియ్యకొనవలయు; మఱియుఁ గాలాతిపాతంబైన నన
ర్థంబు వాటిల్లు ననిన. 79

ఉ. వేలకొలంది గోగణము వెన్వెనుకం జనుదేరఁగా మహీ
పాలుఁడు పత్తనంబులును, బల్లియలున్, వివిధాశ్రమంబులున్
జాల రయంబునం దిరిగి, సంకట మంది, శ్రమంబుఁ జెంది, మై
దూలుచుఁ బోయిపోయి భృగుతుందమునం దొకయాశ్రమంబునన్

—, శునశ్శేపుండు విక్రీతుం డగుట ,—

క. ఇల్లాలు సుతులుఁ గొలువఁగ
నల్లార్మ ద్దొదవఁగా సహాసీనుండై
యుల్లసిత తేజమున విల
సిల్లెడు బ్రహ్మర్షి నల ఋచీకుఁ గాంచెన్. 81

వ. కాంచి యతనిసవిధంబున కరుదెంచి యమ్మునిచరణసరోజంబులు
శిరంబునం గీలించి, కరకమలంబులు ముకుళించి, కుశలం బడిగి
సవినయంబుగా నిట్లనియె. 82

మ. పశునష్టం బయి చిక్కనం బడితి; దేవా! గోసహస్రంబులం
బశుమూల్యంబుగఁ గోరినన్ని గొని నాపైనిం గటాక్షించి స
ర్వశుభోదర్కము గాఁగ నొక్కకొడుకుం బంపింపుఁడీ! మీకు స
ద్యశమబ్బున్, సుకృతంబుఁగల్గుఁ, దనయుండా సద్గతిం జెందెడున్.

వ. అనిన మునీంద్రుం డిట్లనియె. 84

శా. నాకా? జ్యేష్ఠుఁ డటన్నఁ బెద్దయభిమానం; బల్లెవాఁ డెప్పుడున్
నాకుం గూర్చుచునుండు; వాని నిడఁగా నాయాత్మ సైరించునే?
నీకర్మం బిఁక నిర్వీరుంద్రుగద! పోనీ యన్న నమ్మాటకున్
నాకే ధైర్యము చాల; దెవ్వరికి నైనం దీపెగా! ప్రాణముల్.

వ. అనుటయుఁ బదంపడి మునిపత్ని యిట్లనియె. 86

ఉ నాకుఁ గనిష్ఠపుత్రుఁ డనినన్ బడి ప్రాణము లొప్పఁజెప్పుదు;
న్నాకితి నద్దుముద్దుగ; క్షణంబయినన్ విడఁజాల వాని; నిం
తేకద! తండ్రి జ్యేష్ఠునిఁ, గనిష్ఠునిఁ దల్లియుఁ బ్రీతిసేఁత యీ
లోకముపాడిగాదె యెటులున్? మఱి భార్గవు లింతెఱుంగరే?

క. అనుచుండ శునశ్శేఫుం
డను మధ్యముఁ డనియె జ్యేష్ఠుఁ డయ్యకుఁ బ్రియమా,
ననుపమకరుణాపాత్రము
కనిష్ఠుఁ డమ్మకును; నే నొకండ మిగిలితిన్. 88

క. నను విక్రేయునిగాఁ దలఁ
చిన సూచన దోఁచె; నాదుచిత్త మెఱుక లే
కనుమానపడిరి; జననీ
జనకులకుం గానికొడుకు జగతికి బరువా. 89

క. కని పెంచినందులకు నా
కును వారిఋణంబుఁ దీర్చికొనఁ గల్గెను; గా
వున లక్షగోగణము ని
చ్చి ననుం గొనిపొమ్ము; జాగుసేయు టిఁకేలా ? 90

వ. అనుచున్న తనయుని పలుకుల కమ్మునిదంపతులు తూష్ణీం భావంబుఁ జూపుటయు, శునశ్శేఫుండు నరేంద్రా! పితరు లంగీకరించిరి; నీ యదృష్టంబు ఫలించిన; దిఁక నాలస్యం బేల ? యనుటయు రాజేంద్రుండు తత్క్షణంబున లక్షగోగణంబుల మునీంద్రున కొసంగి, శునశ్శేఫుని రథారోహణంబు సేయించుకొని, సకలగుణోపేతుండగు నిమ్మునికుమారుం డెల్లతెలుంగుల యజ్ఞపశుత్వంబున కర్హుండ; యయ్యును నాత్మప్రాణహరణంబునకుం జంకునో యనుశంక నన్ను బాధించుచుండ నతండు తలిదండ్రులపై రోసంబునం దానయై సమ్మతించుటచే నాసందియంబునుం దీఱె నని సంతసింపుచు శీఘ్రగమనంబునం బోవుచుండ మార్గమధ్యంబునం బుష్కరక్షేత్రంబున మాధ్యందినసవనంబు నిర్వర్తించి, యించుక విశ్రమించియుండ మునిసుతుం డాత్మగతంబున నిట్లని వితర్కించె.

క. జననీజనకులపై నీ
సున నిటు దెగఁబడితిఁగాని చూచుచు జీవం
బును బాయ నెట్లు? సమయం
బున మానస మేమొ వెట్టిపోకలు వోవున్. 92

ఉ. ఎంతటి ధైర్యశాలియగునేనియుఁ బ్రాణభయంబుపట్ల గో
రంత చలింపకుండెడి మహాత్ముఁడు పుట్టఁడు; పుట్టఁబోఁడు; నే
నెంత? మదీయధైర్య మది యెంత? వితా కొని తెచ్చుకొంటిఁ బ్రా
ణాంతముఁ; బౌరుషంబునకు నక్కట! మంగలికత్తి ప్రింగితిన్. 93

ఉ. కాలము చేరువై తెలివి గాలి యిటుల్ కడకేఁగు కర్మమున్
గాలఁ దగిల్చికొంటి; మిడుకన్ వలదా? పితృపాదు లెంత నా
పై లఘుబుద్ధిఁ జూపినను బ్రాణము తీపని హెచ్చరించి; రే
బాలిశవృత్తి నిట్లు తెగఁబాఱితి, నూరక చావుఁ గోరితిన్. 94

ఉ. గానుగలోనఁ జే యిడి యిఁకం బెరుమాళ్ళదె భార మన్నఁ గా
దో నగుఁబాటు? రోటఁ దలఁ దూర్చిన రోఁకటిపోటు తప్పునే?
నేను వృథా భ్రమించితి; ననింద్యచరిత్రుఁడు తండ్రి యొక్కమా
టైన వచించెనే? తలఁగునట్టివిధానమె చూపె నేర్పునన్. 95

తే. తెలివి సెడి డబ్బు వెట్టి యాబ్దికముఁ గొన్న
వెడఁగుకంటెను నే నధముఁడనె కానె?
దుడుకుపడి పితరులపైని నడిచిపడుట
కిది ఫలము; నాకుఁ జావు తప్ప దిఁక నిజము. 96

క. నమ్మించి చేవికార్యము
వమ్మొనరింపంగ రాదు; వగఁ గొనకుండన్
సమ్మోదమ్మునఁ దత్కా
ర్యమ్మును సఫలీకరించు టది యెట్లొకో? 97

వ. అని యోజించి యొక్క సదుపాయంబు మనంబునం దట్టి యిట్లని
తలంచె. 98

క. మా మేనమామ యగు వి
శ్వామిత్రుం డిచటఁ దపము సల్పెడు నని వి
న్నా; మఠటికిఁ బోయినచో
నా మహనీయుండు చూపఁడా యొక తెరువున్. 99

చ. అని తదుపాంతికంబునను రయంబునఁ జేరి, పదాంబుజద్వయం
బును శిరమందుఁ జేర్చుచు 'నమో మహనీయతరానుభావపా
వనమృదుభావనాయ! నిరుపాధికృపాభరణాయ! సంశ్రితా
వనచరణాయ! సృష్టిపరిభావితపస్స్ఫురణాయ శ్రీమతే'! 100

ఆ. అనుచుఁ గనుఁగొలంకులను నశ్రు లురలఁగ
గళమునందు నమితగద్గదికయుఁ
దగ స్వనామపూర్వముగ 'అహం భో అభి
వాదయే' యటంచుఁ బలికె నిట్లు. 101

ఆ. తల్లి లేదు నాకుఁ, దండ్రియు లేఁడు, నా
తల్లి దండ్రి గురువు దైవ మీవ;
యాగపశువుగాఁగ నమ్ముఁడువడితి నే
నంబరీషునకు మహానుభావ! 102

క. క్షణభంగుర మగు దేహం
బణుమాత్రము నమ్మఁదగ దటంచు నెఱిఁగియున్
గుణముల మాఱి మన సను
క్షణమును బలువిధములై వికారముఁ జెందున్. 103

ఉ. ప్రాణముకంటెఁ దీపయిన వస్తువు లేదు; శరీర మన్నఁ బా
షాణము గాదు; వేదములు శాస్త్రములున్ వచియించుఁ బ్రాణసం
త్రాణ మఖండపుణ్యఫలదం బని; ప్రాణసమీరణంబు ని
ర్యాణముఁ జెందకుండ నెటు లాగును? కంతల తిత్తిలోపలన్. 104

శా. ఏకాలంబున కైన తాయివలె స్థాయీభూతమై యుండఁగా
నాకాంక్షించెద రెల్ల జీవులు; స్వదేహంబే కదా! దానికే
పోకల్ వచ్చె నయో! తలంపనితలంపుల్ గాఁగ; నే పాపమో!
నా కర్మం బని యూరటం గనఁగఁ బ్రాణం బెట్లు సైరించునో? 105

క. ప్రియ మెచట నతిశయించును
భయ మచటనె యతిశయించు, భగవన్మాయా
మయసృష్టిలోఁ గల చమ
త్క్రియకు భవత్పౌరుషము ప్రతిక్రియ యగుతన్. 106

వ. అని పలుకుచుం దదీయచరణసరసిజద్వయంబును దన కరయుగ
ళంబునం దిరంబుగాఁ బట్టి. 107

క. చరణములా త్రైశంకవ
శరణములా సకలసురవిసారిభయావి
ష్కరణములా స్వర్ద్వైధీ
కరణములా యనుచుఁ దలను గదువడిఁ జేర్చెన్. 108

క. తనకలిమి జగముకలిమియుఁ
దన క్రుంగుట జగముక్రుంగుదల యనుట సహిం
పను; నా మతంబు 'సర్వే
జనా శ్చ సుఖనో భవంతు' సత్య మిది గురూ! 109

క. తలిదండ్రుల కపవాదము
గలుగఁగరా; దంబరీషు కార్యంబున కే
వలితి పడరాదు; నా యసు
వులు సెడరా; దే మొనర్తువో! గురుదేవా! 110

తే. చక్కనినిదర్శనము 'తల్లి చచ్చి మేన
మామ యుండఁగవలె' నను సామెత కిది;
ప్రాణభయమున వచ్చి మీపాలఁ బడితి;
మించినను దేల్చినను మీదెపో భరంబు. 111

తే. అని పదంబుల విడకున్న మునికుమారు
నకు నభయదానము నొసంగి నయముఁ, బ్రియముఁ
దోఁపఁగాఁ జేరఁదీసి, తోడ్తోన పుత్రు
లందఱిని ముందఱికిఁ బిల్చి యనియె నిట్లు. 112

చ. కొడుకులఁ గందు రేఫలముఁ గోరి? కుమారుల జన్మకున్ ఫలం
బిడు నెది? యెట్టిపుత్రుఁడు మహీస్థలి శాశ్వతకీర్తిఁ గాంచు? నె
వ్వఁడు సుతుఁ డౌటకుం దగినవాఁడు? పరీక్ష యొనర్చు ఘట్ట మి
ప్పుడు సను దెంచెఁ దండ్రికినిఁ,బుత్రులకున్;గనుఁగొంటిరే సుతుల్!

శా. విశ్వామిత్రుతనూజులే బళిబళీ వీ రంచు లోకుల్ కడున్
విశ్వాసం బొదవంగఁ బల్కు-పలుకుల్ విన్నప్పుడే కాదొకో?
యాశ్వాసంబు ఘటిల్లు నాకు; సుతులారా! పేరు వోనీకుఁడీ
విశ్వఖ్యాతి లభించుకార్యమునకున్ వెన్కంజ గాఁ బోకుఁడీ!

మ. మునిబాలుండు విపన్నుఁడై పదయుగంబున్ వీడకున్నాఁడు; కా
వున రక్షించితిఁ; బ్రాణదానసుకృతంబుం బోల దేదైన; మీ
రును ధర్మైకపరాయణుల్, సుకృతకర్ముల్; వీనికై తన్మఖం
బున నగ్నిం బశుభూతు లౌచుఁ బరితృప్తుం జేయుఁడీ పుత్రకుల్!

మ. మునిబాలుండు సనాథుఁ డౌను; సవనంబున్ సాగు నిర్విఘ్నమై;
తనియం గల్గుదు రెల్ల దేవతలు; మద్వాక్యంబునుం జెల్లుఁ; గా
వున మీకుం బితృవాక్యపాలనయశంబున్ - బుణ్యమున్, మీకతం
బున మాకుం బరలోకశాశ్వతసుఖంబుం గల్గు; మేలేకదా! 116

క. మీ మేనత్తకొడుకు గద!
యీ మునిసుతుఁ డంబరీషనృపతి విలిచెఁ; బీఁ
డేమో ప్రాణభయంబున
మామా! రక్షింపు మనుచు మాపాలఁ బడెన్. 117

క. నా జీవితమున వృథగాఁ
బోఁజన దభయార్థి; లోపము రవంతైనం
గాఁ జనదు; రాజు మగఁడై
గాజు కడెంబైన వెలితిగాదె? తలంపన్. 11

వ. కావున మీలో నెవండైన నొకం డీశునశ్శేపునకుం బ్రాః
నిధ్యంబువహించి ప్రాణదానంబు సేయుట ముఖ్యకర్తవ్యః
బనిన నప్పలుకుల కులికిపడి హావిష్యందాదులగు నతని తనయ
లందఱు నేకముఖంబుగా నిట్లనిరి. 11:

మ. నినుఁ గాదం చనరాదు గాకిట 'స్వయం తీర్ణః పరాం స్తారయే'
త్తని ధర్మంబు; స్వపుత్రులం బరుల కన్యాయంబుగా నాహుతి
మ్మని యెందుండె? శ్వమాంసభుక్తిబలె హేయంబౌ; నినీ! తన్నుఁ గా
దను ధర్మం బెవరున్ గ్రహింప; రిది మాప్రారబ్ధ మేమోకదా!

తే. ఆ శునశ్శేపుప్రాణంబులట్లు తీప
కాని మాప్రాణములు చేఁదు గావు మాకు;
'ఆత్మవ త్సర్వభూతాని' యను తలంపు
కలదు లే దని నీలోనఁ గానిపించె. 121

తే. అల ఋచీకునిబోలె నీ వంపెదు మము;
నతనిసుతునట్లు మాకుఁ బ్రాణాశ కలదు;
కాని నీలోనఁ గ్రయధనాకాంక్ష లేదు;
పరుల మాఱొడ్డుతలఁపు మాపాల లేదు. 122

వ. 'జీవన్ భద్రాణి పశ్యతి' యను ధర్మం బనుసరించి, నిష్కల్మ
షంబుగా జీవయాత్ర గడుపుదు మనుటయు, నగ్నికల్పుండగు
నగ్గాథేయుండు భగ్గున మండిపడుచు నిటలతటంబున వికటభ్రుకుటి
ఘటిల్లఁ దటిల్లతాపటలచటులంబులై యనలకణంబులు కనుఁ
గవం దనుక మహాగ్రహోదగ్రంబుగా నిట్లనియె. 123

మ. దురహంకారము నెత్తి కెక్కి పితృపాదుల్ కంటికిం గానరా;
రరయం జాలమి మాప్రమాదమె కదా! యడ్డాలకే బిడ్డలా
దురు, గడ్డాలకు బిడ్డలా? బళిర! మాతో నిట్లు మాటొడ్డి కూ
సిరి; మాయాజ్ఞ శ్వమాంసమై పరిణమించెన్ నేఁటికాలానకుఁ.

మ. మతి యెంతో గతి యంత; భావిపరిణామం బిట్టు లాడించె; వీ
రితలన్ వ్రాసెను మూఁడుపంక్తుల విధాతృం; డెట్లుతప్పున్? వసి
ష్ఠతనూజాతులభంగి వత్సరసహస్రంబుం గులభ్రష్టులై
యతినీచప్రకృతిన్ శ్వమాంసనియతాహారంబులం బొల్చుతన్.

మ. అని కోపంబున శాపదావదహనం బాత్మీయగర్భంబునై
నను లెక్కింపక పుత్రులందుఁ బెలుచన్ జాజ్వల్యమానంబుగా
వినియోగించి, తదుద్ధతిం గని భయోద్విగ్నాత్ముఁడైయున్న య
మ్మునిసూనుం దనచెంతకుం దిగిచి, వీపుం దట్టి తా నిట్లనున్. 126

మ. నిను రక్షించెద నంటిఁ; దప్ప దెటులున్; నీ కాయురారోగ్యవ
ర్ధనముం గల్గు; నరేంద్రు యజ్ఞఫలముం బ్రాపించు; నింద్రాదిదే
వనికాయంబును దృప్తిఁ జెందు; నిఁక లోపం బేమి? మ మ్మాశ్రయిం
చినవాఁ డెన్నఁటికిం జెడం; డిదియహో సిద్ధాంత మో బాలకా! 127

క. అని కరమున రక్షాబం
ధన మమరిచి గాధిసుతుఁ డతని కుపదేశం
బొనరిచి గాథాద్వయ, మి
ట్లనె నెయ్యముఁ దియ్యమును దయారస మెసఁగన్. 128

క. నిను నచట రక్తమాల్యా వ
సనము లిడి పవిత్రపాశసంగతుఁగాఁ జే
సినను భయపడకు మే మి
చ్చిన గాథాద్వయముఁ బఠన సేయుము లోలోన్. 129

శా. నీప్రాణంబులు దక్కెఁ, దేవగణముం దృప్తింగనున్; మానవేం
ద్రప్రారీప్సిత యజ్ఞతంత్రమున నిష్ప్రత్యూహ నిర్వాహయో
గ ప్రాశస్త్యమునున్ ఫలం బొదవు; నీకల్యాణగాథల్ – మదీ
యప్రావీణ్యము – శాశ్వతంబుగ జగద్వ్యాప్తంబులౌ బాలకా!

వ. అని పుత్తెంచిన నత్తపసిపట్టి సత్వరంబున నరేంద్రుం జేరి నృపాలా! యిఁక నేల జాలంబు? వేగంబ పైనంబై దీక్షం బూని సాఫల్యంబు నందు మని త్వరసేయ రాజేంద్రుండును నిట్టి యోగ్యుండు నాకుం బశుభూతుం డగుట భాగ్యంబకాదే? యని యుబ్బుచుఁ దత్క్షణంబ యతనిం గొని రథారూఢుండై శీఘ్రయానంబున యాగశాలం జేరి యతని నాచార్యున కొప్పఁజెప్పటయు నయ్యాచార్యుండును ఋత్విక్సహితంబుగ సంతుష్టాంతరంగుండై యప్రతిహతంబుగ సవనంబు సాగింప సదస్యానుమతంబున నంబరీషుండు. 131

తే. ఆ శునశ్శేఫు రక్తమాల్యాంబరాను
లేపనము లిడి వైష్ణవయూపమునఁ బ
విత్రపాశనిబద్ధుఁ గావింపఁ దాఁ జ
లింపక నిలింపవరులఁ గీర్తింపఁ దొడఁగె. 132

వ. ఇట్లు గాధేయోపదిష్టంబైన గాథాద్వయంబును మానసంబున గానంబుసేయుచు సనాతనవాక్యంబులం గీర్తించు శునశ్శేఫునివలన రహస్స్తుతితర్పితులైన యింద్రోపేంద్రు లదృశ్యులై యంతరిక్షంబున నిలిచి యెల్లరు విన నమ్మహీపాలు నుద్దేశించి యిట్లనిరి. 133

శా. నీయజ్ఞంబు సమాప్తిఁ జెందె; సుకృతోన్మేషంబు నీ కెక్కె; దీ
ర్ఘాయుష్మంతు నొనర్చినారము మునీంద్రాపత్యమున్; మాకు నెం
తో యానందముఁ గూర్చె నీతని రహస్స్తోత్రంబు; గాధేయుఁ డా
ధేయంబుం జెడనీయఁ డెన్నఁటికి సాధీయస్తరాధారమై. 134

చ. అని వచియింప నద్భుతము నందుచు సర్వజనుల్ బలేబుచీ
కునికొమరుండు కౌశికునకున్ దయగల్గఁగ నాశ్రయించి చ
క్కనిసదుపాయమున్ వెదకెఁ గాన భయంబును జెందఁడయ్యె; నె
వ్వనికిని హానిలేదిట; నుపాయము గల్గ నపాయ మున్నదే? 135

ఉ. ఆ మహనీయు ప్రాపుఁ గనినట్టిజనున్ గను విచ్చి చూడ స
ర్వామరకోటికైనఁ దరమా? పరమేశకిరీటకోటిభూ
షామిహిరాంశురేఖకుఁ బొసంగునె రాహుముఖోపరాగముల్?
ప్రామునె మేఘసంవృతి? చొరంబడునే క్షయవృద్ధిభేదముల్?

మ. తనకుం గించిదవజ్ఞ సల్పినను బాతాళంబు నంటంగఁ ద్రో
క్కినదాఁకన్ విడువండు పుత్రునయినం; గేలొడ్డినన్ బ్రాణమి
చ్చు నెవండైనఁ;బరుండు స్వీయుఁ డనియుం జూడండు గాధేయుఁ;డా
యన పేరున్ విని నంతమాత్రమున సింహస్వప్న మెవ్వారికేన్.

తే. అనుచు నవనం బది సమాప్తమైన నెల్ల
వారు నిజనివాసంబులఁ జేరుకొనిరి;
యమరగణము యథేచ్ఛగా నరిగె; నంబ
రీషుఁడు సుఖంబుగాఁ గృతకృత్యుఁ డయ్యె. 138

—. ఆశ్వాసాంతము .—

మ. జనకాజ్ఞాపరిపాలనానుపమదీక్షాపారతంత్ర్యాగ్రపూ
జనభాజీ! శరణాగతారిజనరక్షాదీక్షితా! దుష్టదై
త్యనిరాసాప్రతిమప్రతాపభుజశౌండా! సర్వలోకప్రమ
ర్దన దుర్దాంత దశాననప్రమథనోద్యద్భూరిసారోజ్జ్వలా! 139

ద్రుతవిలంబితము :- నిరుపమాన వినిర్మల సద్యశ
స్సరణకైతవచాంద్రమసీస్పృహా
తురచకోరవధూరసనాజడీ
కరణకారణ! కారణకారణా! 140

క. నీరేజబంధువంశమ
ణీ! రామాజనకటాక్షనీరాజితవి
స్మేరముఖ! యేకపత్నీ
పారమ్యవ్రతపరా! శుభగుణప్రకరా! 141

## గద్యము

ఇది శ్రీరామచంద్ర కరుణావిభవ కవితానుభవ
శివార్యతనూభవ సుధీజనవిధేయ సుబ్ర
హ్మణ్యానామధేయ ప్రణీతంబైన
బ్రహ్మతేజోబలంబునందుఁ
దృతీయాశ్వాసము.

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః.

# బ్రహ్మతేజోబలము

లేక

# విశ్వామిత్ర చరిత్రము

## చతుర్థాశ్వాసము

శ్రీమత్కరుణార్ద్రకటా
క్షామృతకల్లోలమాలికాప్లావిత సు
త్రామాదివినుతసుగుణ
స్తోమా! రఘువంశజలధిసోమా! రామా! 1

వ. దేవా! యవధరింపుము. 2

తే. ఆవిధంబున గాధివంశావతంస
మల ఋచీకుతనూజు దీర్ఘాయు వగుచుఁ
దనరఁగాఁ జేసి పుష్కరంబుల మహోగ్ర
తపముఁ గావింప నెంచి విద్యలఁ దలంచి.* 3

కం. ఉద్యత్తపోబలమున మ
హోద్యముఁడై గాధిసూతి యూర్జితశక్తిన్
విద్యల నాకర్షించెను
సద్యఃఫలసిద్ధిఁ గోరి సాహస మొదవన్. 4

—త్రైశంకవోపాఖ్యానము.—

వ. ఇట్లు హఠాదాకృష్యమాణలై యవ్విద్యామతల్లులు గొల్లు మని యాక్రోశింప నయ్యాక్రందనరవం బరణ్యభూభాగం బంతయు

* ఈ కథ మార్కండేయ పురాణము ననుసరించి వ్రాయఁబడినది. వాడుకలో ఱుగా మున్నది.

నిండె; నంత మేఘగంభీరభీషణంబులగు భాషణంబులతో నొక్క
పురుషకంఠధ్వని యిట్లని వినంబడియె. 5

చ. ఎవఁడవురా? దయారసవిహీనమతీ! యబలాజనంబుపైఁ
గవిసి మదోద్ధురుండ వయి కాఱియఁబెట్టెద? విట్టి నిర్జనా
టవి; నకటా! నినుం బొగ రడంచెడివా రెవ రుండ రంచు నెం
చ వలవ దింక? నీ కిదిగో చావు సమీపమ య్యె నిల్వుమా. 6

వ. అను పలుకు వినంబడుటయు దండతాడిత భుజంగంబుచందంబున
మండిపడుచు నజ్జటాలుండు పటపటం బండ్లు గీటుచు నిటాలంబు
జేవురింపం గటంబు లదరం బెద్దయెలుంగున నిట్లనియె. 7

శా. నన్నాక్షేపణ సేయువానిని జగానం గాన; నెవ్వండ వీ?
వన్నాళీకభవాది దివ్యులకె సింహస్వప్న మా నాదుపే
రన్నన్; గ్రీష్మరవిస్ఫురత్కిరణసాహస్రప్రభారాశిలోఁ
జెన్నైన్న మిణ్గురుఁబు ర్వహో! మిణకరించెం గర్వదుర్వారమై. 8

వ. అని ద్రుతగతిమై ముందునకు నడచె; నంత. 9

మ. అభయం బిచ్చితి నోడకుండుఁ డని యుద్యన్మేఘగర్జార్భటీ
రభసోద్ఘుష్ట ధనుర్నినాద మతిఘోరంబై, భయోద్వేగసం
క్షుభితంబై, మృగరాజి పర్విడ రయస్ఫూర్తిన్ హరిశ్చంద్రభూ
విభుఁ డేతెంచె రథాశ్వశాతఖురనిర్భిన్నావనీభాగుఁడై. 10

వ. మఱియు నద్ధరాభృచ్ఛిరోమణికి శ్రవణగోచరం బగుచున్న యా
యార్యాక్రందనధ్వని యొక్కటియ తక్క నం దెవ్వరుం గానరామి
దెసలు పరికించుచుండ. 11

శా. అక్షయ్యప్రతిభోన్నతిన్ సకలవిద్యాకృష్టిఁ జేయన్ దదీ
యక్షోభంబున నార్చ లే పడరె; విద్యాసక్తి దోసంబె? న
న్నాక్షేపింతువె? యంచుఁ దోఁచె భయదవ్యాఘోష; మాలోనఁ బ్ర
త్యక్షం బయ్యెఁ గుశాన్వయోద్భవుఁడనిద్రాచ్ఛిద్రరౌద్రాకృతిన్.

క. ఉట్టిపడి పిట్టపిడుగునఁ
గట్టల్కయ రూపుఁగొన్నకైవడి నటఁ గ
న్పట్టు తపసిదిట్ట గుఱుతుఁ
బట్టినవాఁ డగుట గుండె బ్రగ్గున వ్రీలన్. 13

వ. అట్లు కొంతవడి బ్రమాన్పడి యమిత భయ భక్తి వినయంబులు డెందంబున సందడింపఁ దొందరపాటున వరదంబు డిగ్గ నురికి పరుగుపరుగునం బోయి తదీయచరణ సరసిజయుగళంబు నిజఫాల ఫలకంబునం గీలించి యిట్లనియె దేవా! మృగయా నిమిత్తం బరుదేర. 14

చ. అవిదిత కారణంబు లయినట్టి వధూజనరోదనధ్వనుల్
చెవిఁ బడినంతనే మనసు చిందరవందరమై యెదేదియో
తివిరి వచించితిన్; దయ మదిం దళుకొత్త క్షమింపవే ముని
ప్రవర! భవత్పదంబులు శుభప్రతిపాదకముల్ గదా! గురూ! 15

ఉ. అక్కట! యెవ్వఁడో యిటు మహాటవిలో నబలాజనంబులం
జిక్కుల బెట్టుచుండె నని చెచ్చెర నేనభయం బొసంగితిన్;
నిక్కవ మింత; నన్నుఁ గరుణింపుఁడు నా యభయప్రదానమున్
తక్కక యుండునట్లభయదానము సేయుఁడు, పాయుఁడుగ్రతన్.

తే. అని పదంబులు మోమున నద్ది లేవ
కున్న రాజేంద్రుఁ గని కోప ముడిగి మెత్త
వాటును, నిజోద్యమము వెన్కఁబడుట కోర్వ
నట్టి యుదుటునుఁ దోఁప ని ట్లనియె నతఁడు. 17

మ. ఇట నే నేయబలాజనంబులను హింసింపం గదా? యింక సం
కట మేలా? యభయం బొసంగి తని మత్కార్యంబునన్ భంగమున్
ఘటియింపం దలకొంట యొక్కటియె తక్కన్ వేఱుగాన్పింప; దె
న్నఁటికిన్ గాధిసుతుండు పూనిన ప్రయత్నం బాఁగరా దింతకున్.

వ. అనిన మునితల్లజునకుం జనవల్లభుండు ముకుళితకరపల్లవుండై
మెల్లన నిట్లనియె. 19

సీ. ఆర్తనాదము విన్నయంతనే ప్రాణంబు
లొడ్డియైనఁ దదార్తి నడ్డు టొకటి
యర్థపాత్రంబైన యర్థి కోరిన రాజ్య
మేనియు వెనుదీయ కిచ్చు టొకటి
యాడినమాట బ్రహ్మదు లేతెంచినఁ
దప్పక నెఱవేర్చు తత్త్వ మొకటి
పరకాంత లన మాతృభావంబుఁ ద్రికరణ
శుద్ధిమై నెలకొల్పు బుద్ధి యొకటి

తే. బ్రాహ్మణులయెడ భక్తిప్రపత్తు లుంచు
టొకటి, ధర్మంబుఁ బాయమి యొకటి – నాకు
నుగ్గుతోఁ బెట్టిన వ్రతంబు లో మహాత్మ!
నా యభయదాన మెట్లు మాననగుఁ జెపుఁడ. 20

వ. అనిన నరేంద్రునకు మునీంద్రుఁ డిట్లనియె. 21

ఉ. నాదు ప్రయత్న మాఁగు టనినం దిననాథప్రయాణ మాఁగుటే
పో; దయతోఁ ద్రిశంకు నృపపుత్రుఁడ వంచు వచించుచుంటి; నీ
కీదఁగరాని వాహిని సుమీ! యిపు డాడినదీక్ష; మాటలం
గాదది యాచరించు టనఁగా నెనలేని ప్రశాంతి గావలెన్. 22

తే. అనవుడు నరేంద్రుఁ డనియె మహాత్మ! తావ
కోద్యమము నాఁగఁ గైతవం బూని పల్కు-
టని తలంపకుఁ; డస్మదన్వయము, సంప్ర
దాయమును మీ రెఱుంగరే? ధర్మహృదయ! 23

మ. రవివంశం బభయార్థిఁ గా దనదు; సామ్రాజ్యంబు సర్వంబునై
న, వధూరత్నమునైనఁ, గూర్మిసుతునైనం బాయు; నెంతెంత నీ
చవిధానంబులకైన నోర్చుఁ, దుదిఁ బంచప్రాణముల్ వోని భా
ర్యవధం జేయుట కోర్చుఁగాని విడ దార్యా! సత్యధర్మంబులన్. 24

వ. అనిన నచ్చెరువంది, యౌరా! యితని మనోనిశ్చయం బింత
యొప్పునే? యేది యెట్లున్న నితండు తన యభయదాననిమిత్తం
బుడాన నన్నభయం బర్థించెఁ గాన నా యుద్యమం బెట్లును విర
మింపక తప్ప; దైననుఁ గొంత పరీక్షింపవలయు నని యెంచి,
యాకారగోపనపైపుణ్యంబు మెఱయ నిట్లనియె. 25

శా. మా కేమంత కఠోరదీక్ష లయినం బన్నించి నిన్నట్టె చీ
కాకొందింపఁగ? ముఖ్యమీ వభయకాంక్షన్ మమ్ముఁ బ్రార్థించి; త
ప్పే కాని; మ్మిపు డేమి మున్గినది? మేలే; నీ వుదారుండ; వే
మా? కార్యార్థుల; మప్రయత్నఫలమాహా! మాకు నీరాకయున్.

మ. ఒకజన్మంబును జేయఁబూనితిమి; ద్రవ్యోపార్జనం జేయుదా
నికి నర్హుం డగుదాత కన్పడమి నెంతే చింతిలన్, నిన్ను దా
నికిఁగా దైవమ తెచ్చె; నిచ్చగలదేని న్సాయమున్ జేయు మీ
విఁక; ద్రవ్యం బిట నెంత గావలయు నంతే చాలు వేయేటికిన్? 27

వ. అనిన నమ్మేదినీకాంతుం డంతరంగంబున సంతసించి. 28

ఉ. గండము దప్పె నెట్టటులో; గాధిసుతుండు ప్రచండుఁ; డల్ల యా
ఖండలముఖ్యులే యటు కకావికలైరఁట; యిమ్మహోగ్రకో

పుండు ప్రశాంతుఁ డౌ టదియ పుణ్యము; నాయభయంబు సెల్లె;ధ
న్యుండ; నవంధ్యజీవి నని యూర్జితసంభ్రమ మొప్ప నిట్లనున్. 29

ఉ. ఇచ్చెదఁ; బాత్రభూతులగు నీదృగనన్యతపఃప్రభావదీ
వ్యచ్చరితుల్ లభించుటయ భాగ్యము మాకుఁ; ద్రిలోకరాజ్యమే
నిచ్చుట కర్హ; మీయలుప మే మని యిత్తు నెవండ నేను మీ
కిచ్చుట ? కీకుటుంబము - మహీవలయంబును - మీవె కావొకో ?

వ. అనిన నరేంద్రునకు మునీంద్రుం డిట్లనియె. 31

ఉ. ఇచ్చెద నన్న నొల్ల ననఁ డెంతటిమూర్ఖుఁడు నేని; కోరిన
ట్లిచ్చెడివార లుండ రనియే యనుమానముగాని నీవ యై
యిచ్చెద నన్నఁ జేఁదె? వినమే 'ధనమూల మిదం జగత్తు' నా;
నిచ్చినచో గ్రహింపమె యహీనమహీవలయంబు సర్వమున్. 32

వ. నీ సతీసుతులు, నీవునుం దక్కఁ దక్కిన యఖండమహీవలయ
సామ్రాజ్యం బంతయు మా యధీనంబు సేయు మనిన నణుమాత్రం
బేనియుం గుదివడని హృదయంబును, నుదాత్తభావంబునుం
బొదలనయ్యుదారగుణభూషణుం డిట్లనియె. 33

మ. ఇదె బ్రహ్మార్పణ మంటి; ధన్యుఁడను స్వామీ! నాదుసర్వస్వముం
బదిలంబౌ మదితో నొసంగితిని; దేవబ్రాహ్మణక్షేత్రసం
పద వోఁ దక్కిన వేలుకొందు; సకలక్ష్మామండలాఖండల
త్వదశన్ దాల్చి సముద్రవేష్టితమహోద్యత్సామ్రాజ్యసామ్రాజ్యమున్.

వ. అనిన విశ్వామిత్రుండు బళిబళీ! రాజా! లెస్సమాటఁ బల్కితివి;
నీయట్టివదాన్యుండు లేఁడు; సంతసంబయ్యె; నైన నొక్కమాట
దెల్పుచుంటి; నన్యథా భావింపకుము. 35

మ. ఇఁక మీ రిచ్చటినుండియే వెడలుఁ డెందే; మీ కిటం జిల్లిగ
వ్వకు లే దాస్పద; మాలుబిడ్డ లెటు నీపార్శ్వంబునం దుండి; రే
టికి మీ రింక నయోధ్య? కీ వాసఁగ నేఁడే సర్వరాజ్యంబు మా
మకహస్తార్పిత మయ్యె; నిల్వఁదగ దేమాత్రంబు మీ రిచ్చటన్.

చ. అనవుడుఁ జిత్త మట్లె యగు నంచు సదారసుతంబుగాఁగ న
మ్మునిచరణద్వయంబునకు మ్రొక్కి చనన్, బతివెంట నట్లు చి
న్నినిసుఁగుఁ జంక నెత్తికొని నిర్మలయై చనుచున్న రాజ్ఞిఁ గ
న్గొనుపరివార మంతయును గొల్లున నేడ్చిరి యెక్కువెట్టునన్. 37

వ. ఇట్లరుగుచున్న యన్నరనాథశిరోమణిం గాంచి మునివరేణ్యుండు మనంబున నేదియో చింతించి పెద్దయెలుంగునం జనాధిపా! యిటు ర మ్మని చీరుటయు, నందుఁ జేరియున్న యారణ్యక జనంబులునుం, దదీయపరిజనంబులును నాహా! యేపుణ్యావిశేషంబుననో యిమ్మునీంద్రుం డఖిలరాజ్యం బపహరించియు మరలం బశ్చాత్తప్తుం డయ్యెఁ గాఁబోలు నాయన ననుగ్రహింపం దలంచియే వెనుకకుం జీరె నని గుసగుసలు వోవుచుండ నప్పుణ్యదంపతులు పిఱిందికిం దిరిగి వచ్చి నమస్కరించి యేమిసెల వను టయు నత్తపోధనుండు. 38

తే. అడుగ మఱచితి, ముందు యజ్ఞార్థ మడిగి
నట్టి యర్థంబు నిచ్చెద నంటివి; వది యొ
సంగితివె? చెప్పుమా! నీవు సత్యసంధుఁ
డగుట నడుగంగవలసె; నెట్లైన సరియె. 39

తే. నావుడు యథార్థ మపుడు జన్న మని యడిగి
నది; యిడెద నంటిఁ గాని, యీ యల్పధన మొ
సంగు టెట్లన నెల్లరాజ్యం బొసంగు
మంటివి; రిచ్చితి; నిఁకఁ దృణమైనఁ గలదె! 40

వ. అనిన నజ్జడదారి యిట్లనియె. 41

మ. అపు డేమంటివి? జ్ఞప్తి లేదె? ద్విజదేవాదాయముల్ మాని య
ద్ధిపరీతాఖిలమేదినీవలయమున్ బ్రీతిం గొనుం డంటి; వీ
వపుడైనన్ సవనార్థ మిచ్చినది వో నందున్న శేషం బట
న్న పృథగ్వాక్య ముదాహరించితివె? యన్నా! సత్యధర్మాకృతీ!

వ. అమ్మాట కమ్మహీకాంతుండు నెమ్మనమ్మునం గొంతవడిఁ
జింతించి, పొలివోని ధైర్యంబున నిట్లనియె. 43

మ. ఒకమాసంబునఁ దెచ్చియిత్తు; గడు విం డో దేవ! మీసొమ్ము నీ
యకపో నంతటిమూర్ఖచిత్తుఁడనె? ద్రవ్యం బంతయుం జెంత లే
మికిఁ గా నిట్లు వచింపఁగావలసె; స్వామీ! మీధనం బిత్తు మూఁ
టికి ముమ్మాటికి; మాటదప్ప నని పట్టెం దత్పదద్వంద్వమున్. 44

వ. అంత నత్తపస్వి చిత్తంబునం గొంత మెత్తవాటు దోఁప వటిం
చుచు, నోయీ! సర్వధనంబు నస్మదాయత్తంబుఁ జేసి యెత్తువడిన
పశువుచందంబున నొత్తిగిలంబడిన నీ వే మిత్తు? వే మేమి
గైకొందు? మెత్తెఱుంగక యుత్తలపాటుఁ జెందు నిన్నుఁ గన్న
మాచిత్తంబే మెత్తవడియె; నొక్కమాటతో నీ చిక్కులన్నియుం
దీఱు; నావలం గక్కుఱితిఁ దక్కి యెక్కడనైనం బోవచ్చు
ననిన, నయ్యుదాత్తక్షత్రియవంశసంభవుండు. 45

మ. అనృతం బాడఁ జరాచరాళి తలక్రిందైనం; ద్రయీధర్మముల్
వినిపాతం బయినన్, ససాగరధరోర్వీచక్ర ముత్పాతఁ లూఁ
గినఁ, జంద్రార్కమరుత్ప్రచారములు నింగిం బాసినం గొంతుకోఁ
వినిఁ బ్రాణంబులు గల్గ నానుడులకున్ భేదంబు రా దెన్నఁడున్.

వ. అనిన గాధినందనుండు. 47

మ. ఒకమాసంబును మించి యొక్కనిముసం బోర్వంజుమీ! క స్తి యే
టికిఁ? బోని మ్మనుకొంటి నేఁటి; కపు డిట్లే మాట బొంకయ్యెనా?
యిఁక నీదుర్గతి దేవుఁడే యెఱుఁగుఁ; బొమ్మీ; చెప్పుచున్నాఁడ; ని
ష్ఠాక యర్ధక్షణ ముండరా దిచట మీ; రూరేఁగుఁ డెం దేనియున్.

వ. అనినం జి త్తంబని సతీసుతయుతంబుగా నరణ్యంబులం దిరిగి తిరిగి
క్రమంబునం గాశికానగరంబున కరుగుటయు నంతలో గడువు
నిండిన విశ్వామిత్రుండు ప్రత్యక్షంబై. 49

చ. నెల యగునంత కిత్తు నను నీపలు కేమయిపోయె? నావుడున్
లలన సపుత్రకంబుగఁ గలంగక విప్రున కమ్మి యిచ్చె; నీ
యలతిధనంబు జన్మమున కారయ నాఱవపాలుఁబోల; దీ
వలసినసొమ్ము నిచ్చెదవ? వాద మిఁ కేటికి? లే దటందువా? 50

మ. అన న న్నెవ్వరికైన నమ్మికొని నా కానృణ్యముం గూర్పఁ డం
చనఁ; జండాలున కమ్మి సొమ్ముఁ గొని యత్యాచార మేపార న
మ్మునిఁ యేఁ గెన్; నృపుఁ గాటికాపరితనంబున్ జేయశాసించె వాఁ;
డనివార్యం బవురా? పురాకృతఫలం బాబ్రహ్మకీటంబుగన్. 51

సీ. చతురబ్ధిసంవృతక్ష్మామండలీసార్వ
భౌముని గాటికాపరి నొనర్చె
సకలరాజన్యమాళికృతాభివందను
నాలుబిడ్డల నమ్మఁ బాలుపఱచె
ననుపమభోగభాగ్యములఁ దోఁగిన భోగిఁ
గటికిదారిద్ర్యంపు గతికిఁ దార్చెఁ
జక్రవ ర్తియశఃప్రశ స్తికిఁ బ్రథమగ
ణ్యుని నీచజనదాస్యమునకుఁ బూన్చె

తే. నక్కటా! కాలమహిమ యే మనఁగవచ్చు?
దారపుత్రకు లొకచోటఁ, దా నొకయెడ
నొకరిగతి యొక్క రెఱుఁగమి నుమ్మలించి
క్రుంగి కృశియించి లోలోనఁ గ్రుళ్ళు నతఁడు. 52

వ. ఇక్కరణిం బెక్కురీతుల యాతనలం బడుచు నొక్కదినంబు
తక్కువగా వర్షత్రయంబు కడచనుటయు; నక్కడపటినాఁటి
రాత్రియందు. 53

సీ. చితిఁ గాలు మృతదేహతతిఁ బెల్లు మటంచుఁ
బగులుపున్కలు, గాలి కెగయు బూది,
యురగాలి చల్లారి యల గంగలోఁ ద్రోయఁ
బడుశవంబులు, పూడ్పఁబడు శరీర
ములఁ బీకి తినెడు జంబుకసమూహము, శవ
ఖాదనవ్యగ్రరక్షఃపిశాచ
గణమునై బీభత్సకరముగా నెటుఁ గన్నఁ
గనుఁజూపు మేఱయా కాటిలోనఁ

తే. తిరిగి తిరిగి యలసి నిజదేహ మెల్లఁ
గాటిబూడిద దోఁగ నొక్కయెడ నొక్క
పునుక యుపధానముగఁ జేసికొని పరుండె
మృతకళేబరములమధ్యఁ గుతిలపడుచు. 54

వ. ఇత్తెఱంగున నొత్తిగిలంబడి తనకుఁ గలిగిన దశావిపరిణామంబు
నకుం జిత్తం బడలఁ బెద్దయుం బ్రొద్దు చింతించి, యొక్కనిము
సంబు కన్నుగూర్కి, దిగ్గున లేచి యక్కటా! మాలోహితుం
గూర్చి యెంతపాటి కలఁగంటి నని కనులు దెఱచినంత నొక్క
యార్తనాదంబు చెవింబడిన నెవ్వరో శవదహనంబున కేతెంచి
రని పోయి చూచుటయు, నందుఁ గుసుమసుకుమారంబును,

సహజలక్ష్మీవిలాసంబును నై విగతజీవంబైన యొక్క బాలకశే
బరంబును నిందందుఁ జిదుగు లేర్చి పేర్చిన చితిపైఁ జేర్పఁబోయి,
చేతులాడక వక్షశ్శిరంబులు మోదుకొనుచు నాశవంబుపైఁ బడి
భోరున నేడ్చుచు, శోకం బాకారంబు ధరించిన ట్లున్న యొక్క
పురంధ్రీరత్నంబుం గాంచి— 55

తే. ఎవ రిచట? కాటి సుంకంబు నీక శవద
హన మొనర్చెద? రన నామె యయ్యా వేద
రాల, గురునాజ్ఞ సమిధల కడవి కేఁగఁ
బాము గఱచి గతించె నాపట్టి వీఁడు. 56

మ. ఒకభూదేవునియింట దాసినయి యెట్లో కాలముం ద్రోయ న
న్నకటా! యోర్వక పోయె దైవ; మిటు లన్యాయంబు వాటిల్లె; నా
కొకఁడే పుత్రకుఁ డుప్పుగల్లువలె; నెట్లో పూని చేసేత వీ
నికి సంస్కారము సేయ సుంక మవినన్ నే నెందుఁ దేఁగల్గుదున్?

వ. ప్రొద్దుండగనే యిక్కార్యంబు నెఱవేర్చుకొనుటకు నాయజమాను
రాలి యనుమతి లేమిం జేసి నాకృత్యంబులన్నియుం దీర్చి, వారల
నిద్రవుచ్చి గురుశిష్యు లెఱింగించిన జాడవట్టి పోయి వెదకి వెదకి
యడవిం బడియున్న కొడుకుం దీసికొనివచ్చితి; నేఁ బరాధీనఁ
గదా! సత్వరంబుగఁ బోవలయు, న న్ననుగ్రహింపు మని యతి
కరుణంబుగాఁ దెలుపు నన్నెలంత పలుకులకుం గలంతవడి
యక్కటా! మా లోహితుండు కాఁడుగదా! యనుకొని
యమ్మానవతితో నిట్లనియె. 58

క. నీనాథుఁ డెం దరిగె? నీ
వీ నిశిప్రొద్దున నొకర్తె వెవరిఁ బలుకుఁ దో
డైనఁ గొనక చేసేతుల
నీ నిసువుం దేఱ నేమి హేతువు? సెపుమా. 59

వ. అని యడిగిన నయ్యంగనయుం బొంగిపొరలి యుబికి వేల వతిక్ర
మించు దుఃఖంబున వెక్కి వెక్కి యేడ్చుచు నిట్లనియె. 60

మ. అతి దైన్యస్థితి నున్న నాచరిత మేలా యిప్డు? దౌర్భాగ్యదే
వతకుం బుట్టిన యిల్లటం చెఱుఁగు మీ పాపాత్మురాలిన్; మహో
న్నత సౌభాగ్యసుఖంబులం గనినయింటన్ నేఁటి కిట్లై పురా
కృతకర్మంబునఁ జెట్టుకొక్కరయినా; మేమయ్యెనో నాథుఁడున్.

వ. అనిన నన్నరవరాగ్రణి యొక్క నిట్టూర్పు వుచ్చి నిజాంతర్గతం
బున నిట్లని చింతించె. 62

మ. మది నూహించుకొలంది నొక్కమొగి హృన్మర్మంబులం జీల్చుచు
న్నది చింతామయమౌ నుదంత మిది; యన్నా! యిప్పుడే స్వప్నమై
నదిమాలోహితుఁగూర్చి; యీమెనుడులున్ గంఠంబుమాధుర్యసం
పదమాచంద్రమతిన్ స్ఫృహించు;నకటా! పాపంబు శాంతించుతన్.

వ. అని తలంచి వెండియు నామె కిట్లనియె. 64

శా. సుంకం బీయక కాల్పరా దిచట; నిన్ జూడంగ నాచిత్తమం
దంకూరించె దయారసం; బయిన దాస్యం బందు స్వాతంత్ర్య మే
వంకంగల్గును? నేను నీవలెనె నిర్భాగ్యుండనే; యిచ్చుటం
బింకం బే? లనిచూచిచూడమియు స్వామిద్రోహమేయయ్యెడున్.

మ. ఇది నాకున్ విధి; బీదసాదలను వేధింపంగఁ బుట్టించినాఁ
డదయుండై విధి నన్నుఁ; దప్ప దెది యెట్లాఁగాక; నీ కంఠమం
దదిగో శాలరవిప్రభల్ దొనఁక మాద్యద్రీతి శోభిల్లుచు
న్నది మాంగల్యము; దానినమ్మికొనియైనన్ సుంక మీయందగున్.

మ. అనినం గుండెలు జల్లుమం చనియె; నత్యంతంబుఁ గంపించె మే
నును; వైవర్ణ్యముదోఁచె మోముపయిఁ, గన్నుందోయినశ్రూద్గమం
బనివార్యంబయి చిత్రపుంబ్రతిమయ ట్లై కొంతసే పామె వె
చ్చన నిట్టూర్చుచు హా మనోహర! హరిశ్చంద్రావనీవల్లభా! 67

మ. అనుచుం బోరున నేడ్చుచుంగదిసెఁ దా నాలింగితుం జేయ; నా
యనయున్ వెన్కకుఁ దగ్గుటం దెలిసి దేవా! నాదుమాంగల్యముం
గనలే రెవ్వరు భర్తయొక్కరుఁడె తక్కన్; నిక్కమిమ్మాట; యి
ట్లని నా కీవరమున్ వసిష్ఠముని యీఁడా? మున్ను ప్రాణేశ్వరా!

వ. అక్కతంబునం గాదె? మిమ్ము గుర్తింపఁ గల్గితి ననుటయు, నయ్యిలాతలాధిపతి హా! ప్రాణేశ్వరీ! యని యామెం గౌఁగిటం జేర్చె; నిట్లు పరస్పరాలింగితులై మైమఱచి కొంతవడికిఁ దనంతఁ దాఁ దెలిసి హరిశ్చంద్రుండు మృతుండైన కొడుకుపయిఁ బడి. 69

మ. ఎదిరో? వాక్కుల కందరానిదియు, నూహింపంగ శక్యంబుగా
నిది కొండొక్క యవస్థ నన్నలమె తండ్రీ! యింతసే పేమి దోఁ
ప దిసీ! యెచ్చట దాపురించెనొకొ? నీపాలింటఁ గాలాహిలీ
ల దురంతంబగు మిత్తి, మేమిటుల నేలంబట్టి యల్లాడఁగన్. 70

మ. అనుచుం బోరుననేడ్చె మోముపయి మో మానించి, హాహా చతు
ర్వనధిప్రావృత సర్వభూవలయ సామ్రాజ్యంబుఁ బాలించినా
తని గర్భంబునఁ బుట్టి నోచికొనలేదా? కూటికిం గాటికై
న నటం చక్రశువు లేకధార యగుచుండన్ గంటికిన్ మంటికిన్. 71

వ. అంతం గొంతవడికి సహజధైర్యస్థైర్యగాంభీర్యస్వభావుండు గావున నయ్యుత్తమాన్వయసంభవుం డంత కంతకు నుల్లంబునం బెల్లగిల్లు శోకంపుఁ బెల్లుం దనకుఁదాన యుపశమించుకొని నిజవధూటిం గని.

మ. ఇఁక నీ జీవిత మెల్ల శూన్యమయిపోయెన్; లేక లే కొక్క పు
త్రకుఁడై యీగతిఁ దెల్లవాఱెఁ దదుదంతం; బేరి కెవ్వారు! కా
టికి దాపైతిమి; బూటకంపుమెయి బోఁటీ! నీటిపై బుగ్గ; యిం
తకు సంస్కారము సేయు మేది యెటు లున్నం గన్న దోసానకున్.

వ. కావున సత్వరము చని నీ యజమానురాలి నడిగి సుంకంబునకుఁగా నొక్కరూకయు, నొకపాఁతయుం - బాఁత లేకున్న మానె నయ్యది నా కిడునదియ కాన రూక నెట్లైనం దేకున్నఁ దప్పు; దండాఁక నే నీ శవంబుం గాచియుండుఁ బొమ్మన నామె యట్ల చనుచుండఁ, గాశీకాపుర ప్రభుకుమారుఁ బంచాబ్దంబులవానిం జంపి, తదీయాభరణంబులం గొని, రాజభటులచేఁ దఱుమఁబడి పరుగిడి వచ్చు చోరు లా భూషణంబు లా చంద్రమతి యొడిలోన వైచి పరుగిడుటయు, భటవర్గం బామెం బట్టి రాజున కప్పగించి; తదాజ్ఞం గొని యామెకు శిరశ్ఛేదంబు సేయు మని వీరబాహునివశంబుఁ జేయుటయు, వాఁడు నిజదాసుం డయిన వీరదాస నామాంకితుం డగు హరిశ్చంద్రున కాజ్ఞాపించె; నంత నప్పతివ్రతాతిలకంబు పతింగాంచి.

శా. నాపుణ్యంబున భర్తచేత మృతిఁ బొందంగల్గె; మీపాద సే
వాపారమ్యముఁ గన్న పుణ్యఫల మో ప్రాణేశ! నా కిద్ది; మీ
కాపాదింపదు దీన స్త్రీవధకృతంబౌ పాపమున్; మీ విధిన్
లోపం బుండదు; నాదు జన్మ కిది చాలున్ మేలు వేభంగులన్. 75

వ. అన నతం డెట్టకేలకు హృదయంబుం బదిలంబుఁ గావించి యుద్యుక్తుండై చేతులాడక. 76

మ. భయముం జెందెద వోసి దక్షిణకరంబా! నీ కిదే వృత్తి ని
ర్ణయముం జేసి సృజించె ధాత; గుణగణ్యాన్ సాధ్వి నర్ధాంగి, న
న్వయసంవర్ధనుఁ బుత్రు నమ్మికొను చండాలాంఘ్రిసేవా పర
త్వాయు దుర్వృత్తకఠోరజన్మునకు గాత్రం బైతి; జం కేటికే? 77

78
వ. అని పల్కి ఖడ్గంబును గాంచి.

మ. ఇఁక ముం దెందఱిఁ జంపఁగావలయునో? యీశీతి; నాస్వామి యా
జ్ఞకు భంగంబుగ నేఁ జరింపఁగలనే? నాచేతిలో నున్న నీ
కకటా! తప్పునె యిట్టి కట్టిడితనం? బర్ధాంగినిం జీల్చుపూ
న్కికి నాకే మొగమోట లేనపు డిసీ! నీ కేటికో ఖడ్గమా! 79

80
వ. అని యెట్టకేలకు మనసు ఱాయిచేసికొని.

శా. సారించెన్ స్వకరాసి; నాఁగుము హరిశ్చంద్రావనీనాథ! యీ
చారిత్రవ్రతశీలఁ జంపకుము నీ సత్యప్రతిజ్ఞత్వవి
స్తారప్రౌఢికి మెచ్చినార మని విశ్వామిత్రమౌనీంద్రుఁ డే
తేరన్, నాదారయాజ్ఞ తప్పదని యెత్తెం గత్తి నుద్వృత్తిమై.

వ. అంత విశ్వామిత్రుఁ డాత్రంబునం బోయి తత్కరంబుం బట్టిన
నతండు దేవా! నన్నంటఁ దగ దేఁ జండాలదాస్యంబునం
గర్హ్యుండనైతి ననం జఱునగ వాననంబునం దళుకొత్త మునీం 82
ద్రుం డిట్లనియె.

మ. నిను దాస్యంబునఁ జేర్చి కూర్చి మిగులన్ నీచస్థితిం దార్చినా
యన ధర్ముండును, నీసతీసుతులఁ దాసార్థంబు గొంపోయినా
యన విశ్వేశ్వరుఁడున్, బనుల్ గొనిన దయ్యా శ్యామహాదేవి; నా
యన! సుక్షత్రియవంశసంభవుఁడ; వేలా యింక శంకింపఁగన్?

ఉ. నీదుపరీక్ష కిట్టి మహనీయులఁ దేవలసెన్; పవిత్రవం
శోదయ! యెన్నికష్టముల కోర్చితి? పేఁదఁగరాని సాగరం
బీఁదితి; వెల్లభంగుల జయించితి, వెట్టికొఱంత లే దిఁకన్
నీదెస; నిత్యసత్యసరణీపరినిష్ఠులు మీరె దంపతుల్. 84

సీ. ఘోరవిషానలక్రూరాహి మన లోహి
తుని కాలుఁ గఱచి చంపిన బెడంద
మృతబాలరూప మూరెకులకుఁ దోఁచి రా
ద్తనయుఁ డన్ భ్రాంతిఁ గొల్పిన తెఱంగు
శిశుహంత లురికి వచ్చి నగల్ భవత్కుటుం
బినియొడిలోన వైచిన కడంక
పృథ్వీశుఁ డట్లు సాధ్వీమతల్లికి శిర
శ్ఛేదంబు సేయఁ బంచిన దురంత

తే. మన్నియు హుళక్కి; నాదు మాయావిలాస
మని యెఱుంగుము; లోహితుం డదె సజీవుఁ,
డదిగొ విశ్వేశుఁ డార్యాసహాయుఁ డమర
గణము గొలువంగ నీకు సాక్షాత్కరించె. 85

వ. అనునంతలో సర్వమంగళాసహితుండును, నిఖిలసురగణ సంసేవ్యమానుండును, ప్రమథగణసమేతుండును, బ్రహ్మర్షిగణపరివృతుండునునై యప్సరోగణలాస్యంబును, బ్రహ్మర్షి వేదనాదంబును, తుంబురునారదప్రముఖ గానవినోదంబునుం దనర శ్రీవిశ్వనాథ దేవుండు ప్రత్యక్షుండై. 86

శా. నిన్నుం బోలిన సత్యసంధు నెటనేనిం గానలే; దింకముం
దు న్నిక్కంబుగఁ గల్గఁ బోఁ; డటు మునీంద్రుం డెంత పోరాడినం
గన్నాఁ కైతి పదాఱువన్నియల బంగారంబవై మా పరీ
క్ష న్నిగ్గుం గని సత్యనిష్ఠకు హరిశ్చంద్రాఖ్య తార్కాణగన్.

వ. ఇఁక నీవు లోహితు నభిషిక్తుం జేసి భార్యాసహితంబుగఁ బరమపదంబునకు రమ్మనిన దేవా! న న్నాశ్రయించియున్న నా ప్రజల విడిచి యొక్కరుండ నెట్లు వత్తు? ననినఁ దత్సహితంబుగ నాన

తిచ్చుటయు నతం డట్లు కావించె; నిట్లు గాధేయుండు హారిశ్చం
ద్రమున కాచంద్రతారార్కం బగు యశంబుం గూర్చి లోక
కళ్యాణం బావహించె; మఱియుఁ దదనంతరంబ దశశతాబ్దంబుల
దీక్షం బూని తపం బొనరించె; నంత. 88

తే. అమరగణములతోఁ జతురాస్యుఁ డరిగి
తపముఁ జాలింపుమోయి వత్సా! ఋషిత్వ
మొసఁగినారము సంతోష మొందు మనుచు
నంతలో మాయమయ్యె నున్నటులె యుండి. 89

క. అంత నమ్మునీంద్రుండు. 90

తే. ఏమి వర మని యిచ్చె వాణీశ్వరుండు?
పోరు మాన్పింప నెంచి కన్నీరు దుడిచి
నాఁడుగా! కౌశికుఁడు వీడఁ బోఁడుగా! చ
రాచరంబులు తలక్రిందులైనఁ గాని. 91

. కానీ యెన్ని యుగంబుల
కైనను బ్రహ్మత్వసిద్ధి నందవలయుఁ, దా
మానుకొనవలయుఁ దపమం,
బూని కుశాన్వయుఁడు రి త్తవోఁ డెన్నఁటికిన్. 92

—, విశ్వామిత్రునకు మేనకా సమాగమము ,—

. అని దృఢనిశ్చయుండై పుష్కరంబులందు మఱల ఘోరంబగు
తపంబు నారంభించె; నంతఁ గొంతకాలంబునకుం ద త్తపఃప్రభా
వంబున లోకంబులు చీఁకాకుపడుచుండ సురాసురయక్షగంధర్వ
కిన్నరోరగసంఘంబులును, బ్రహ్మర్షిగణంబులును సమావేశంబై
యిట్లాలోచించె. 93

శా. గాధేయుండు ప్రచండదీక్షఁ దపముం గావించుచున్నాఁడు దు
స్సాధంబై తగు బ్రాహ్మ్యముం బడయు వాంఛన్; సూర్యచంద్రాధ్వసం
రోధంబున్ ఘటియించునో? జగములన్ గ్రుక్కించునో? వేల్పులన్
బాధంబెట్టునొ? కాలరుద్రుఁ డగుచున్ బ్రహ్మాండమున్ మాడ్చునో?

ఉ. ఎంతటివారికైన లభియింపని దాయభివాంఛితంబు; వాఁ
డెంతకునైన సాహసికుఁ; డీప్సితసిద్ధి నొనర్పకున్నఁ గా
లాంతకునైన లెక్కగొననట్టి యుదగ్రమహోగ్రపిండ; మ
త్యంతము గాఁగ రేఁగి ప్రళయం బొనరించుటకైన సిద్ధమా. 95

శా. పోనీ యీప్సితసిద్ధియైన, మొదలే మున్గోపి; బ్రాహ్మ్యంబుతో
డైనన్ వానికి నడ్డ మెవ్వ రిఁక? బ్రహ్మన్ లెక్క సేయండు; స
ర్వానర్థంబుల కాస్పదంబు మనమే యైన ట్లగుం; గాన నె
ట్లైనన్ వానితపంబె భంగపఱుపన్ యత్నంబు సేయందగున్. 96

వ. అది యుక్తంబ. 97

క. అలమిన యనర్థమునకుం
గలఁగి ప్రతిక్రియ యొనర్పఁ గడఁగుటకంటెం
దొలుతఁ దదుత్పత్తికిఁ దా
వల మగు హేతువును భంగపఱచుటె మేలా. 98

మ. అని యుద్వేజితులై సురాసురులు బ్రహ్మర్షుల్ విచారించి చ
క్కని కాంతాతిలకంబు నొక్కతె ననంగప్రాజ్యసామ్రాజ్యల
క్ష్మిని, శృంగారరసాధిదేవత యనం జెన్నొందు నయ్యప్సరో
వనితన్ మేనకఁ బంచి రమ్మునివరున్ భ్రష్టవ్రతుం జేయఁగన్.

వ. అంత నక్కాంతాతిలకంబు సఖీజనపరివృతయై వ్యోమయానం
బధిష్ఠించి ప్రయాణంబై భూలోకంబున కరుదెంచి విశ్వామిత్రా
శ్రమంబుప్రాంతంబునకుం బోయి. 100

సీ. అలరువిల్తుండు పాంథులపైఁ బ్రయోగింపఁ
దారసిల్లిన మేల్కటారు లనఁగ
నిర్మేఘ పరిణతో న్మేషంబులై పుడ
మికి దిగు క్రొక్కాఱు మెఱుపు లనఁగ
వలరాచదేవేరి యెలమిమైఁ గైసేయఁ
బోలుపారు బంగారుబొమ్మ లనఁగ
స్మరనిర్మిత మహేంద్రజాల కల్పిత పృథ
గ్భావంపుఁ బూర్ణేందుకళ లనంగ

తే. చలిత లలిత దృగంచలోచ్చావచప్ర
సారములఁ గలశోదధి శతసహస్ర
ముల సృజింపుచుఁ దనసకియలును, దాను
గాధిసుతు నాశ్రమోపాంతికమును జేరి. 101

శా. తాపస్యవ్రతముం దెమల్చుటకుఁ గాంతల్ ప్రాంతముం దుండి మా
యోపాయంబుల సంచరించి రట విద్యుద్వల్లరుల్ నాఁగఁ; దా
నేపాటం జలియింపఁ డత్తపసి వా రేవేసముల్ పూని రా
నీ పోనీ నెఱి దోఁపఁ బల్వగల నేయే మాయలం జేయనీ. 102

సీ. సరసగాన సుధారసము నింపుదురు ప్రాంత
ములనుండి మునితపంబునకుఁ బూన
నటనం బొనర్తు రజ్జటి ఫల మూలార్థ
మరుగ నందంద యయ్యెద నెఱింగి
వని విహరింతు రాయన దేవపూజకై
పూలుఁ బత్తిరిఁ దేరఁ బోవువేళ
జలకేళి సవరింత్రు స్నానార్థ మతఁడు పు
ష్కరముల కేతెంచు సమయ మరసి

తే. తఱి యెఱిఁగి పెద్ద లనుచుఁ జెంత కరుదెంచి
పదములను వ్రాలుదురు కైతవంపు భక్తి
సంభ్రమము లొప్పఁ, బయ్యెద జార, గుబ్బ
గవబెడంగులు, భుజమూలకాంతు లడర. 103

తే. వచ్చినను, బోయినను నొక్కభంగి తప్పఁ
బ్రియము లే, దప్రియము లేదు; వేయునేల ?
నదియు నడయాడు నొకవింతదైన 'జాతి
బొమ్మరో' యని వారి కబ్బురము దోఁచె. 104

ఉ. చూడఁడు చెంత నిల్చినను సుందరులం గను లెత్తి; చూచినం
జూడని చందమే యచటఁ జొప్పడుటం దలపోసి రిట్లు పూఁ
బోఁడులు కోపనుండు మునిపుంగవు; డెప్పటి కేమి మాడునో ?
పాడగు పారతంత్ర్యమునఁ బాల్పడినారము సాహసింపఁగన్. 105

శా. ఎన్నో నేరుపు, లెన్నియో నటన, లెన్నెన్నో వగల్ సూపినన్
హృన్నాళీకము సంచలింప; దది గా కీతండు ముంగోపియున్;
గన్నెక్కించుకఁ జేవురించినటులైనన్ జెప్పలే; మింక శ్రీ
మన్నారాయణమూర్తికే యెఱుకపో మాచావు వేయేటికిన్ ? 106

వ. అని యిట్లు పెద్దయుం గాలంబు చలపోరి యోసరిల్లి వేసటం జెంది పలుకుచున్న తోడినెచ్చెలులం గాంచి మేనకావధూటి యిట్లనియె.

ఆ. చావుబ్రదుకు లొక్క జాడగాఁ దలపోసి
చేయఁదగినయంతఁ జేయవలయు;
నటులో యిటులో తేలునంతకు విడరాదు;
మనకుఁ గార్య మిదియ మగువలార ! 108

వ. అని పలికి వారలం బురికొల్పికొని యందఱుం దృఢాభినివేశం బులం బొదలుచు నమ్మునీంద్రు నెట్లైనం దమవశంబుఁ జేసికొనం బలుదెఱంగుల యత్నింపుచు నొక్కనాఁడు పుష్కరంబులం జలకంబు లాడుచుండ నచటికి స్నానార్థం బనతిదూరంబున నరుదెంచు గాధేయున కార్ద్రదుకూలంబులతోడఁ గూలంబునకుఁ జేరవచ్చు లీలావతులలోన మేలుబంతి యగు మేనకాలతాంగి యాలోకన పథంబునం బడుటయుం దైవవశంబునం దదీయాలోలకటాక్షాం చలజాలంబునం జిక్కి రెప్ప వాల్ప కయ్యొప్పులకుప్పం జూచుచుండె; దురత్యయం బగు పారమేశ్వరమాయావిలాసంబునకు మాఱున్నదే? భవితవ్యతాబలం బిట్టుండె; మఱియు. 109

సీ. వలిపెంపుఁ దడిచేల వెలిఁబాఱు మై మెఱుం
గులఁ గన్నుఁ గనువేదు రలము టెంత?
మీటినచో విచ్చు మిడిమేలపుం గబ్బి
గుబ్బ చన్గవఁ జూచి యుబ్బు టెంత?
నల్లఁద్రాఁచు విసంబునకుఁ జక్కటులు దిద్దు
కడగంటి సోఁకునఁ గరఁగు టెంత?
తరిపి వెన్నెలపొల్పు నరగాసు వడసీని
చిఱునవ్వు లోలయై మఱచు టెంత?

తే. పున్నెమునఁగాని దొరకని భువనమోహ
నాంగియఁట! జాణయఁట! తన యంత వచ్చె
నఁట! కలికిచూపు లోలయించెనఁట? విడువఁ ద
రంబె? రంభోరు; ననుభవరసికుఁ డతఁడు. 110

వ. ఆ సన్న యెఱింగి యయ్యిందుముఖీబృందంబు డెందంబున నమందానందంబు నొందుచు, బళే కరబదరీఫలం బయ్యెఁ గార్యసిద్ధి; బళిబళి! సుడి దిరిగిపడియె గగనతల జంఘాలుం డగు విహంగమ సార్వభౌముండు; బాపురే! సంస్తంభితం బయ్యెఁ జతుర్ముఖప్రముఖ

నిఖిల బర్హిర్ముఖ ప్రబల భయంకరంబైన మహా భుజంగమంబు; వహ్వా! కట్టువడె నెట్టకేల కిట్టట్టు గదలక సకలభువన భయంకరాద్భుత ప్రచండశుండాలంబు; సెబాస్! చిక్కెఁజిక్కె నవష్టంభ సంరంభవిజృంభమాణం బగు సమద హర్యక్షం; బని లోలోనన యుబ్బుచు విమానారోహణంబు సేయునపు డొక వ్యాజంబున వెనుకకు మరలి యక్కులుకులాఁడి ముద్దులొలుకు చిఱునగవుం దళుకుతళుకున బెళుకుఁ జూపు లొలయించుచు విమానం బధిష్ఠించి యెందేనియుం జనియె; నంత నమ్మునిపుంగవుం డెట్టకేలకు మనంబును బ్రబోధించుకొని. 111

క. వ్రతనిష్ఠ నున్న నాకీ
యతివలతో నేమి పని? యటంచు మరలు; న
య్యతను విరిగోలతాఁకున
మతి యుత్పథముగఁ జలింప మరలం దిగుచున్. 112

వ. ఇట్లు మనోగజంబును ధైర్యాంకుశంబునం జిక్కఁబట్టి కృతస్నానుండై నిజాశ్రమంబునకుం బోయి యెప్పటియట్ల తన నియమనిష్ఠలు సాగింపుచుండె; మఱియు. 113

శా. శంకాతంకము లెన్నఁడున్ గనని విశ్వామిత్రు చిత్తంబునం
బంకేజానన నాటిపోయిన దవంధ్యప్రేమబీజం బదే
యంకూరం బయి, శాఖమై, సుమఫలాఢ్యంబై మహావృక్షమై
సంకల్ప ప్రభవాది రాజ్య సమధిష్ఠానంబు గాకుండునే? 114

తే. పూసలం ద్రిప్పుచే కాని పూవుఁబోఁడి
మదికిఁ దోఁచిన జపమునే మఱచిపోవు;
ధ్యాన మని కన్నుమూయుచే తడవు గాఁగఁ
గమలలోచన యెదుట సాక్షాత్కరించు. 115

శా. ఆ కల్లాడినఁ గామినీమణి విమానార్హావ మన్ భ్రాంతితో
నే కన్నేదురు వోఁపఁ జూచుఁ, గలకంఠీకంఠనాదంబుఁ దా
నాకంజాక్షి మనోహరధ్వని యటం చాలించు; వేయేల ? స
ర్వాకారంబులఁ దత్స్వరూప మెదలో హత్తెన్ సమగ్రంబుగన్.

ఉ. అచ్చున గ్రుద్దినట్లు, గొనబౌ ప్రతిబింబితమట్లు, లాత్మలోఁ
గ్రుచ్చినయట్లు, బల్మి నెలకొల్పి బిగించినయట్లు నాటెఁబో!
యచ్చపలాక్షిరూపు హృదయమ్మున నమ్ముని; కేమి సేయఁగా
వచ్చు ? సరోజలోచనలబారికిఁ జిక్కనివార లుందురే ? 117

సీ. అలవోక వెన్కవై పరుదెంచి మృదుకరం
బులతోడఁ గన్నులు మూసినట్లు
మొలకనవ్వులు ముద్దు లొలుకఁగా నోరచూ
పులఁ జూచి మది మరుల్గొలిపినట్లు
కలికిచూపుల వెన్నెలలు గాయ నెఱి దోఁపఁ
బువ్వుబంతులఁ దన్ను రువ్వినట్లు
బలితంపు గబ్బిగుబ్బల ఱొమ్మునం గ్రుమ్మి
బిగియారఁ గౌఁగిటఁ బెనఁగినట్లు

తే. మోము మోమునఁ గదియఁ గెమ్మోవి గఱచి
నట్లు, ముద్దాడినట్లు, నఖాళిఁ జెనకి
నట్లు, చెక్కుల నొక్కినయట్లు దోఁచు;
భావజమహేంద్రజాలప్రభావ మేమొ! 118

వ. ఇట్లనుక్షణభావనాబలానుభూయమానమేనకాసమాగమభ్రమ
ప్రమాద జనిత పారవశ్యంబున మైమఱచుచు నంతరాంతరాను
గత సంతాపానుమీయమాన మేనకా కాంతా విరహవేదనా
దోదూయమాన మానసుండై వేగుచుండె. 119

తే. తరుణి–వారుణి–సిరి–త్రివిధ మగు మధువు;
కాంచినంత నె మత్తుఁ గల్గించు నొకటి,
త్రావినను రెండవది, సంచితమున మూఁడ
వది; తొలిది జీవ మున్నంతవఱకు విడదు. 120

తే. చెట్టులోపల మొది పుట్టినట్టులైన
నది సమూలంబుగాఁ జెడునంతవఱకు
విడువ; దారీతిఁ గామినీవిషయవాంఛ
పురుషుఁడు నిపాత మౌనంతవఱకు విడదు. 121

శా. వేధో ముఖ్యసురాసురుల్ భయసముద్విగ్నాత్ములై మ్రొక్కుడన్
సాధించెన్ బ్రతిసృష్టి నే ఘనతపస్సామర్థ్య సంపన్నుఁ; డా
గాధేయుం డతి నీచసౌఖ్యముల కగ్గంబై చెడన్ బశ్చిమాం
భోధిన్ దూఁకెనొ లోకబంధు; వదియేపో మిత్రధర్మం బనన్. 122

శా. బారుల్ దీర్చి విహంగసంఘములు పైపైఁ బాఱె; గోవ్రాత మం
భారావంబు లెసంగ నాశ్రమపురోభాగంబులం జేరె; సం
ధ్యారాగస్ఫురణంబు మీఱెఁ; బొదరిండ్లం దూఱె నంతంత గాం
తారాంతర్గత జంతుసంతతి నితాంతక్రూరరావంబులన్. 123

వ. అంత నక్కౌశికరాజ సంతానంబు సాయంతనకృత్యంబులు నిర్వ
ర్తించి సురసుందరీ సౌందర్య పరవశంబైన డెందంబును బ్రయత్న
పూర్వకంబుగ మరల్చువాఁడై ప్రకృతిలోని యద్భుత విశేషంబుల
నాలోకించుచు. 124

మ. ప్రియకాంతుం డపరాబ్ధి మున్గె ననుచున్ భృంగీధ్వనిం బొక్కుడున్
దయనీయంబుగ మోము వాంచి యొక చెంతన్ బద్మినీకాంత; యొ
క్కెడన్ గల్వ వెలంది నవ్వుఁ బ్రియురాకం జూచి; యానిత్తెఱం
గె యొకం డేడ్వ నొకండు నవ్వును త్రిలోకీనాట్యరంగస్థలిన్.

మ. ఒకఁ డుచ్చండగతిన్ వెలుంగునపు డన్యుల్ నిల్వ రచ్చోట నెం
త కళాపూర్ణతఁ గన్న, రాజపదమాన్యత్వంబుఁ గైకొన్న; నం
చౌకనీతిం బ్రకటించిన ట్లెసఁగె సూర్యుం డ స్తమింపంగ శీ
తకరావిష్కృతి ప్రాగ్ధరాధరవియత్సామ్రాజ్యపీఠంబుపై. 126

తే. చంద్రు నానందమయకరస్పర్శనమున
నదిర! యుత్ఫుల్లతారక యయ్యె సంజ
యంబరము దిగజారెఁ దనంత; రాగ
వతు లెఱుంగరు తమజారుఁబాట్ల నెపుడు. 127

శా. భ్రాజజ్జ్యోత్స్నల హాసముల్ నెఱయ సంభావించి ప్రాచిం, గడున్
సౌజన్యం బెసఁగన్ గుముద్వతిని హ స్తస్పర్శలం దేర్చి, ని
ర్వ్యాజప్రేమ విధుం డదే రజనితో నానందముం బొందెడున్
'రాజానో బహువల్లభా'–యనెడు శాస్త్రం బర్థవంతంబుగాన్. 128

ఆ. కామి గాక మోక్షకామి గాఁడు నరుండు
యామినీసమాగమానుభూతిఁ
దోఁగి తుదకు ము క్తదోషుండు గాఁడొకో
హరిపదం బలమి శశాంకుఁ డెట్లు? 129

వ. ఇట్లు తనకుఁ గల్గిన మనోవికారంబున కనుగుణంబుగా భావపరం
పర లెసంగఁ జూచుచున్నంత నంత కంతకుం గ్రమక్రమంబున
రోహిణీకాంతు కిరణసంతానంబు దిగంతంబులకుం బ్రాఁకి సమం
తతః ప్రసారంబైనఁ జాంద్రీవిహారంబు బ్రహ్మాండ కరండంబునం
బిండి యారఁబోసినగతిం గలధౌతకాంతులఁ బూతఁ బూసిన
తెఱంగునఁ గలశపాథోధి సహస్రంబుడంబునం బొలిచి విశ్వం
భరా గగన దిగంతరాళంబు విలువమీఱిన చలువ వెలిపట్టు
పుట్టంబున నాచ్ఛాదితంబైన యట్ల యత్యంత మనోహరంబై

యెల్లజీవులును మాటుమణంగి నిదురమత్తున నత్తమిల్లి చీమ చిటుక్కనిన మాఱువలికినట్లు దోఁపఁ బ్రకృతిస్వరూపంబు నిస్తరంగ సముద్రంబువిధంబునం బ్రశాంత స్తిమిత గంభీరంబై యుండు నవసరంబున మలయ వాతాంకురాసీతంబై వేణువీణామృదంగాది నాదంబుల మేదురంబై మనోహర మధురగానం బొకటి వీనులకు విందుఁ గూర్చె. 130

సీ. లలిత గాంధర్వ కళావిలాసం బవం
ధ్యం బయ్యె మధురకంఠస్వరమున
మాధ్వీరస తరంగమయముగాఁ దోఁచె రా
గాలాపమాన్యవిన్యాసగరిమ
నానందరసశీకరాసారపారవ
శ్యము మై నలమె మూర్ఛనాదికమున
నమృతమయప్రవాహము పొంగిపొరలె ర
మ్యస్వరకల్పనానల్పమహిమ

తే. మ్రోళ్ళు చిగిరించెఁ, బాషాణములు ద్రవించె,
ఫణిచయములకుఁ బరవశత్వము జనించె,
వీనులు ఫలించె, వేణు వీణానుగీయ
మాన మానితగానరసానుభూతి. 131

శా. ఆ గాధేయు మనోంతరాళమున క ట్లానందసంధాయకం
బౌ గానామృతపూర ము బ్బడరి, జాలై, కాల్వయై, పెద్దయే
రై, గాఢప్రచలన్మహోర్మికృత కూలాఘాతకోలాహలం
బై, గంభీర మహాసముద్రమయి వేలాతీతమై పొర్లినన్. 132

వ. గానరసానుభవంబున నానందపరవశుండై తదీయ శ్రవణ కుతూహలాయత్త చిత్తంబున లేచి, తద్దిశాభిముఖంబుగా బయలుదేఱి,

బ్రహ్మాండమండలంబు నిండి నిబిడీకృతంబై యుండు పండువెన్నెల
లోనఁ జల్లని పిల్లగాడ్పు లుల్లాసంబు గలిగింప, హృదయంబు
పల్లవింప నడచినడచి పురోభాగంబున. 133

క. సమవిస్ఫుట కుముదవనీ
భ్రమదిందిందిరమనోహరనినాదములం
గమలావిమలోదవసిత
కమలాకరమైన కొల నొకటిఁ గనుఁగొనియెన్. 134

వ. మఱియు. 135

క. ఘుమఘుమ సుమవాసనలం
బ్రమద మొదవఁ గొనుచు గంధవహబాలురు మొ
త్తము నెదురువచ్చి మునిస
త్తమునకుఁ గాన్క లిడి రటు ముద మెదం బొదలన్. 136

వ. మఱియు. 137

క. కుడి తొడయుఁ, గుడి భుజంబును
గుడి క న్నదరె మునివంశకుంజరునకు; ని
య్యెడ నేవో భోగముల
న్బడయం గల వనుచు స్పందనము సూచించెన్. 138

వ. అంత నమందానందంబున ముందునకుం జని. 139

తే. ఆ కొలనిప్రాంతముననె దివ్యతరకుసుమ
ఫలతరు లతా వితాన సంపదలు నల్గ
డలఁ దనరఁ బండువెన్నెల పొలుపులోనఁ
గమ్మతావుల చల్లని గాలిలోన. 140

తే. చలువతా తిన్నెపైనిఁ గన్నులకు విందు
గొలుపు చిత్రంపు రత్నకంబళముఁ బఱచి
నట్టి రమ్యప్రదేశంబునందు రత్న
దీపముల వెల్గులోన నుద్దీపితముగ. 141

సీ. తమ్మిరేకులఁబోలు ధవళాయతవిలోచ
నములలో హావభావములు దోఁపఁ
గమనీయ కరకంకణములు గల్లన మనో
హరమైన హస్తవైఖరి సెలంగ
నడుగుఁదామరలఁ జొప్పడినట్టి నూపుర
ధ్వని లయప్రస్తారఫణితిఁ దెలుపఁ
బంచమరాగసమంచితం బగు గీతి
వెలలేని యమృతంపువెల్లి గొల్పఁ

తే. గలదు లేదను కౌను, వెల్వలికి నిగుడు
గుబ్బగవ, మొల్లనవ్వులుఁ, గుందనంపు
మైసిరియు, బెళ్కుఁజూపులు మలయ సకల
నడుమ నటనంబొనర్చు మేనకను గాంచె. 142

చ. కనుఁగొని పట్టరానితమకంబునఁ జెంతకుఁ జేరవచ్చు న
మ్మునిపదముల్ గ్రహించెనయముం బ్రియముం భయభక్తిభావముల్
దనర 'నమః కుశాన్వయసుధాకిరణాయ నమోఽస్తు తే శ్రితా
వనచరణాయ' యంచు నవపల్లవకోమలపాణి నేర్పునన్. 143

తే. అతిముదంబున 'నిష్టకామ్యార్థసిద్ధి
ర'-స్తనె మునీంద్రుఁ; డదియు మహాత్మ! మీదు
వాక్యములలోన నన్యథాత్వంబు గలదె?
నే నిఁకఁ గృతార్థనైతిని; నిశ్చయంబు. 144

చ. సెల వీక్షఁ బోయివత్తుము; వశిప్రవరా! సురరాజుకొల్వులోఁ
గల దొక పెద్దనాట్యసభ; గాటపుఁబోటిపరీక్ష; లేము పో
వలె; నల రంభ నా కెదిరిపక్షము; ముందుగఁ జూచుకొన్న మే
ల్గల దని నిర్జనస్థలము గాన నిటన్ నటనం బొనర్చితిన్. 145

క. అది సరియె యీ నిశీథిని
ద్వదీయదర్శనమె పెద్దభాగ్యం; బాశీ
స్సాదవె; బలే! 'సంపత్సం
పద మనుబధ్నాతి'-యనుట పాటికి వచ్చెన్. 146

వ. అని పల్కుచుండ నింతలో విమానధ్వని స్నిగ్ధగంభీరమంగళం బుగఁ జెవులవిం దొనర్చుటయుఁ దోడిసకియ లందఱుం బరికరం బులు సవరించి ప్రయాణ సన్నాహం బొనరించి త్వర సేయ, నమ్మే నకా లతాంగియు మునీంద్రా! సెలవిం డిఁకఁ బోయివత్తు నని నవకిసలయ విసర లసమాన మృదులాంగుళీ విలసితంబులగు పాణి తలంబుల నమ్మునిప్రవరు చరణయుగళంబు నంటి ఫాలంబునం గీలించి లేచి వెనుకదెస నిలిచియున్న విమానంబు చేరువ కరుగు చుండ నత్తపసిమేటి చిత్తంబున నుత్తలపాటు గదిరి యమ్మత్త కాశిని కడ్డంబు నిలిచి యిట్లనియె. 147

శా. మా యాశీర్వచన ప్రభావమునకున్ మాఱుం డ; దొఁ గాని, కాం
తా! యుష్మత్సువిలాస భాసుర కటాక్షాసారమే నాస్తిప
ర్యాయం బౌనటె? మాకతంబునఁ గృతార్థత్వంబు గైకొంటి గా
నీ, యేనీ మఱి? యస్మదీయహృదయోన్మేషంబుఁ జేకూర్చితే? 148

వ. అనిన నవ్వాగలాఁడి యిట్లనియె. 149

తే. తలవని తలంపుగా మీపదంబు దొరక
నిలువఁ దఱిగాక వేగఁ బోవలసి వచ్చె

మీయెడ నిరాదరణ గా దమేయచరిత!
సిరి వోరయఁగ మోకాలొడ్డు చెనఁటి నైతి. 150

క. నాకుఁ గృతార్థత నొసఁగిన
మీకుఁ గొఱంత యెటనుండు? మీ మాటలలో
నే కల దఖిలార్థైకస
మీకరణప్రాభవం; బమేయగుణాఢ్యా! 151

వ. మఱియు. 152

క. ఒకరికిఁ గైవస మగు వా
రికి స్వాతంత్ర్య మెది? వేల్పుఱేని ముదలమే
రకుఁ బోకయున్న దేవస
భకు నాకు ఋణంబు దీఱు; బ్రతుకే వృథయా. 153

వ. పునర్దర్శనం బగు నట్లనుగ్రహింపుఁ, డిప్పాటికిఁ బోయి వత్తుము. మాకుంగల తొందరపాటు విన్నవించితిఁగాదే? యనిన మునీంద్రుం డిట్లనియె. 154

ఉ. తొందర లేనివా రెవరు? తోయజలోచన! వేల్పురాజు మా
కుం దెలియుం; బరీక్షలివి క్రొత్తవిగా వెటు నీకు; రంభ నీ
ముం దొక గవ్వసేయదు; ప్రఫుల్లభవత్కరుణాకటాక్ష ని
ష్యందము లేనిచోఁ గుసుమసాయకు మాయకు నే భరింతునే? 155

చ. అనిన లతాంగి యిట్లను; మహాత్మ! యిదెంతటి వింతమాట మీ
యనితరసాధ్యసృష్టి మహిమాతిశయం బది గుండెగాలమై
యనిమిషు లందఱుం దిరుగులాడరె? వేఁడరె నాఁడు మిమ్ము? నేఁ
డనఘ విచిత్రమాయెఁ గుసుమాయుధు మాయ యజేయమాయెఁగా!

తే. అనినఁ గుశనాభపౌత్త్రుఁ డిట్లనియె; నో వి
భావరీశనిభాననా! యో విలాస
భాసురదృగంచలాంచితప్రణయకౌము
దీ! మనోహరహాసినీ! తెలియ వినుము. 157

ఉ. పోఁడిమి మీఱ మన్మథుని బుగ్గియొనర్చిన ఫాలనేత్రునే
క్రీడకుఁ దార్చి, యాతని శరీరమునన్ సగఁబాలుగొన్న య
య్యోఁడుఁదనంబులోఁ గల మహత్తరశక్తిఁ దిరస్కరించు వాఁ
డేఁడి జగత్త్రయంబున? జయింపఁగ నాతరమానె? భామినీ! 158

వ. అనిన నయ్యిందుముఖి మందహాససుందరంబుగా మరందమాధురిం
డిందుపఱచు మృదు మధురవచనరచనాకౌశలంబు మెఱయ మనో
హరస్వనంబున మునీంద్రునితో నిట్లనియె. 159

ఉ. కోరిక లూరఁ ద్వాదృశులకున్ భ్రమఁగొల్పిన యట్టిప్రోడ శృం
గారరసాధిదైవతమె కావలె; నత్తరళాక్షి యెవ్వరో?
పే రెదియో? విధాతపయిఁ బెద్దగ మచ్చర మూని దాని నె
వ్వారు సృజించిరో? తెలియవచ్చునె మాకు? మునీంద్రచంద్రమా!

వ. అనిన మునీంద్రుం డిట్లనియె. 161

క. కన్నుపొడిచి చేసేతులఁ
గన్నీరు దొరంగ నేమికారణ? మని నీ
వెన్ని వగలు పచరింపుచు
నన్నడిగెద? వెంత నంగనాచివె? కాంతా! 162

చ. ఇఁకఁ జెవియొగ్గు మిట్లు కలికీ! యల సర్వసుపర్వకోటియుం
దికమకలయ్యె నిక్కము మదీయ తపోబలధాటి; కంత వా
నికి వివశత్వముం గొలుపు నీ సవిలాసకటాక్షజాల మెం
తకయినఁ జాలు; నెంత నిశితంబొ కదే! వగలాఁడి! చూడఁగన్. 163

శా. వేణీలోలభవద్విలోకనములం దేపారుఁ జాంద్రీప్రభల్;
వాణీకేళి శుకానులాపములు నీవాక్కుల్ సుధావాహినుల్;
పాణిస్పర్శ మఖండసౌఖ్యమునకుం బ్రస్ఫోరకం బౌఁగదే!
జాణా! నీ హావాయలింద్రజాలములు; పాతాళ్ద్రష్టాయే ముగ్ధుఁడౌ.

ఉ. నావుడు మందయాన మెలన వ్వాలయం బలికెన్ మునీంద్ర! మీ
కీ విపరీతభంగి యెటు లింపు జనించెనో? కాని, మీ తపం
బా విఫలత్వ మొందుఁ; గులమా నలుపౌ; పరువా చెడున్; యశం
బా? వితగా నశించుఁ; దగవా? నగుబాటగు వెట్టిపోకడల్.165

ఉ. వేడుకకాండ్ర నెల్ల వలపించెడు వేలుపుసాని మా కిటుల్
కూడ దటంచుఁ దెల్పె ననుకోవల; దూర్జితధర్మనిష్ఠులౌ
ప్రోడలు, సత్తపోవిభవపూతచరిత్రులు మీర లేడ? మే
మేడ? నిమేషతుచ్ఛసుఖ మేడ? భవాదృశు లాత్మ మెత్తురే?

తే. కలఁ గనినయట్లకాని యిందలి సుఖ మొక
సుఖమె? పరిణామవిరసంబు చూడఁజూడ
నమితమాలిన్యమునకు లక్ష్యమగు; నెవరు
వినిన నవ్వెద; రిది మానుకొనిన మేలు. 167

వ. నావుడు మునీంద్రుం డిట్లనియె. 168

తే. ఏము వేయితెఱంగు లెంతేని తత్త్వ
మరసి యోజించితిమిగాని యంతరాత్మ
హరిణలోచన! నీ విగ్రహమును నిమున
మైన మఱువంగఁజాల; దే మందుఁ జెపుమ. 169

వ. అది యట్లుండె. మఱియు నొక్క విశేషంబు వినుము. 170

సీ. దారుకాటవి మౌనిదారల హృదయముల్
హరియించు నిందుశేఖరునికంటె
భ్రాతృభార్యను గర్భవతి బల్మిఁ బట్టి క
క్కూరితిఁ బాల్పడు దేవగురునికంటె
గురుపత్ని యనక నెక్కొనుమోహమునఁ దారఁ
బట్టిన రోహిణీభర్తకంటెఁ
గోడియై కొక్కొరోకో యంచుఁ గూసి య
హల్యను గొన్న జంభారికంటెఁ

తే. బాప మున్నదె మాకు? నీపాలఁబడినఁ
గమలలోచన! వేడుక కాంద్రకోటికె
జన్మ మెత్తిన వేలుపుసాని వీవు
తపము చేయఁగాక మాక దెంతపని? చెపుమ? 171

మ. అల వేదోదితధర్మపారగులు నిత్యాగ్నివ్రతుల్ సోమపీ
థులుఁ గర్మిష్ఠులు నన్నదాతలును నెంతో పుణ్యమార్జింత్రు; త
త్ఫలమే మీ మృదుబాహుబంధసుఖసౌభాగ్యంబు; సీరంగనీ
తుల కీతీరున నేత మెత్తెదవు మాతో నేల? శాతోదరీ! 172

శా. ఆపుణ్యాత్ముల కంప దీక్షలము; కాదా? జీవముం బాయకే
ప్రాపించెం దురవాపమైన సశరీరస్వర్గసౌఖ్యం; బహో!
నాపుణ్యంబె యఖండ మద్భుత మగణ్యం; బిష్టు పూవిల్తు సే
వాపారమ్యముఁ గాంచెదం, బిదప సర్వంబున్ సమర్థించెదన్.

మ. ఇఁకజా గేటికి? నాదుమాట వినవే హేరాళధారాళ ది
వ్యకటాక్షామృతపూర మొక్క మొగి మాపైఁ బర్వఁగాఁ జేయుమే
టికి శుష్కప్రియ శూన్యహస్తములు? బోటీ! పుష్పకోదండు ధా
టికి నన్నేటికిఁ గాటువుత్తు? మరుఘోటీ! నీటుఁ జూపింపవే. 174

చ. అనిన సురాంగనామణి యహో! తనకోడికి మూఁడుకాళ్ళటం
చనుటయె తప్ప మాఱుగలదా? మగవారలు స్థూలసూక్ష్మముల్
గన; రెటులైన నిప్పు డరుగన్ వలె; నావలఁ జూచికొంద; మే
మనుకొనఁబోకుఁ డంచు రయమార విమానము నెక్కఁబోయినన్.

వ. అమ్మునివరుండు చయ్యన నయ్యువతీమణి పయ్యెదకొంగు వట్టికొని
వారించి యిట్లనియె. 176

క. ఎక్కడికిఁ బోయెదవు? నీ
టక్కరిమాటలకు మే మొడంబడుదుమె? మా
కక్కరితిఁ దీర్పకుండిన
నిక్కము ని న్నడుగు దాఁటనీయము కాంతా! 177

ఉ. గాలికి లేఁడు కౌశికుఁడు; కామిని! యే మనుకొంటి వీవు? మీ
వేలుపురాజుగుండియలు బెత్తెఁడు జారును మమ్ముఁ గన్న; నీ
జోలికి రాఁడు; నీకతన సూనశరుం డిఁక మాకు బంటు గాఁ
డే? లలితాంగి! యంచుఁ దర లేక్షణఁ గౌఁగిటఁ గ్రుచ్చి ముద్దిడెన్.

వ. అంత నమ్మేనక వెంట వచ్చిన యచ్చరమచ్చెకంటు లందఱుం
జేరు చేరువలనుండి యేకగ్రీవంబుగా నిట్లనిరి. 179

తే. మంగళము మేనకావధూమణికి, నిత్య
మంగళమ్ము కుశాన్వయమండనునకు,
మంగళము విరిగోలకు, మంగళము సు
మాస్త్రున కటంచుఁ బల్కి రయ్యబ్జముఖులు. 180

వ. ఇట్లు మంగళగీతంబులం బాడి, యక్కామినీకాముకులపైఁ గుసుమ
శరశరనికరంబులో యన నిజకరకిసలయ విలసితంబులగు వికచ
కుసుమవిసరంబుల సేసలు చల్లి, యుల్లంబులు పల్లవింప, మదనో

న్మాదంబు ను త్తేజితం బొనర్చి, యమ్మందయాన లందఱు వ్యోమ యానంబున నానందంబు సందడింప స్వస్థానంబుల కరిగి; రంత.

తే. గండుఁగోయిల రవములు మెండుకొనియెఁ;
జిలుకలుం గోరవంకలుఁ జెలఁగి యార్చె,
నలరుఁదూపులఁ బద నెక్కె; నళికొలంపు
జ్యారవము పేర్చెఁ, గోయని మారుఁ డార్చె. 182

మ. అలఘుస్ఫారతపఃప్రభావమున బ్రహ్మత్వంబు సాధింపఁగాఁ
గల నంచుం జలజాసనాది సురసంఘుంబున్ మహాశ్చర్యసం
కలితం బౌనటుఁ జేసె నెవ్వఁ డతఁడే కాంతాకుచన్యస్త ని
స్తుల పాటీరవిలేపలక్ష్మ్య నిజవక్షోభాగుఁడౌ కేమనన్ ? 183

వ. ఇదియు పారమేశ్వరి యనంబడు మాయాశక్తిప్రభావం; బిట్లు బృందారక సుందరీసౌందర్యవాగురలం దగుల్కొని యమ్ముని బృందారకుండు నిధువన పరబ్రహ్మానందపారవశ్యంబున మంద తేజస్కుండై కొంకక పెద్దయుం గాలంబు గడపి యమ్మేనక యం దొక్క కన్యారత్నంబుం గాంచె; నంత దైవవశంబునం గ్రమక్రమంబున దనుఁ దాఁ దెలిసికొని కామినీవిషయోపభోగ ములయందు విరక్తుండై నిజాంతర్గతంబున నిట్లని చింతించె. 184

ఉ. ఎంతప్రమాద మయ్యె? నటు లెండకు వానకు నోర్చి యేండ్లుఁ బూఁ
జ్లెంత తపోవిభూతి గడియించితి? నంతయు వ్యర్థ మయ్యె; నా
యంతటివాని తెల్వి యిటు లగ్గి బడెం; దరుణీదురంత దు
ర్దాంత కటాక్షవీక్షణ పరంపర కెవ్వఁడు నిల్వఁగ గ్లెడున్ ? 185

క. సుర సిద్ధ సాధ్య విద్యా
ధర కిన్నర యక్ష దైత్య దానవతతి నన్
జెఱుపఁ దలఁచి చేసిన దీ
గురుతరకైతవము; తెలిసికొన లేనైతిన్. 186

ఉ. వారల కున్న ప్రజ్ఞ యిది; వారవిలాసినులం దగిల్చి యె
వ్వారితపంబు లేనియును భంగ మొనర్చుట క్రొత్త గాదు; నా
ఘోరతపంబుధాటికి విఘూర్ణితమానసు లౌట నోర్వఁగా
నేరక చేసి రిట్టి యవినీతి; యెఱుంగక మోసపోయితిన్. 187

మ. మదనోన్మాదము నెత్తి కెక్కినపు డేమాటల్ స్ఫురించున్? దలం
పెది? కార్యం బెది? ప్రాప్తమైన దెది? యిస్సీ! యెంత దౌర్భాగ్యమై
నది? తా నొండుఁ దలంప దైవ మొకచందం బెంచుఁగా! కాలక
ర్మదశాయోగము తప్పునే? హరిహరబ్రహ్మాదు లేతెంచినన్.

శా. ధర్మధ్వంసము, పాపమూల మని స్త్రీత్వంబు నే వాఙ్మనః
కర్మాపేత మొనర్చితిం దొలుతఁ; దత్కాంతాకటాక్షాంచలాం
తర్మాయాప్రసరంబు క న్నలమి ముగ్ధత్వంబుఁ బైకొల్పె; హృ
న్మర్మచ్ఛేదక మయ్యెఁ జేసినప్రయత్నం బంతయున్ వ్యర్థమై.

మ. తలిరుంబోఁడులగాలిసోఁకిన ననర్థం బంచు మాటాడకే
తొలఁగం బాఱి, మనంబుఁ జిక్కఁగొన నెంతో పోరితిం గాని ని
ష్ఫలమయ్యెం దది; చూచి చూచి పడితిన్ బాపంపుఁగూపంబులో
పల; స్వాధీనత తప్పకుండునె? స్మరాపస్మార మేపారఁగన్. 190

మ. ప్రళయోజ్జృంభిత మృత్యువక్త్రమును జీల్పన్ వచ్చుఁ; గాలాంతకో
జ్జ్వలదండస్ఫుటధాటినైన మరలింపన్ వచ్చుఁ, హాలాహల
జ్వలనజ్వాలల మ్రింగవచ్చును మనస్స్థైర్యం బసాధ్యం బహో!
తల లైదై కను లెల్ల మూఁడయిదులైనం బార్వతీభర్తకున్.

క. మనసే సర్వానర్థము
లను గల్పించునది; కాళులకుఁ జేతులకున్,
గనులకు, సకలేంద్రియముల
కును బ్రేరక మగుచు శాసకుండును బోలెన్. 192

మ. మతి స్వాధీనముగాని మానవుఁ డకేమర్యాదలుం దక్క వెం
త తపఃప్రాభవశాలియైనను; మనస్స్థైర్యం బొకం డున్ననాఁ
డతినైచ్యస్థితిఁ గన్నవాఁ డయినఁ దద్వ్యాహారమే వేదసం
హిత; వేయేటికి? నెల్లభంగుల మనంబే మూల మన్నింటికిన్. 193

శా. సర్వానర్థకరం బగున్ మనసు దుష్టంబైనచో; నొక్కచో
సర్వశ్రేయములన్ ఘటించు నదె శిష్టంబైనచోఁ; గావునన్
దుర్వారంబగు చిత్తవృత్తి నటు నిర్దుష్టంబుఁ గావింప నం
తర్విద్యావిధవాభిరాములగు నాత్మారాములే కావలెన్. 194

చ. జలనిధినీర మెల్ల నొకసారిగఁ గ్రోలఁగవచ్చు, నాకులా
చలముల బంతులట్లు వెలుచన్ వినువీధికి మీటవచ్చు, ను
జ్జ్వలబడబాగ్నికీల లొకపట్టున మ్రింగఁగవచ్చుఁ గాని య
స్ఖలితగతిన్ మనంబు నరికట్టు టసాధ్య మదెంతవారికేన్. 195

చ. కడచినదానికై వగవఁ గాఁ దగ; దీవిషయప్రసక్తికిం
దడయక స్వస్తిఁ జెప్పి తొలుతం జలనాత్మకమౌ మనంబుపైఁ
గడు జతనంబుసేయఁదగుఁగాక, వశం బెటు గాకపోవు? నె
వ్వఁడు పొరపొచ్చెముల్ గనని వాఁడు? మనోధృతిమూల మన్నిటన్.

క. తనగౌరవంబుఁ దానే
యనయముఁ గాచికొనవలయు; నట్లైననె భూ
జనము తనకు గౌరవ మి
చ్చును; గీలక మిదియె; తెలియుచోఁ జెడఁ డెపుడున్. 197

చ. అని తలపోయుచుండఁ ద్రిదశాంగన తన్ముఖభంగిఁ జూచి వం
చన గురుతించినాఁ డితఁ డసాధ్యుఁడు గండము తప్ప; దెందుఁ బో
దు? నని భయంబు నమ్రతయుఁ దొందరపాటయి తత్పదంబులం
దు నొఱఁగఁబోయినం గదిమె దూరమటంచు భయంకరార్భటిన్.

తే. గుండియలు బ్రద్దలై పోయెఁ; గువలయాక్షి
కన్నుఁగవ ఘూర్ణమానమై కడ కచేత
నంపుఁ బ్రతిమయొ నాఁ జలనంబు మాని
నిలిచె భయసంభ్రమభ్రమాకులతఁ జిక్కి. 199

వ. అప్పు డప్పడఁతియవస్థం గాంచి, గాధిపుత్త్రుండు మెత్తంబడిన
చిత్తంబున నత్తలోదరిం గాంచి యిట్లనియె. 200

తే. పదము లంటినఁ జెఱుపంగం బాలుపడఁడు
గాధినందనుఁ డోమేనకావధూటి!
నీవలన మా కవజ్ఞయే నెగడుఁగాక
యభయ మిడితిమి నీకు భయం బిఁ కేల? 201

మ. అమరుల్ పంచిరి నిన్ను మామకతపోవ్యాఘాతముం గోరి; ని
క్కము, నీవా? పరతంత్ర; వే దెటు పొసంగం బోవునో యంచు భా
వ మెటున్నన్ హితబోధఁ జేసితివి; నీపైఁ దప్పు లేకుండఁ గా
ర్యము సాధించితి; విట్టిచో నిఁక వికారం బౌను నో రెత్తినన్.

మ. పరులం దూఱఁగ నేల? యింతకు మతిభ్రష్టుం డొకం డున్న నే
దర్గిఁ జేరుం దెరవాటుకాఁ; డిది యథార్థంబౌ; మనోవృత్తికిం
బొరపొచ్చెంబులు లేనినాఁడు మఱి యేమోసంబులుంగల్గ; వే
పఱి మాబుద్ధియె పూరి మేసిన; దిఁ కేలా వెన్కఁ జింతింపఁగన్?

మ. ఒకనాఁడా? యొకపక్షమా? యొక నెలా? యోహో దశాబ్దంబు లా
రక కామాంధుఁడనై గమించితి నహోరాత్రాపదేశంబునన్
వికలప్రజ్ఞుఁడ నైతిఁ; దొంటితపమా విధ్వంసమైపోయెఁ; బా
తకమా హెచ్చె; నిఁకెన్నినాళ్ళ కిది సాధ్యంబౌను బూరింపఁగన్.

చ. కడచినదానికై వగవఁగాఁదగ; దింతటనైన నేఁ గృతా
ర్థుఁడ నగుదున్ నినున్ విడిచి; తొయ్యలి! నీ విఁక నేఁగవచ్చు; నే

గడుసరి నయ్యు నీమొగ మెగాదిగఁజూచిన మెత్తవాటు చొ
ప్పడుఁ బదియేండ్లనుండి సహవాసముఁజేసినదోస మంగనా! 205

ఉ. కావున నీవు నిర్భయముగాఁ జనవచ్చును; దేవకోటిసం
భావనఁ జెందుభాగ్యమును బాటిలె; నింక నిమేషమేనియున్
నీ విట నిల్వఁగాఁ దగదు; నిక్కము నాహృదయాంతరంబు క్రో
ధావిలమౌనొ యేమొ? చనుమా యనుమానము మాని మానినీ!

వ. అని పలికిన నక్కామిని యేమియుం బలుకక గండంబు దప్పె
నని తలంచుచుఁ దొలంగఁబాఱి తనగర్భవాసంబునం గన్న
యన్నెత్తురుఁగందు తనకుం జంజాటం బగు నని యం దొక్క
విటపిచ్ఛాయయం దొకశిలాతలంబునం బెట్టి యీ చిన్నినిసుఁగు
విశ్వామిత్రమహర్షి తపోబలము కలిమి దైవరక్షిత యగుఁగాక
యని కన్నీరుఁ దుడిచికొనుచు యథేచ్ఛం జనియె; నంత నచటికి
స్నానార్థం బరుదెంచిన కణ్వమహర్షి శకుంత పరిపోషితయగు
నబ్బాలికకు శకుంతల యను నామం బిడి తన యాశ్రమంబునకుం
గొంపోయి పోషించె; నట్లామె దినదినప్రవర్ధమానయై దుష్యంత
మహీకాంతుం బెండ్లియాడి భరతుం డనుకొడుకుం గాంచె;
నతని యేలుబడినకాదే యీ దేశంబు భరతవర్షం బనియు, భారత
దేశం బనియుఁ బిలువఁ బడుచుండె; నది యట్లుండె, నట్లు
విరక్తుండై కౌశికుఁ డుత్తరపర్వతంబున కరిగి కౌశికీతీరంబున
నాశ్రమంబు నిర్మించి ఘోరంబగు తపంబు నారంభించె. 207

—, ఆశ్వాసాంతము ,—

మ. శ్రితవాంఛాఫలపూరణాఖిలజగజ్జేగీయమానప్రశ
స్తతరశ్రీకరుణాతరంగితకటాక్షా! లక్షితానన్యయో
గతపోధ్యాన పవిత్రమానిజనయోగక్షేమదక్షా! నిర
స్తతమఃప్రావరణప్రసాదితసమీక్షా దీక్షితాక్షిద్వయా! 208

మహాస్రగ్ధర :-

ప్రథనోన్మాద త్రిలోకీప్రతిభట నిధనప్రౌఢపాల స్త్రముఖో
న్మథనప్రావీణ్యఖేలా! మనసిజవిలసన్మంగళాకారలీలా!
కథనీయాధ్యాత్మవిద్యాగ్రహణపరిణతాఖండవిజ్ఞానలక్ష్య
ప్రథిత జ్యోతిస్స్వరూపా! ప్రబలశివధనుర్భంగరంగప్రతాపా!

క. నో నైవ ద్వీశ్వరసం
ధానం, ద్విర్నైవ భాషణం, నైవ ద్వి
ర్దాన మితి ధృతపరమకీ
ర్తీ నిర్వహణాగ్రగణ్య! సమధికపుణ్యా! 210

గద్యము

ఇది శ్రీరామచంద్ర కరుణావిభవ కవితానుభవ
శివార్యతనూభవ సుధీజనవిధేయ సుబ్ర
హ్మణ్యనామధేయ ప్రణీతంబైన
బ్రహ్మతేజోబలంబునందుఁ
జతుర్థాశ్వాసము.

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః.

# బ్రహ్మతేజోబలము

లేక

# విశ్వామిత్ర చరిత్రము

## పంచమాశ్వాసము

శ్రీమన్మిథిలేంద్రతనూ
జామానసకమలమిత్ర! సకలగుణపవి
త్రా! మంగళాకృతీ! వి
శ్వామిత్రమఖారి దేవవైరివిదారీ! 1

వ. దేవా! యవధరింపు మట్లు విశ్వామిత్రుండు తపం బొనరింప వత్సరసహస్రంబు కడచనిన సురాసురమహర్షిబృందంబు లాందోళనంబుఁ జెంది సర్వలోకపితామహుని సన్నిధికిం బోయి సాష్టాంగదండప్రణామంబు లాచరించి విశ్వామిత్రునుదంతం బంతయు విన్నవించి యిట్లనిరి. 2

చ. అతఁడు మహర్షిశబ్దమునకర్హతఁ గాంచెఁ దపోనిరూఢి న
ద్భుతముగ; నైన శంఖమునఁ బోయక తీర్థము గాదు గాన మీ
రతని ననుగ్రహించి, తప మాఁగువిధానము సేయకున్న నే
గతి నిలుచుం జరాచరజగత్సముదాయ మిఁకం? బితామహా! 3

వ. అని ప్రార్థింప నద్దేవుండు సర్వామరకోటియు మహర్షిసంఘం బులుం గొలువ హంసవాహనారూఢుండై విశ్వామిత్రాశ్రమం బునకుం జనుదెంచి వాత్సల్యపూరితంబుగా నిట్లనియె. 4

ఉ. ఆఁగు మిఁకన్ మహర్షితిలకా! భవదీయమహోగ్రదీక్ష కెం
తో గరుపాటె మేను; పరితుష్టి జనించె భవత్తపోబల

శ్రీగరిమన్; మహత్త్వము ఋషిప్రవరత్వము గాంచి తీవు వ
త్సా! గణనీయతావకసమర్థత కెందు బళే! బళే! యనన్. 5

తే. అనఁ గుశాన్వయమణి యంతరాత్మ ఖేద
మోదమధ్యస్థమై యొక్కమొగి నిమేష
కాల ముబ్బొంతలూఁగెఁ; దత్క్షణము లేచి
ఫాలమునఁ గేలుదోయిని గీలుకొలిపి. 6

మ. నిగమాంత స్తవనీయమూర్తి త్రిజగన్నిర్మాత సర్వేశుఁడో
భగవంతుండు మహర్షి శబ్దముఁ దపఃపారమ్యసంసిద్ధిచేఁ
దగ నార్జించితి వన్నచో నిఁకఁ గొఱంతల్ గల్గునే? నే ధ్రువం
బుగ ధన్యుండ జితేంద్రియుండఁ గద! మత్పుణ్యాతిరేకంబునన్. 7

శా. ఆమాటల్ విని మందహాసమున నయ్యంభోజసంభూతి తా
నీమాత్రంబున కే జితేంద్రియత నీ కెన్నండు సిద్ధించు నో
యీ? మానీంద్రకులావతంస! యిటులే యింకన్ బ్రయత్నింపు మం
చామీఁదం ద్రిదశేంద్రసంయుతముగా నంతర్హితుం డౌటయున్. 8

వ. అంతం గొంతవడి యగ్గాధినందనుండు డెందంబునం గొందలంబంది
పొంపిరివోవు ధైర్యంబునం దెంపుసేసి, మరల ఘోరంబగు తపం
బునకుం బ్రారంభించి యూర్ధ్వబాహుండును, నిరాలంబుండును,
వాయుభక్షుండును, జితేంద్రియుండును నై గ్రీష్మకాలంబునం
బంచాగ్నిమధ్యస్థుండును, వర్షాకాలంబున నాకాశసంశ్రయుండును,
శిశిరంబున సలిలస్థాయియు నై రేయింబవల్లు వేయిసంవత్సరంబులు
సర్వభూతభయంకరంబుగ ఘోరతపం బాచరించె; నంత బృందా
రకు లంద రాందోళనంబునం బురందరు నంతికంబునకుం బోయి
యా దందడిం దెల్పిన నింద్రుం డప్సరోగణంబున కెల్ల మేలు
బంతియగు రంభ నాహ్వానించి యిట్లనియె. 9

తే. అప్సరఃకాంతలందు నీ కగ్రపూజ
నాట్యమున, గానమునను, విన్నాణమునను;
నీకు సరి గాన మెందు నీ నీటుఁ గనిన
మనసు నిలుపంగఁ బరమేశ్వరునకుఁ దరమె? 10

శా. నీతోఁ గావలె నొక్క కార్యము; మరున్నీరేజపత్రాక్షులం
దేతత్కార్యముఁ జక్కఁబెట్టఁ గలవా రెవ్వారునున్ లేరు; లో
కాతీతంబగు ప్రజ్ఞ యేర్పడఁగ నీయాధిక్యమున్ జూపి ప్ర
ఖ్యాతిం జెందుము; దేవకార్య మిది; రంభా! సంభృతోత్సాహవై.

మ. అలగాధేయుఁ డఖండదీక్షఁ గొని బ్రహ్మత్వంబు సాధింప ను
జ్జ్వలతేజస్స్ఫురణన్ బ్రచండతపమున్ సాగించుచున్నాఁడు; లో
కులఁ జీకాకొనరించె నాతని తపోఘోరానలజ్వాల; నీ
తలపై నున్నది భారమంతయును గాంతా! సుంత యోజింపుమా.

మ. అనినం గుండెలు జల్లుమం చనియె నయ్యంభోజపత్రాక్షి; కా
ననమున్ వెల్వెలఁబాతె, మార్వలుకకుండం గొంతసేపుండి య
వ్వనితారత్నము వల్కెఁ గేల్మోగిచి దేవా! గాధిసూనుం డట
న్నను గాలానలకీల; వానిఁ జెనకన్ మాబోంట్లకున్ శక్యమే? 13

శా. ఎట్లో గండము దప్పె మేనకకు నాఁ డేపుణ్యమో! యిన్ని చీ
వాట్లం బెట్టి పొకాలు మం చనియె; దుర్వాసుం డతం; డిప్పు డా
పాట్లేమాత్రము సాగ; వన్నియు గ్రహింపంగల్గె; శాపంబు నా
పట్లం, బంపినవారిపట్ల నిఁకఁ జప్పట్లుం దటస్థం బగున్. 14

ఉ. ఎంతటివారి కేని ఘటియించుఁ బ్రమాద మొకప్డు; మేనకా
కాంత కదృష్ట మున్న; దటుగానఁ దదీయవిలాసముగ్ధుఁడై
గంతులు వైచెఁ గౌశికుఁడు; క్రమ్మఱఁ గన్నులు విచ్చి దోస మా
ద్యంత మెఱింగియుం గనలఁ డప్పటినేస్తము నాత్మ నెంచుచున్. 15

చ. రమణులగాలియే పనికిరా దని యెంచి, విరక్తిఁ బెంచి, తీ
క్ష్ణముగఁ దపంబొనర్చెదు ప్రచండ ని మోహితుఁ జేయుటన్న శ
క్యమగునె? చూచిచూచి ప్రళయాగ్నికణంబును గేలఁ దాల్పఁజి
త్తమునఁ దలంతు రెవ్వరు?; పదంపడి జీవిత మాసయుండదే? 16

వ. అనినం బురుహూతుం డత్తరుణీమణిం గాంచి యనునయించి
యిట్లనియె. 17

మ. హృదయగ్రాహులు కోకిలల్, సువిలసచ్ఛీగంధవాహోర్మికల్,
మది కాహ్లాదముఁగొల్పుమాధవుఁడు. భామా! నేనుఁ, గందర్పుఁడున్
బదిలంబౌకుసుమాస్త్రసంచయముతోఁ బార్శ్వంబులందుండమే?
పద, గాధేయుఁడు 'కింకరోఽహ' మని నీపాదంబులన్ వ్రాలఁడే?

మ. త్రిజగన్మోహనమై, విలాసలహరీశ్రీమత్సుధాశీకర
వ్రజమై, యంగజరాగదీపనకళాపారప్రభావైకభే
షజమై, భావభవాధిరాజ్యసమధిష్ఠానం బహో! నీదురూ;
పజరుద్రాదుల ముగ్ధులన్ సలుపదే? యంభోజపత్రేక్షణా! 19

క. ధ్వంసమగు నతనితప మో
హంసగమన! 'బలవదింద్రియగ్రామో వి
ద్వాంస మపి కర్షతి' యను ప్ర
శంస వినవె? యెవ్వఁ డాఁగు స్మరశరనిహతిన్ ? 20

క. అని సురపతి యొత్తిడి సే
సిన నది మార్గ్యలుక లేక చిత్త మనియె; ముం
దున నూయి వెనుక గోయియుఁ
దనరెఁ; బరాధీనజీవితం బిట్టిద గా. 21

వ. అంత నయ్యప్సరఃకాంత బహుగుణభాసురం బగు వేసంబు
గైసేసి వందనపురస్సరంబుగాఁ బురందరుననుమతిం గోరి యాయ

_త్తం_బై గాధినందనునాశ్రమంబునకుం బయనించె; నంత వసంతాగమం బగుటయు లేమావిచివుళ్లు మెసవి, నిసర్గమనోహరంబగు పంచమస్వరంబున నసమానగానమాధురి వెలయించు పరపుష్టచయంబును, పలుకు పలుకున ముద్దు లొలుక నమృతరసంబుఁ జిలుకు చిలుక గొరవంక కదుపులును – వీనులవిందు సేయ, నవకిసలయప్రసవఫలభరితంబులైన నానావిధ తరులతాగుల్మంబులు కనుల పండువు వెలయింపఁ, గౌశికీనిర్ఝరతరంగశీకరనికరశిశిరీకృతంబులై, విమలకమలకల్హారసౌరభంబుల మోచికొని యల్లనల్లన వీతెంచు పిల్లగాడ్పు లుల్లంబుఁ బల్లవింపఁ జేయఁ బుండ్రేక్షు కోదండంబు నెక్కుపెట్టి యసమశరుండు కుసుమవిసరమరందపిపాసాయాతాయాతమత్తషట్పదనికరఝుంకారచ్ఛలంబున మౌర్వీటంకారం బెలయింప, నిట్టిసమయం బెట్టి కట్టిప్రౌఢతపసికైన మదనోన్మాదంబు రెట్టింపం బట్టు గాన నీక జాగు సేయకు మని మేఘవాహనుండు త్వర సేయ నయ్యచ్చరమచ్చెకంటి యమ్మునీంద్రుని సమ్ముఖమ్మున నిలిచి సకలజనానందకరంబుగ నృత్తగీతాభినయంబుల నారంభించె నంత. 22

మ. సకలప్రాణి మనఃప్రమోద మధురస్థాయిన్ విజృంభించె నా
ట్యకళాగానసుధాప్రవాహములు; సూనాస్త్రప్రయుక్తాశుగ
ప్రకరం బుత్కటమయ్యె; సంచలనభావం బేర్పడెన్ మౌని; క
ట్టై కనుల్ విచ్చె నిదేమి హేతు? వని గుండెల్ వ్రీలిపో రంభకున్.

మ. పరికించెన్ సురసుందరిన్; బళిబళా! పౌరందరీమాయ యం
చరుణాంశుచ్ఛవి మోమునం దొనరఁ గీలాభీలకాలానల
స్ఫురణంబుం దలఁ దన్నుచున్ గనుల నిప్పుల్ కుప్పలై రాలఁగాఁ
బరమక్రోధ మెలర్పఁ బల్కె విచలత్పర్జన్యగర్జార్భటిన్. 24

—॥ విశ్వామిత్రుండు తపంబు చెఱుపవచ్చిన రంభను శపించుట ॥—

శా. సంభావించిన మాత్ర దేవతలకున్ సాయుంబుఁ గావింప సా
హంభావంబుగ నేఁగుదెంచితివె? రంభా! దంభ మేపారఁగా;
జంభారిప్రముఖుల్ తలల్ దిరిగినన్ శాంతాత్ముఁ గావింప న
య్యంభోజాసనుఁ దోడితెచ్చినది లేదా? బోధ యెవ్వారికిన్? 25

మ. ఎదిరిం దన్ను నెఱుంగఁ దెల్పి తఱుఁగై యెవ్వాఁడో నిన్నంపెఁగా;
కిది కాలానలకీల యం చెఱుఁగవే? యీ పాపకృత్యంబు నీ
మది నూహించినదానికిన్ ఫలము పొమ్మా యిద్ది; యత్యంతశో
చ్యదశన్ వర్షసహస్రముల్ నిలు మిటన్ శైలీభవన్మూర్తితోన్.

చ. అనినఁ బదంబులం బడి మహాత్మ! సురేంద్రున కేను దెల్పికొం
టిని భవదీయశక్తిని; గణింప కతండు బలాత్కరించి న
న్ననిపె; నిఁకేమి సేయుఁ; గరుణాభరణా! శరణంబు వేఁడితిన్;
ననుఁ గరుణింపు మన్న మునినాథుఁడు వల్కె దయార్ద్రబుద్ధియై. 27

చ. 'పరమతపస్వియైన యొకబ్రాహ్మణుచే నగు శాపమోక్షణం
బిరవుగ, నంచుఁ బల్కెఁ; దరవీక్షణ తత్క్షణ మద్రియై భయం
కరముగ నిల్చె; నింద్రుఁ డది కన్గొని కాలికి బుద్ధి సెప్పె; స
త్వరముగఁ జిత్తగించె సుమధన్వి పలాయనచాకచక్యమున్. 28

తే. అంత మునికాంతుఁ డమితప్రశాంత నిర్మ
లాంతరంగుఁడై యప్సరఃకాంత దగును
దంత మంతయుఁ జింతించి సంతసించె;
నంతరాయం బిది యటంచు నాత్మ నెంచి. 29

ఆ. కామమునను మేనకకుఁ జిక్కువడితి; నీ
యాఁడుగాలి సోకఁగూడ దనుచు

నలిగి రంభఁ దిట్టి; తది ముల్లు వెతికి కొ
ట్టడఁచుటయ్యె; నియతిఁ గడువఁదరమె? 30

ఆ. క్రోధమునను బరులకును హాని గలిగించుఁ
గామమునను దా నొకండె చెడును;
క్రోధ మొదవెనేని గురులనైనను జంపుఁ
గ్రోధమునకుఁ గాని ఘోర మున్నె? 31

మ. బలవంతంబుగఁ బంపినట్టి సురరాట్ప్రద్యుమ్ను లుండంగ నే
నల రంభన్ శపియింపనేల? నిదె యుక్తాయుక్తముల్ లేమి; క
న్నులకుం గన్పడినంతమాత్రమున మన్యుజ్వాల దీపించె వె
గ్గలమై; వెంటనె క్రుమ్మరించితి మహోగ్రస్ఫూర్తి నారంభపై.

శా. కామంబుం జొరనీయరా దని ప్రతీకారంబుఁ గావింపఁ బోఁ
బ్రామెం గ్రోధ; మిఁకేమి లాభము? చలింపంబోని లక్ష్యం బిటం
బ్రాముఖ్యం; బది గాన కిప్పగిది రంభం దిట్టి నేఁ గన్న మే
లేమీ? కోపమె పాపమూల; మదె నన్నేఁచున్ సదా శత్రువై.

సీ. అల వసిష్ఠాత్మజాతుల శపించిననాఁటి
ఘోరకృత్యంబునఁ గొంతతపము
సురధామమునకు నుద్ధురధాటినైమెఁ ద్రిశం
కునిఁ బంపినప్పుడు కొంతతపము
స్వర్గంబునకుఁ బ్రతిస్వర్గంబు సృజియింపఁ
బంతమూనినదానఁ గొంతతపముఁ
దనయులపై గుబాలున శాపదావంబుఁ
గ్రుమ్మరించినదానఁ గొంతతపము

తే. రంభకై కొంతతపము వ్యర్థముగఁ బోయెఁ
జెల్లరే! త్రావనేరని పిల్లి యొలుకఁ

బోసికొనె నన్నసామెంత పొసఁగె నాకు;
నిన్నిటికి మూల మీకోపమే నిజంబు. 34

మ. అరిషడ్వర్గముఁ జిక్కఁ ద్రొక్కఁగల ధీరాత్ముం డెవం డాతఁడే
పరమాత్ముం డనవచ్చు; నింద్రియములన్ బంధించి వైరాగ్యవి
స్ఫురణం దాల్చిన నెట్టి విఘ్నములకుం జోటుండ; దీతెల్వి యం
దఱికిం గల్గునెకాని, యాచరణ మన్నం దుర్ఘటం బేరికిన్. 35

స్రగ్ధర. ఐనం గానిమ్ము; నాయుద్యమము విడువ; నీ
యంతరాయంబు లెన్నే
రానీ, యేమైనఁగానీ, ప్రబలతరధృతి
ప్రగ్రహం బూని బల్మిన్
నే నీదుర్వారదుష్టేంద్రియతురగములన్
నిగ్రహింతున్; గ్రహింతు
న్మౌనం బత్యుగ్రదీక్ష న్గదలను మెదల
న్స్థాణువుంబోలె నిల్తున్. 36

స్రగ్ధర. వేయేలా! శ్వాసమేనిన్ విడువఁ గుడువ; ని
ర్భీతి వేయేండ్లుగానీ
నా యంతర్ధాతు విల్లే నలిగి తునకు సాం
తంబు శోషించి పోనీ
పాయన్ బ్రహ్మత్వసిద్ధిం బడయుదనుక దు
ర్వారఘోరోద్యమంబున్;
నా యీ యత్యుగ్రదీక్ష న్క్షయమును గన వె
న్నాళ్ళకే నాత్మశక్తుల్. 37

వ. అని యిట్లు శపథంబుఁ గావించి, యుత్తరదిగ్భాగంబు వీడి ప్రాగ్దిశాభాగంబునకుం బోయి, విజితేంద్రియుండై మౌనంబుఁ దాల్చి నిద్రాహారంబులు మాని యుచ్ఛ్వాసనిశ్వాసంబులు లేక

శాష్ఠభూతుండై యొక్క వేయిసంవత్సరంబులు ఘోరతపోనిష్ఠం దాల్చి యాత్రవతదీక్షం బూర్తిఁ గావించి భుజింపం బూనియుండ.

క. సురనాథుఁ డది యెఱింగి భూ
సురవేషముఁ దాల్చి వచ్చి సొరుఁగుచు నన్నా
తురుఁడై యడుగ, నొసంగెన్
స్థిరమతి నేమేని యనక సిద్ధాన్నంబున్. 39

క. ఒక మెదుకేనియు మిగిలిం
పక యూడ్చి యొసంగె న త్తపస్వి; కపటవి
ప్రకులావతంస మట్టె త
టుకునం గడిఁ జేసికొని గుటుకునన్ మ్రింగెన్. 40

వ. ఇట్లొక్క మెదుకేనియుం జిక్కకుండ మెక్కి యక్కపట భూసురుండు యథేచ్ఛం జనియె; నయ్యాది శతమన్యుకల్పితంబైన మాయాప్రయోగం బని యెఱింగియు నమ్మహర్షి యంతరంగం బున వీసం బేని దోసంబున కవకాశంబు గలుగనీయఁడయ్యె; నంత నక్కుశనాభపౌత్రుండు మౌనంబున నవ్విప్రు నేమే ననక భుజింపకయే తత్క్షణంబున మరలఁ దపంబున కారంభించి నిరుచ్ఛ్వాసితుండును. నిరశనవ్రతండును, నిర్మలాంతరంగుండును, నిర్జితేంద్రియుండును నై యెన్నియేనియు విఘ్నంబు లాపాదించినం జలింపక నిలింపు లచ్చెరువంద వత్సరసహస్రం బేకలక్ష్యం బూని ఘోరతపం బాచరించె. 41

శా. ఆ మౌనీంద్రకులావతంసము సముద్యద్రీతి శోభిల్లె ను
ద్దామం బౌతతదుర్నిరీక్ష్యము దురాధర్షస్ఫురద్భాసమై;
ధూమంబుల్ వెడలెం దదీయశిరమందున్; బ్రజ్వలజ్జ్వాలికా
భీమంబై యఖిలప్రపంచమున వ్యాపించెం దపస్స్ఫూర్తియున్. 42

మ. సుర లాందోళనఁ జెంది; రెల్లజగముల్ క్షోభిల్లెఁ; దద్భూరిభీ
కర దుర్ధర్ష తపశ్శిఖీర్ష సముదగ్రంబయ్యె నంతంతకున్;
బరిణామస్ఫురణన్ గ్రమక్రమమునన్ భాసిల్లెఁ దన్నిష్ఠ; భూ
సుర దేవర్షి సురాసురుల్ శరణటంచుం జేరి రబ్జాసనున్. 43

వ. ఇట్లు సురాసురబ్రహ్మర్షిసంఘంబు లప్పరమేష్ఠిచరణసరసిజంబు
లకుం బ్రణమిల్లి. 44

ఉ. ఆ కుశనాథపౌత్రుని మహత్తరసాహసచర్య కేము చీఁ
కాకయినార; మెందుఁగతిఁ గానము దేవ! జగచ్ఛరణ్య! యి
ట్లే కనుమూసి మీర లితఁ డెంతని లక్ష్యము సేయకున్న నీ
లోకము లన్నియున్ క్షణములోపల సర్వసమాప్తిఁ జెందెడున్.

సీ. దాంతికుండలరీతి దొరలుచున్నవి కొండ,
లుర్వి యిట్టట్టు లుఱ్ఱూఁత లూఁగ
నగ్నిలో గ్రచ్చకాయలు నాఁ బగులుచుండెఁ
బెఠిలు పెఠిల్లునఁ బెద్దగుండ్లు
పుటములోపల నిడ్డ బూడిదగుమ్మడిఁ
బోలె గ్రమ్గుచు నుండె భూతకోటి
మిడిమెండపొల్పు గ్రమ్మినయట్టి మంచుచా
ద్పున నింకఁబాఱె సముద్రజలము

తే. లాడుచున్నవి పెనుమ్రాఁకు లాకసమున
గాలిపటములగతి సుడిగాడ్పు లడరఁ;
దూర్పుఁ బడమరయును మదిఁ దోఁపకుండెఁ;
గళ్ళలోపహతం బయ్యెఁగద జగంబు. 46

శా. సమ్యాగ్భఙం బయినట్టు లున్నది ప్రపంచం బంతయుం; జీఁకటుల్
గ్రమ్మెన్ రోదసి; నొక్కవస్తువును వ్యక్తం బౌటలే; దప్రకా

శమ్మయ్యెన్ రవిబింబ; మే మనను? విశ్వామిత్రు తేజం బమో
ఘ మ్మౌరా! యతఁ డగ్నికల్పుఁ డకళంకబ్రహ్మతేజమ్మునన్.

శా. ఎన్నో రీతులఁ బోరి చూచితిమి; మోహింపండు, ద్వేషింపఁ, డే
పన్నాగంబునకుం జలింపఁడు, తలంపం డెట్టి యాద్ధత్య; మా
త్మన్నిర్లిప్త మొనర్చె; దోస మణుమాత్రం బేనియున్ లేదు; సం
పన్నం బయ్యె మనంబు; శాంతము సునిష్పన్నం బవిచ్ఛిన్నమున్.

మ. తనయిష్టార్థము సిద్ధిగానియెడఁ దథ్యం బీ ప్రపంచంబు నొ
క్కనిమేషంబున బుగ్గిసేయును మహోగ్రంబౌ తపోజ్వాలఁ; గా
వున ముందే త్రిజగత్ప్రభుత్వమయినన్ బోనిండు, తాఁ గోరినాఁ
డన నిస్సంశయ మిచ్చితీఱవలె; లేదా బల్ప్రమాదం బగున్. 49

మ. తడ విం కేటికి? బ్రాహ్మ్యముం బడయునందాఁకం దపోనిష్ఠ మా
నఁడు గాధేయుఁ; డదే ప్రపంచమునకున్ బాధావహం; బాతఁ డొ
క్కఁడు సంతృప్తిఁగనం జగంబులకు సౌఖ్యంబబ్బు;మీాయంద పా
ల్పడె నీభారము నీట ముంచినను బాలన్ముంచినన్ బద్మజా! 50

వ. కావున మహాతపఃప్రభావాభిభూత సకలసురాసురప్రముఖ నిఖిల చరాచరప్రాణి సముదయుండును బరమపవిత్రుండును నగు నా భగవానుండు కోరినవరంబు లొసంగి యమ్మహాత్ముని సుప్రసన్నుం జేయవే యని ప్రార్థింపఁ జతురాననుండు వారలతో నిట్లనియె. 51

ఉ. నిక్కమ మీారు వల్కిన; దనింద్యచరిత్రుఁడు; వీని జన్మమం
దొక్క రహస్య మున్న; దదియున్ వినిపించెద; దైవనిర్ణయం
బిక్కథ యంతయున్ నడచు; టీతఁడు క్షత్రియుఁడై జనించి స
మ్యక్కృతమైనబ్రాహ్మ్యముమహత్తర తేజముఁదాల్చిపోల్చెడున్

వ. అద్దాని మూలంబు వివరించెద వినుం డని విరించి యిట్లనియె. 53

—, విశ్వామిత్రుని జన్మప్రకారము ,—

తే. సత్యధర్మవ్రతుండు రాజర్షి కుశుఁ డ
నంగ నాకు జనించె జ్ఞాననిధి యొకఁడు;
వాని కొమరుండు కుశనాభుఁ; డా నరేంద్రు
కొడుకు గుణశాలి కులదీపకుండు గాధి. 54

వ. అగ్గాధిరాజేంద్రుండు సంతతి లేక చింతించి భార్యాసహితుండై యనేకవ్రతంబు లాచరించినం గొంతకాలంబునకు నఖిలలోకమనోహరరూపరేఖావిలాసలావణ్యనిధానంబైన యొక్క కన్యారత్నం బుదయించి యబ్బాలికామణి దినదినప్రవర్ధమాన యగుచుండె; నంత. 55

సీ. అతిలోకసుందరాకృతి కామినీతనూ
సృష్టిక్రియైకమాతృక యనంగ
జనమానసము లాఁచికొన ననంగుఁ డొనర్చు
నసమానమోహనయంత్ర మనఁగ
ఘనతపోనిధులకై నను భ్రాంతిఁ గొల్పెడు
లావణ్యరంగస్థలం బనంగ
సకలలోకానందసంధాయకంబగు
నిరుపమశృంగారనిలయ మనఁగఁ

తే. దనరి శైశవ యౌవనాంతరమనోజ్ఞ
మూర్తియగు సత్యవతి యను ముద్దుగుమ్మ
నతి ఋచీకుండు గోరె బ్రహ్మర్షి తనకు
భార్యగా నిమ్మటంచు భూపాలతిలకు. 56

తే. ఆ మునీంద్రుని మాటల కవనినాథు
నంతరాత్మ దురంతచింతామయ ప్ర
ఘాత సంపాత జాత బాధాతిరేక
విహ్వలంబయి తలపోసె వివిధగతుల. 57

శా. ఎన్నో నోములు నోచి కంటి మెటులో యీబాల; సర్వార్థసం
పన్నంబై యనురూపమై వెలయు సంబంధంబుఁ బ్రాపించునం
చెన్నో రీతుల నాసఁ జెందితిమి; నేఁ డీమౌనివాక్యంబు గా
దన్నన్ శాప మొసంగు; బ్రాహ్మణున కీయన్ బిడ్డకున్ గష్టమౌ.

సీ. లలితకాంచనదుకూలముల నైన ధరియించు
నా కూనకా యట్టి నారచీర ?
లమలనివాతసౌధములలో వసియించు
బాలకా యాపర్ణశాలవసతి ?
అమృతరసోపమాహారముల్ చవిచూచు
మాయమ్మకా యట్టి కాయ కసరు ?
లనుపమభోగభాగ్యముల చేఁ దులఁదూఁగు
పాపకా నిఱుపేదకాఁపురంబు ?

తే. దాసికాసముదయము సంతతముఁ గొలువ
నిత్యసుఖ ముండు బిడ్డకా నిఖలదుఃఖ
మూలమగు ఘోరకాంతారమున వసించు
నట్టిదౌర్భాగ్య? మెటు దప్పు నిట్టి బెడఁద? 59

వ. అని చింతించి యెట్టకేల కొక్కయాలోచన పొడసూపుటయు
నిట్లని చింతించె. 60

తే. అలవి గానట్టి శుల్కంబు నడిగి తనకుఁ
దాన విరమించి వచ్చినదారిఁ బట్టు

నట్టిచందంబుఁ గావింతు నని తలంచి
కరయుగంబును మోడ్చి యిక్కరణిఁ బల్కె. 61

మ. మహనీయుల్ మిముబోంట్లు కన్నెనడుగన్ మా కింతకం టెన్ శుభా
వహ మున్నే? మఱియొక్కచిక్కు గల దీ వంశంబునం జాల దు
స్సహమై; పెక్కుతరాలనుండి యొకయాచారంబు; మీ రేమి యా
గ్రహముం జెందెదరో యిదెక్కడి విపర్యాసం బటం చెంచుచున్!

క. వినిపించుట కే జంకెద
ననఘా! చెవి యొకటి నల్లనై మిగిలిన దె
ల్లను దెల్లనైన వేయి జ
వనాశ్వముల శుల్కమీయవలయు మునీంద్రా! 63

మ. ఇది యిందున్నవిశేష; మింక మఱి మీ రేమందురో? చూడుఁ; డి
య్యది రారాజుల కేయశక్య మగు; మీరా? బ్రాహ్మణుల్; మాకుఁద
ప్ప దెటుల్ వంశపరంపరానుగతమై పాటించు మర్యాద; మీ
రది సాధించితి రేని గన్నె నిడఁగా నభ్యంతరం బున్న దే? 64

వ. అనిన బ్రహర్షి చంద్రుండు మందస్మితసుందరంబుగా నిట్లనియె 65

మ. అది మీ వంశపరంపరానుగతమా నాచారమే యైన న
య్యది మా కున్నను, లేకపోయినను గన్యాశుల్కముం దెచ్చి యి
చ్చెద; మమ్మాటికి నిక్క మింత; యిఁక నిశ్చింతంబుగాఁ గన్య ని
చ్చెదె? నా, మీ కది సిద్ధమైన నిది నాచే నున్న కృత్యంబె గా! 66

వ. అనిన నరేంద్రునకు మునీంద్రుం డిట్లనియె. 67

శా. మీ రాజన్యుల కంద దియ్యది; నిజంబే కాని బ్రాహ్మ్యంబులో
సారం బించుక చూతువా? మఱి; విషజ్వాలోద్యమద్ఘోరఫూ
త్కారోద్యత్ఫణిరాట్ఫణాగ్రముల రత్నా లూడ్చి యిమ్మందువా?
ధీరత్వమ్మున రుద్రఫాలతలచాంద్రీ రేఖఁ దెమ్మందువా? 68

వ. అనిన రాజేంద్రుండు భయసంవిగ్నహృదయుండై మహాత్మా! లోకసాధారణంబుగా బ్రాహ్మణుల కీ శుల్కం బసాధ్యం బంటిఁ గాని మహనీయ బహుతర తపోద్రవిణ సంపన్నులైన భవాదృశుల గుఱించి పల్కినమాట గాదు, క్షమింపుం; డని ప్రార్థింప న త్తపస్వి సుప్రసన్నమనస్కుం డై నీ వడిగిన యుంకువ నిశ్శంకంబుగాఁ దెచ్చియిచ్చెద; జంకుఁ గొంకు లేక యది గైకొని కన్నె నిమ్మని పల్కి యచ్చోటు వాసిపోయి సముద్రంబులోన మునింగి వరుణ పురంబు సొత్తెంచి యద్దేవునివలన నుచితసత్కారంబులంబడసి తన యుదంతం బెఱింగించి యసితైకకర్ణంబులైన వేయి సితవర్ణ జవనాశ్వంబులు గావలయు ననిన నద్దేవప్రవరుండు. 69

ఉ. ఎచ్చట నెట్టివేళ భవదీప్సితసిద్ధినిఁ గోరుకొందురో
యచ్చట నాక్షణంబ యవి యన్నియు నీకడ కేఁగుదెంచు ను
ద్యచ్చరితా! యటం చన రయంబునఁ జేరె మహోత్సవంబు లో
నచ్చువడన్ మహోదయపురాంతికసీమకు గంగ చెంగటన్. 70

వ. ఇట్లు గాధినరపాలు రాజధానియగు మహోదయపురంబు చెంగటం బ్రవహించు గంగానదికిం జని. 71

తే. ఆ స్రవంతిఁ గృతస్నానుఁ డగుచు నాచ
మించి తలపోసె జవనాశ్వసంచయంబుఁ;
దత్క్షణం బవి తండోపతండములుగ
వచ్చె మునినాథుచెంత కవ్వారి గాఁగ. 72

ఉ. అచ్చెరువందె నచ్చటి మహాజన మంతయు; నింతదాఁక ము
న్నెచ్చట డాఁగియుండెనివి? యెట్లిపు డిచ్చటి కేఁగుదెంచె?; బల్
ముచ్చట యయ్యె; నిన్నిహయముల్ సమరూపము లంచు గుంపులై
వచ్చుచుఁ బోవుచో నిసుక వైచిన రాల దహర్నిశంబులున్. 73

వ. అంత మునీంద్రుండు నరేంద్రునకు నిజేప్సితంబైన శుల్కంబును సిద్ధపఱచితి నని తెలుపం బనిచిన రాజేంద్రుం డయ్యాదంతం బెఱింగి యద్భుతాశ్చర్యంబులు మనంబునం బెనంగొన నిట్లని తలంచె. 74

ఉ. ఇంత సమర్థుఁ డం చెఱుఁగ; నిమ్మునికన్నెను గోర నామె జ
న్మాంతరపుణ్య మెట్టిదొకదా!, ఘనతం గొనియాడుకొంచు భూ
కాంతులు విఱ్ఱవీఁగుకరు క్షాత్రము క్షాత్ర మటంచుఁ; దద్బలం
బంతయుఁ బోల దీయనతపోగ్రశతాంశ సహస్రభాగమేన్. 75

వ. అని తలంచి నిటలతటఘటితాంజలిపుటుండై దేవా! మీ సామర్థ్యం బెఱుంగ నైతి క్షమింపవే యని తత్క్షణంబునం బెద్దల రావించి శుభలగ్నంబు నిర్ణయించి తన యనుంగుఁగూతు నాయన కొసంగి మహావైభవంబుగ వివాహం బొనరించె; నిం దొక్క వైచిత్ర్యంబు గలదు. 76

శా. బంగారంపు సలాకఁ బోని తనయన్ బాణిగ్రహార్థంబుగా
సింగారించి యఖండవైభవముతోఁ జేకూర్చెఁ గా కేమి? య
ర్ధాంగీకారమ యయ్యె నల్లునకుఁ; గాదా? యల్లుఁ డన్ వాని క
ర్ధాంగీకారమ కొంతయంత దొరబిడ్డైనన్ నిజం బారయన్. 77

వ. మఱియు నబ్బాలారత్నంబు నమ్మునీంద్రునియెడ భయభక్తివినయవిధేయతలు సెలంగ మెలంగుచుఁ బెక్కుకాలంబు కాఁపురంబు సలిపి, పతివెంట సశరీరస్వర్గగమనం బాచరించె; లోకోపకారార్థంబుగఁ గౌశికి యనుపేరఁ బుణ్యస్రవంతియై హిమగిరిప్రాంతంబునం బ్రవహించు; నక్కారణంబుననే విశ్వామిత్రుండు సోదరప్రేమం బాయఁజాలక చాలకాలంబు తత్తీరంబునం దపం బొనర్చె; నది యట్లుండె; ఋచీకమహర్షి యట్లు వివాహంబాడి

చాలకాలంబు శ్వశురగృహంబున భార్యయుం దాను నిరుపమాన భోగభాగ్యంబు లనుభవించుచు నానందంబునం గాలంబుఁ గడపుచు నొక్కనాఁడు భార్యయగు సత్యవతిం గని యిట్లనియె. 78

క. నావంటిసుతుని మహితత
పోవిభవునిఁ బడయు వాంఛ వొడమె; నబల! నీ
వే వచియించు విధానముఁ
గావించితి వేని వంశకరుఁ డుదయించున్. 79

వ. అనిన నమ్ముద్దరాలు తద్దయుం బ్రియంబునం దల్లియొద్దకుం జని తన మనోహరుని యనుమతిం దెల్పిన నామె పట్టరాని సంతోషంబున నింతకన్న భాగ్యంబు గలదే! యని తన యనుంగుఁ గూఁతుం గౌఁగిఁటం జేర్చి యిట్లనియె. 80

ఉ. అక్కరో! నీదుపెన్మిటి యనంతతపోమహిమాస్పదుండు; ని
న్నెక్కుడుఁ బ్రేమఁ జూచు; నెపు డేనియు నీవచనంబుఁ గాదనం;
డక్కట! నాకు నొక్కకొడుకైనను లేఁడు గదమ్మ! యెట్టులే
నొక్కకులాంకురంబు దయయుంచి యొసంగు మటంచుఁ జెప్పవే.

వ. అనినఁ దల్లిమాటకు వల్లెయని యప్పల్లవపాణి తనవల్లభుం జేర నరిగి తచ్చరణసరసిజంబులకుం బ్రణమిల్లి సవినయ మనోహరంబుగా నిట్లని విన్నవించె. 82

క. ఆ స్త్రీకుల కెవరి కేనిఁ బ్ర
భూ! స్తవనీయంబకద 'యపుత్రస్య గతి
ర్నాస్తి' యనుసూక్తి?; మీరై
ప్రస్తావనఁ జేసితిరి యపారకృపాబ్ధీ! 83

క. మాయమ్మ సుతులు లే రని
పాయని వెనువగలఁ గనులు వాయఁగ నేడ్చున్;
నాయెడ దయగల దేనిన్
మాయిరువుర కిందు లోకమాన్యుల సుతులన్. 84

తే. నావుడు మునీంద్రుఁ డను నెలనాఁగ! దీని
కింత బ్రతిమాలవలయునే? యెన్నఁడేని
నిన్నుఁ జుల్కనఁ జేసితినే? త్వదీప్సి
తము? ఫలించుట కొక యుపాయము ఘటింతు. 85

వ. మీరు ఋతుస్నాత లైననాఁ డవ్విధానంబు సవరింపవలయు నని వచించిన వా రందులకై ప్రతీక్షించుచుండ దైవవశంబున నేక కాలంబున నిరువురు ఋతుస్నాతలై; రంత నాబ్రహ్మర్షి చరుద్వయం బొనరించి భార్యం గాంచి నీ వౌదుంబరంబును, మీయమ్మ యశ్వత్థవృక్షంబును గాఁగిలింపవలయు; నే నిచ్చిన చరువుల నిది నీవును, నియ్యది మీయమ్మయు భుజింపవలయు; నీకు దివ్యబ్రహ్మ వర్చస్వియగు కుమారుం డుదయించు, మీతల్లికి మహోగ్రక్షాత్ర తేజస్వియగు తనయుం డుదయించు; నని చెప్పిన నమ్మునియను మతి నాచరించి రంత. 86

తే. దైవవశమున గడుఁ బ్రమాదంబు వొడమి
ద్రుమపరిష్వంగ - చరుభక్షణముల వినిమ
యం బొదవె; నందువలనఁ దదనుగుణంబుఁ
గాఁగ గర్భంబు లయ్యె నక్కాంతలకును. 87

వ. అంతఁ గొంత కాలంబునకు దివ్యజ్ఞానసంపన్నుండగు నా ఋచీక మునీంద్రుండు తద్వ్యత్యయం బెఱింగి యత్యంతంబుఁ జింతించి సత్యవతిం గాంచి యిట్లనియె. 88

శా. వ్యత్యాసం బొనరించినారుగదె కట్టా! నీదుగర్భంబునం
దత్యుగ్రప్రకృతిం దనర్చు బలగర్వాంధీభవత్క్షాత్రమా?
సత్యా! నీజనయిత్రిగర్భమున సాక్షాద్బ్రహ్మతేజం బకో?
ప్రత్యాసత్తిగ నేల చేసితి రనర్థప్రాపకప్రక్రియల్? 89

వ. ఇట్లు వారిప్రమాదంబువలనఁ గలిగిన యనర్థంబును దెల్లంబుఁ గావించిన నుల్లంబు జల్లు మని తెల్లవోయి యప్పల్లవాధర వల్లభునిచరణపల్లవంబులకుం బ్రణమిల్లి యల్లనల్లన నిట్లనియె. 90

శా. నాదౌర్భాగ్యము కన్నుగప్పి మతిమాంద్యం బిట్లు వేధించె; నా
థా! దీనోద్ధరణా! దయాభరణ! నాతప్పుల్ క్షమింపుండు; నే
మీదానన్; భవదీయసంతతికి స్వామీ! దారుణక్షాత్ర దు
ష్ప్రాపిదుర్భావ కఠోరవక్రగుణ మాపాదింపఁగాఁ జెల్లునే? 91

వ. అని ప్రార్థించినం గరుణాంతరంగుండై యప్పరమమునీంద్రుండుము సతీమణిం గాంచి యిట్లనియె. 92

శా. ఈ సంతానము బ్రహ్మవర్చసమె కాని; మీ చరువ్యత్యయ
వ్యాసంగంబునకున్ ఫలం బిఁక మహోద్యత్క్షాత్రతేజోమయం
బౌ సంతానము నీదు సంతతికి సంప్రాప్తించుఁగా; కింతకున్
మా సంకల్ప మమోఘు; మెప్పగిదినైనన్ సిద్ధ మౌ నంగనా! 93

మ. అన నానందపయోధిఁ దేలె సతి; బ్రహ్మర్షీంద్రుఁ డిల్లాలిఁ జ
ల్లని చూడ్కిం గని యాదరించె; నదెమూలం బామెగర్భంబునం
జనియించెన్ జమదగ్ని; యాయన 'కిదం క్షాత్రం త్విదం
బ్రాహ్మ్య'మన్
మునిసింహం బుదయించె; నప్పరశురాముం డుగ్రతేజస్వియై. 94

వ. మఱియు సత్యవతీగర్భంబున జమదగ్ని యనంతరంబున శునశ్శే ఫుండును, శునకుండును నను నిరువురుకొడుకు లుదయించిరి. సత్య

వతీమాతృగర్భంబున విశ్వామిత్రుం డుదయించె; నట్లు చరువిని
మయంబైన కారణంబున విశ్వామిత్రుండు సుక్షత్రియవంశసంభవుం
డయ్యును విశుద్ధబ్రహ్మతేజంబున కాస్పదంబయ్యె; మఱియు. 95

సీ. ఇది యెన్నఁడో నిర్ణయింపఁగఁబడె; దైవి
కం బిది తప్పింపఁగాఁ దరంబె?
భవితవ్యతాబలం బహులంఘ్యు; మలభృగు
పుత్రుఁడౌ చ్యవనుండు పూర్వమందె
యిద్దాని నరికట్ట నెంతో ప్రయత్నించి
విరమించె; మీ రెఱుంగరొకో? మఱియు
నాదినుండి కుశాన్వయము బ్రహ్మతేజఃప్ర
భావసంపన్నమై పరగుచుండు;

తే. నాసుతుండగు కుశరాజునకుఁ గుశాంబ
రాజు, కుశనాభుఁ, డాధూర్తరజసుఁడు, వసు
వనెడు కొడుకులు నలువురైరి; రలద్వితీయుఁ
డైన కుశనాభుచరిత మత్యద్భుతంబు. 96

వ. అక్కుశనాభుండు నిజకళత్రం బగు వైదర్భియందుఁ గన్యాశతంబుఁ
గాంచె; వారును రూపసౌశీల్యాది గుణంబులు గలిగి సరస సంగీత
సాహిత్య నాట్యకళావినోదంబుల నాఱితేఱి, యొకానొకనాఁ
డుద్యానవనంబున విహరించుచుండ వాయుదేవుం డాలోకించి
కామశరపీడితుండై మదీప్సితం బొడగూర్చితిరేని మీకు దేవ
త్వంబు సిద్ధింపఁజేయుదు ననినం గోపించి వా రిట్లనిరి. 97

మ. కుశనాభాత్మజ లన్న నే మనుచు నీకుం దోఁచె? నే మంచు నీ
పశుధర్మంబునకుం గడంగితి? పదభ్రంశంబుఁ గావించు ని
మ్మశనిక్రూరకఠోరశాపమున నీ కస్మద్గురుం; డెవ్వ రీ
యశుభవ్యాహృతులన్ సహింపుదురు? పిత్రాధీనలౌ కన్యకల్? 98

వ. అమ్మాటలకు సమీరణుం డాగ్రహించి వారిలోనం జొచ్చి, తదంగ కంబు లన్నింటిని భంజించి ప్రభంజనుం డనుట సార్థకం బొనరించు కొని, వారల నరత్నిమాత్రాకృతులం జేసిన, వియూహిణు లై దుఃఖింపుచుం బోయి తండ్రి కెఱింగించినం బరమశాంతుం డైన యారాజర్షి బిడ్డల నోదార్చి యిట్లనియె. 99

సీ. కష్టసుఖంబులు కర్మానురోధముల్;
దైవసంఘటనంబు తప్ప దెపుడు;
కోపమే హృదయసంతాపహేతువు; కోప
మే పాపమూలంబు, కోపమే య
నర్థకారకము; సర్వార్థసంజనకంబు
శాంతంబె కల్పవృక్షంబు, శాంత
మే కామగవి; శాంతమే నందనవనంబు;
శాంతంబు మించిన సౌఖ్యకారి

ఆ. లే దటంచు వారి నోదార్చి పరమశాం
తస్వభావుఁ డైన ధర్మమూర్తి
కుశికరాజు సుతలకును వరాన్వేషణం
బునకు నై ప్రయత్నమును ఘటించె. 100

తే. నిరుపమతపోనిధానంబు నిర్మలాంత
రంగుఁ డగు చూళి యనెడు బ్రహ్మర్షి యొకఁడు
తపముఁ గావింప నూర్మిళాతనయ సోమ
ద యను గంధర్వి యతని సంతతముఁ గొల్చె. 101

వ. అమ్మునీంద్రుం డే మభిలషించి నన్ను సేవించెద ? వనిన న త్తరుణి కేలుంగవ ఫాలంబునం గీలించి, దేవా! మీ దివ్యతేజంబున నాకు లోకో త్తరమహిమాస్పదుం డైన తేజశ్శాలి యొక పుత్రుం డుదయింప ననుగ్రహింపవే యని వేఁడెం గరుణాంతరంగుం డై యప్పడంతికిఁ బుత్రదానంబుఁ గావించె; నతఁడు బ్రహ్మదత్తుం

డను పేరు వెలయ నత్యంతధర్మంబున రాజ్యపరిపాలనంబుఁ జేయుచుండఁ గుశనాభుం డతని నెఱింగి తన కన్యాశతంబు నాతని కిచ్చి మహావైభవంబున వివాహం బొనర్చె. 102

క. అతఁడు కరంబునఁ గన్యా
శతము స్పృశింపంగఁ బవనసందానితదు
ష్కృతియును, గుబ్జారూపవి
కృతియును మాయమయిపోయె; నెల్లరుఁ జూడన్. 103

వ. ఇట్లు మొదటినుండియు బ్రహ్మతేజఃప్రభావ సంభూతవైభవోపేతంబైన జాతి యని కౌశికాన్వయంబు నెఱుంగుదురుగాక; మఱియుఁ బుత్రవిహీనుండగు కుశనాభుచేతఁ దండ్రియగు కుశుండు పుత్రేష్టిఁ జేయించి తాను బ్రహ్మలోకంబునం కేతెంచి యింద నివసింపుచుండె; నంత నయ్యిష్టిప్రభావంబునం గుశనాభునకు గాధి యను పుత్రుం డుదయించె; నని పల్కి యబ్జసంభవుండు వెండియు నిట్లనియె. 104

—, ఆశ్వాసాంతము ,—

మ. తటభూవాస కుశోపవేశ సముపస్థానానివార్యక్రియా
చటులాటోప విపాటనోద్యత ధనుర్జ్యాకర్షణోద్యద్ధ్వని
స్ఫుటదంభోజభవాండభాండ విచలద్భూరిప్రతాపోదయ
త్రుటితాంభోనిధిగర్వదుర్విలసనా! దుష్టాసురత్రాసనా! 105

భుజంగప్రయాతము :-

ఘనజ్ఞానదీపా! యఖండప్రతాపా!
యనంగస్వరూపా! మహాఘప్రతీపా!
వినమ్రామరిరత్నానివిశ్లిష్టకదీక్షా!
జనానందభిక్షావిసర్పత్కటాక్షా! 106

క. వైదేహీహృత్కమల
ప్రాదుర్భూతప్రసన్నభాస్కర! కరుణా
మేదుర! విభవ జిత బిడౌ
జా! దినకర తేజ! భక్తజనసురభూజా! 107

## గద్యము

ఇది శ్రీరామచంద్ర కరుణావిభవ కవితానుభవ
శివార్యతనూభవ సుధీజనవిధేయ సుబ్ర
హ్మణ్యానామధేయ ప్రణీతంబైన
బ్రహ్మతేజోబలంబునందుఁ
బంచమాశ్వాసము.

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః

# బ్రహ్మతేజోబలము

లేక

# విశ్వామిత్ర చరిత్రము

## షష్ఠాశ్వాసము

శ్రీమన్మంగళతారక
నామా! ప్రధ్వంసితప్రణతజనదురిత
స్తోమ! దశకంఠకంఠభి
దాముదితదిగంతసంతతయశోధామా! 1

వ. దేవా! యవధరింపు మట్లు పద్మసంభవుం డక్కుశనాభతనయల బ్రహ్మదత్తుండు పరిణయం బగుటయుఁ, దత్పూర్వభావంబునం దత్కన్యాశతంబునకుం గుబ్జారూపవికృతి దొలంగుటయు, గాధిరాజేంద్రుని జన్మప్రకారంబు నెఱింగించి వెండియు వేల్పుల కిట్లనియె. 2

ఉ. దేవరహస్య మొక్కటి మదీయసభాంతరమందుఁ దొల్లి ప్ర స్తావితమయ్యె మాటవరుసన్; భృగువంశ్యులు కౌశికాన్వయుల్ భావిపరస్పరానుగతబాంధవులై యితరేతరీయ తే జోవిభవాప్తి సంకరము చొప్పడు నంచొకవార్త పుట్టినన్. 3

వ. దివ్యజ్ఞాన సంపన్నుండును, భృగువంశవిభూషణుండును నగు చ్యవనుం డను బ్రహ్మర్షిసత్తముం డది గ్రహించి యెట్లయిన నీ సాంకర్యంబు నరికట్టవలయు నని నిశ్చయించి మహోదయపురం బున కరిగినం గుశనాథమహీపాలుండు వినయవినమితగాత్రుండై సపురోహితామాత్యంబుగా నెదురేఁగి స్వాగతం బిచ్చి తోడి తెచ్చి మహార్ఘమణిపీఠంబున నాసీనుం జేసి. 4

మ. భవదంఘ్రిద్వయసేవనానుపమసౌభాగ్యంబు సేకూరఁ బ్రా
గ్భవమం దార్జితమైన పుణ్య మది పక్వంబైననే కాక మా
నివరా! పావనతావకీనపదముల్ నిర్ధూతపాపౌఘముల్
ప్రవిగాఢాంధతమోనిరాకరణముల్ ప్రాపించునే యెరికేన్? 5

మ. భవబంధంబులఁ ద్రెంపఁ, గర్మచయమున్ భంజింపఁ, బ్రజ్ఞావిశే
షవికాసంబు ఘటింప, శాశ్వతసుఖస్థానంబు సంధింపఁగా
భవదంఘ్రుల్ గలుగంగ సంసరణదుష్పంకంబులో నెవ్వఁడై
న వృథా మున్గఁ దలంచునే! కుడితిలో నన్ బడ్డ యెల్కంబలెన్.

శా. ఈ రాజ్యంబు భవత్పదార్పితము; స్వామీ! దాసుఁడన్ నేను; నా
వా రెల్లన్ భవదీయకింకరులు; సర్వస్వామ్యమున్ సద్యశః
పారమ్యంబుఁ దలిర్ప నేలుకొనవే భద్రాయితాకార! ని
న్నారాధించెద జీవితంబునకు ధన్యత్వంబు సంధించెదన్. 7

వ. అనిన నా బ్రహ్మర్షితిలకుం డలికంబున హాసంబు మొలకలెత్త నిట్లనియె. 8

ఉ. ఇంతటి వైభవోన్నతుల నేఁ దులఁదూఁగుచు నుంటి నంచు నీ
స్వాంతమునందుఁ గల్గిన యహంకృతిఁ జాటుటె దీని కర్థ; మ
న్నంత నె నీ వొసంగెదవొ? యయ్యది మేము పరిగ్రహింతుమో?
యింత యెఱింగి కాదె? వచియింతువు కమ్మఁదనమ్ము గ్రమ్మఁగన్.

చ. అడవుల ముక్కు మూసికొనునట్టి మునీంద్రుల కేల? రాజ్యపుం
గొడవ? వ్రతోపవాసములకుం దగుమాత్రమ సాయ మిచ్చినం
గడపుదు మేము కాలము జగన్నుత! మానటు; ముఖ్య మిష్టు నీ
కడ నొకదీక్షతోఁ గొలఁది కాలము నిల్వఁదలంతు మోనృపా!

చ. నిజమగుభక్తి యున్నయెడ నీవును, భార్యయు నెంతమాత్రమున్
గజిబిజి దోఁపకుండ, నధికారపు బింకముఁ జూపకుండ మా
కుఁ జివరదాఁకఁ జేయవలెఁ గోరినయట్లుపచారముల్; సమ
స్త జనవిలక్షణం బయిన శాంతి శుచిత్వము లుండఁగావలెన్.

తే. ఇష్ట మన్నచో నిల్తుము, కష్ట మన్న
నిదిగొ కాలికి బుద్ధిఁ జెప్పెదము; సంశ
యింపకుము నీమనస్స్ఫూర్తి యెట్టి దట్టు
లాడు మొకమాట మాకెట్టులైన సరియె. 12

వ. అనిన రాజేంద్రుం డిట్లనియె. 13

మ. మెఱమెచ్చుంబలుకే నెఱుంగ నెపుడున్; మీ కేటి కిమ్మాటపై
దురహంకార మటంచుఁ దోఁచినదొ? సంతోషంబె; యెట్లైన మీ
చరణాంభోజపవిత్రసేవ దొరకెన్ స్వల్పంబుగానైన; భూ
సురవంశాగ్రణి! యట్టులే నిలువుఁడిచ్చో మెచ్చుఁ జేకూర్చెదన్.

వ. అని పాదంబుల కెఱఁగి వినమ్రవదనుండై సకళత్రంబుగా భక్తి
వినయసంభ్రమంబులు దోఁప నమ్మహాత్ము నింద్రభవనంబుంబోని
దివ్యభవనంబునం జేర్చి యుచితాసనంబున నాసీనుం జేసి ప్రాంజ
లియై యేమి సెల విత్తు? రని యడిగిన మునీంద్రుం డిట్లనియె. 15

చ. పలుకుట కేమి? యెట్లయినఁ బల్కఁగవచ్చును; నోరునొచ్చునే?
పలికినయంతవట్టు సలుపన్ వలె నన్నపుడే బయల్పడున్
దెలివియుఁ దేట; లందులకె తెల్పుచునుంటిమి సుమ్ము! వెన్కఁ జిం
తిలు టది వెఱ్ఱి గావున మదిం బరిశీలనఁజేయు మిప్పుడే. 16

తే. దాసదాసీజనుల కిటఁ దావు లేదు
మాకుఁ బరిచర్య లొనరింప; మానవేంద్ర!

దంపతులు మీర లిర్వురే తగినభక్తి
వినయములు దోఁప మమ్ము సేవింపవలయు. 17

వ. అనినం గుశాన్వయతిలకుం డిట్లనియె. 18

మ. అనృతం బాడి యెఱుంగ నెన్నఁ; డీఁకముం దాడంగఁబో నెన్నఁడై
నను; సత్యంబునకున్ సమంబె తలఁపం ద్రైలోక్యసామ్రాజ్యమై
నను? బ్రహ్మాదిసమస్తలోకములకున్ సత్యంబె యాధార; మో
యనఘా! సత్యము లేక భూమికి భరంబై యేల జీవింపఁగన్?

వ. అని ఖండితంబుగఁ బల్కిన, భార్గవుండు వికసితముఖకమలుం
డగుచు బాగుబాగు రాజా! లెస్సగాఁ బల్కితివి; నీ విట్టివాఁడ
వని వినియే మే మిందు రాఁ గలిగితిమి; కాని లోకస్వభావంబుఁ
దెలుపుచుంటిమి. 20

మాలిని. అనృతమె స్పృహణీయం బౌఁ జుమీ! నూటి కొక్కం
డనఘుఁ డెవఁడొ బొంకం డట్టి ప్రాణాంతమైనన్
మునులు సురలు దైత్యుల్ మూఁగి తార్మాఱుగానీ
దినమణి హిమధాముల్ దీధితుల్ పాసిపోనీ. 21

వ. సృష్ట్యాదిగా లోకంపు నడక యిట్లు సాగుచున్న; దైనను నీనడ
వడి మాకుం జాల మెచ్చుఁ గూర్చుచున్నది; గాన నీకుఁ జాలం
బేల? కట్టాయితంబై మా కౌతుకంబు నెఱవేర్తువుగాక యని
యాహారకాంక్ష సూచించినం దత్క్షణంబ యన్నరదేవధర్మపత్ని
నిజకరపరికల్పిత నిరుపమాన మృష్టాహారంబుల సంతుష్టాంత
రంగుం గావించిన నమ్మునీంద్రుండు వెండియు నిట్లనియె. 22

మాలిని. తిరిగి తిరిగి నాశ్చన్ దేహబంధంబు లెల్లం,
బురములు నగరంబుల్ పుణ్యకాంతారసీమల్;

నిరతజపతపంబుల్ నేఁడు గాకున్న రేపౌఁ;
జిరతరసుఖనిద్రన్ జెందకున్నన్ భరింపన్. 23

చ. చెరియొకవంక వీవనలు చేకొని హాయిగ వీచుచుం బదాం
బురుహము లొత్తుచున్ నిదురవోయెడు మాకడ జాగరూకులై
యరనిముసంబు నేనిఁ దుద కట్టిటు కా ల్గదలింపరాదు; ని
ద్దుర పరిపూర్తి యౌదనుకఁ దోరపుభక్తి భజింపఁగావలెన్.

తే. నిదుర, నన్నంబు మాని మానినియు నీవుఁ
గంట వత్తిడికొని చెంతఁ గాచియుండ
వలయు; నెవ్వారు మమ్ము మేల్కొలుపరాదు;
తనిసి సుఖనిద్ర మేము మేల్కొనెడుదాఁక. 25

వ. అని పల్కినం గుశికరాజేంద్రుండు హేమపట్టపరిచ్ఛదంబును గనత్కనక మణిమయ కుట్టిమాభిరామంబును రమణీయహాటక స్తంభ సంభరితంబును నవరత్నస్థాపితామూల్యసోపానభ్రాజితంబును నానావిధవిచిత్రచిత్రరచనావిలసితంబును నైన సుమనోజ్ఞ శయనాగారంబున నమ్మునిచూడామణిం జేర్చి యందుం గమనీయవితాన సుమనోహరంబై కాంచనపాంచాలికాసమంచితంబై చక్కని మగరాల చెక్కడంపుఁబని కలిగిన బంగరుకోళ్ళపట్టె మంచంబుపై హంసతూలికాతల్పంబు నమరించి యం దమ్మహనీయు శయనింపఁజేసి భయభక్తివినయంబు లినుమడింపం బాద సంవాహనం బాచరింపుచుఁ బరిమిళమిళితమృదులతరపరమసుఖ స్పర్శప్రసర దసమాన శిశిరపవన శిశు విసర ప్రచోదన పరాయణంబులైన యుశీరవ్యజనంబులఁ గైకొని విసరుచు. 26

క. జననాథమౌళి, యింతియు
ననుపమభయభక్తు లొదవ నటు సేవింపన్

దినముల నిరువది యొక్కటి
మునితల్లజుఁ డేకపార్శ్వమున నిదురించెన్. 27

వ. ఇరువదిరెండవనాఁడు తనయంతన మేల్కాంచి. 28

క. ఇలు వెడలిపోయె నెచటికో?
పలుకం డించుకయు వెంటఁబడి యిర్వురుఁ బ్రాం
జలులై యనుగమనించుటఁ
దలఁపఁడు వెనుదిరిగి కనఁడు తా నిర్దయుఁడై. 29

ఆ. ఇట్టు లేఁగియేఁగి యెందేని యొక్క కాం
తారదుర్గమందు దారి డొంకఁ
గానరానిచోటఁ గడువడిఁ జనిచని
మాయమయ్యె నున్నమాడ్కి నుండి. 30

తే. అది కనుంగొని విస్మయం, బమితభయము,
సంభ్రమ మొకుమ్మడిగ మనస్సరసిజములఁ
దవుల వారలు హా! యని యవనిఁ బడిరి
గాఢమూర్ఛాతిరేకవైక్లబ్య మడరి. 31

తే. కొంతవడి కట్టెటులో లేచి కువలయేశుఁ
డబలయును దాను మఱల దురంతఘోర
దుర్గమారణ్యమున మునీంద్రుని కొఱకయి
ద్రిమ్మదిరుగుచు గమ్మున సొమ్మసిలిరి. 32

శా. ఘోత్రౌద్ధత్య మడంచి, తచ్చరణదాస్యం బేకవింశత్యహో
రాత్రంబుల్ భరియించి యన్నమును నిద్రన్ మాని శుష్కించుటన్
గాత్రంబుల్ వివశంబులయ్యెఁ; గనులన్ బ్రాణంబులన్ దాల్చియా
ర్తత్రాణైకపరాయణా! మునికులేంద్రా! యంచు వాపోవుచున్.

శా. ఏ పాపంబు లొనర్చినార మని తండ్రీ! మమ్ము నింతింత ఘో
రాపాయంబుల పాలుసేసెదవు? మా ప్రాణంబు మానంబు నా
నాపారోజ్జ్వలవైభవోన్నతులు సర్వాధీశ్వరత్వంబు నే
మీపాదంబుల కొప్పఁజెప్పితిఁగదా! మీభృత్యుఁడన్ గానొకో.

మ. కనులన్ జూడఁగరానియంతటి మహాకష్టాత్ముఁడా వీఁడు? పా
వన యుష్మత్పదపంకజద్వయముఁ గొల్వన్ నిల్వఁగా నేర్చునే?
మునివంశోత్తమ! పాపసంచయము నామోసాల దోసాల కె
త్తిన బ్రహ్మాస్త్రమహాప్రయోగమగుఁగాదే! మీదుపాదార్చనల్.

మ. మిము దర్శింపను, మీదుసేవ సలుపన్, మీదివ్యకారుణ్యపూ
ర మపారంబుగఁ బాఱ సారె కఘమర్షస్నాన మేపార దు
ర్దమపాపచ్ఛల కర్దమంబు నెడఁగాఁ బ్రక్షాళనం బాచరిం
ప మదిన్ గోరితిఁ గాని, కోర నిఁక దేవా! భోగభాగ్యంబులన్.

శా. ఈఁగన్ బట్టినఁ బ్రేగు లెల్ల బయలౌ; నేమెంత? మీధాటి; కే
మాఁగున్? దాసుని తప్పు దండమునఁ బోదా? యట్టిదోసంబు లే
మేఁ గన్పించిన శిక్షసేయుఁ డిఁక మీయిష్టానుసారం; బిటుల్
సాగింపం బని యేమి? దుర్భరపరీక్షల్ కన్నులన్ గప్పుచున్. 37

శా. ఏ కష్టంబులకైన నోర్చెదముగానీ యున్నయట్లుండి మీ
యాకారంబె కటా! తటాలునను మాయంబైనచో నింక మా
కీకాంతార మహోగ్రదుర్గముల మి మ్మీక్షింప శక్యంబె? స్వా
మీ! కాసంత దయారసం బొదవ దేమీ? మీమనోవీథిలో.

ఉ. కన్నులకుం గనంబడుచు గాఢపుశిక్ష లొనర్పవచ్చు, నా
పన్నులఁ జేయవచ్చు; బనిఁబంపుఁడు; బాడబమైన మ్రింగుదున్;
గన్నుల గంతలన్ బిగియఁగట్టి మహోదధిఁ బాఱవేయుఁ; డె
న్నన్ని కఠోరశిక్షలకునేనియు సిద్ధుఁడ బద్ధుఁడం బ్రభూ! 39

క. మా యనుమతి యగునంతకుఁ
బాయక సేవింపు మనుచుఁ బలికితి; రటు నే
నాయత్తమైతిఁ; దుద కిటు
నా యాడినమాట వోయినది వ్యర్థముగన్. 40

వ. అని పరిపరివిధంబులం బరితపించుచుఁ గుశ కాశ కంటక పరీతంబును నిబిడతర బహువిధతరునివహ సమ్మర్ద సంజాత గాఢాంధతమోబంధురంబును పిపాసాపనోదనార్థ నదీనద యాతాయాత గిరికుహరనివాస భయంకరోగ్ర జంతుసంతాన సంయుతంబును వివిధమృగ విఖండన పాండితీప్రచండతర సింహ శరభ శార్దూల గండభేరుండాది భయంకరసత్త్వ విరచితారావ ప్రతిధ్వనితంబును నగమ్యంబును నపారంబును నైన దుర్గమారణ్యంబునందు సారె సారెకు నప్పుణ్యదంపతులు పరస్పరకరావలంబులై యడుగులు తడఁబడుచుండ నడువలేక సుడివడి పుడమిఁ బడుచు లేచుచు, నాహారనిద్రలు లేక పంచవింశత్యహోరాత్రంబులనుండి జలాహారంబుతోఁ గాలంబుఁ ద్రోయుచున్నకతంబున నడలి బడలి యొడలు వశంబు గాక కనులు పచ్చనై ధరణీచక్రంబు కులాలచక్రప్రక్రమంబునం గిరగిరం దిరుగు తెఱంగునం దోఁప నిస్సారంబులై కాలుసేతులు బట్టపేలికలవలెఁ దూఁగాడుచుండఁ దాలిమిం బూని పోలివోని ధైర్యంబున మఱల మఱలం బ్రయత్నింపుచు నెలుంగెత్తి యో మునిజనశిరశ్శిఖండా! యఖండతపోవిభవ విమోహిత నిఖిల జగదండా! యెం దుంటి వని ఘోషింపుచు. 41

ఉ. ఓ మహనీయభూసురకులోదధిపూర్ణశశాంకమూర్తి! యో
హో మునిలోకపాల! మహిమోన్నతభూరియశోవిశాల! రా
వే! మముఁ గావవే! యభయ మీవె యనన్యశరణ్యులం గటా
క్షామృతశీకరంబులఁ గృతార్థులఁ జేయవె యీసుఁ బాయవే!

మ. తనువుల్ డస్సెను, శోష వచ్చెఁ, గనుగుంతల్ లోనికిన్ గుంజె, భూ
మిని గాలూనఁగ లేము, గమ్మునను గ్రమ్మెన్ జిమ్మ చీఁకట్లయో!
కనులన్ బ్రాణము లున్న; వింకఁ దిరుగంగా లేము; మ మ్మేల యా
తనలన్ ముంచెదు? తండ్రి! యేమి యపరాధం బిట్లు శిక్షింపఁగన్?

వ. అని తిరిగి తిరిగి బడలి యడుగుఁదమ్ములు పొక్కి లెత్తి నఖ
పుటంబుల నెత్తురు జొత్తిల్ల. 44

ఉ. కంటికిఁ గానరాఁ డిఁక జగన్నుతుఁ డా మహనీయమూర్తి; మా
వంటి యభాగ్యులన్ విధి ప్రపంచమునన్ సృజియింప నేల? దొ
ల్లింటి దురంతపాపము ఫలించిన; దింకఁ గనుంగొనంగ లే;
మింటికిఁ బోద; మెంతవడి నీయడియాసల గాసిఁ జెందఁగన్? 45

వ. అని యిట్లు నిజనగరాభిముఖులై మార్గంబు గానరామి దుర్గమా
రణ్యంబున నతిప్రయాసంబునం దిరుగుచు. 46

మ. మిముఁ జింతింపుచు, మీపదాంబుజయుగం బే మా కవశ్యం బుపా
స్యముగా సంతత మాంతరంగికసమర్చన్ వే పవిత్రీకరిం
తుము జన్మంబు; మనఃప్రచారమునకున్ దూరంబు పారంబు దృ
శ్య మదృశ్యం బను భేద ముండదుగదా! సాగింపుఁ డిచ్ఛాగతిన్.

వ. అని నిజపురగమనాభిలాషులై చనుచుండ. 48

సీ. ఒకవంకఁ బోవ మహోద్ధతక్రూరమృ
గాక్రాంతి; తాను నిరాయుధుండు;
మఱియొక్కవంక నంబరచుంబి నగరాజి,
యింకొక్కయెడ సెలయేటిదొనలు,

వేఱొక్కదెసఁ జూడ వివృతాస్యముల మహో
జ్జ్వలములై తగు కొండచిలువగములు,
నింకొక్కత్రోవఁ బో నెదిగి నింగికి నాలు
కలు సాఁచు నుజ్జ్వలజ్వాలనశిఖలు;

తే. నిలువరాదు, పరుగువాఱ నలవిగాదు
విశ్వవిఖ్యాతిఁగన్న గర్భేశ్వరుఁడఁట!
యెండ కన్ను నెఱుఁగని గృహేందిరయఁట!
విధికృతం బెరికైనఁ దప్పింపఁ దరమె? 49

మ. ప్రళయోదగ్రమహాగ్ని రేఁగి, పెలుచన్ బ్రహ్మాండముం బ్రాఁకిన
ట్లలదావానలకీల లొక్కత్రుటిలో వ్యాపించెఁ; గాంతారభూ
వలయం బెల్ల సెగల్ పొగల్ పొదివి తెర్వన్ రాదు కందోయి; వా
రలయార్తిన్ భగవంతుఁడే యెఱుఁగు దుర్వారం బపారంబగున్.

వ. మఱియు నెడనెడం బొడవు సూపుచు వడివడిం గడలుకొనెడి సుడిగాడుపులచేఁ బ్రేరితంబులై యాశ్రయాశిత్వం బర్థవంతంబుగాఁ జటచ్చటారావంబులతో ననలశిఖలు దరికొనం గోటరంబుల నుండి వినిర్గతంబులైన భుజంగమ సంఘుంబులతో నేకావృతి యగు మహోన్నత ధరణీరుహానికరంబును, నింగిముట్టఁ బెరిఁగిన శిఖిశిఖాచ్ఛటలఁ బెటిలుపెటిలునం బెటిలిపడు మహీధరధాతు పటలంబును, జక్రభ్రమణ విభ్రమాదభ్రపవమాన ప్రేష్యమాణ దవదహన జ్వాలాలేలిహ్యమానదేహు లౌటన్ బ్రయాణోన్ముఖ ప్రాణులైన యాటవికజనులును, క్షణక్షణప్రవర్ధమాన పవనసఖ శిఖావలయ సంతాప జనిత ఘోషారవ సమ నిర్గతప్రాణ నిఖిల జంతుసంతానంబును, బహువిధ రచిత ఘోషావిషాదంబును గుప్పతెప్పలై యుప్పరం బెగసి కప్పుచున్న విధూమాంగారకణం

బుల గణంబులునుం గలిగి మహాబీభత్సంబును జుగుప్సావహం బును నైన యక్కానసనంబునం జిక్కి దిక్కులేని చావు తప్పదని కృతనిశ్చయులై యున్న యప్పుణ్యదంపతుల కెక్కాలంబునం జేసిన పుణ్యమో యిక్కాలంబునకుం బక్వంబైన తెఱంగున. 51

ఉ. ఎక్కడఁ బుట్టెనో? మఱి యొకింత పయోధరఖండ; మద్దియే
యొక్క నిమేషమాత్రమున నూర్జితమై మదకుంభియూథమ
ట్లెక్కడఁ గన్నఁ గార్కొని మహీవలయంబు జలార్ణవంబుగాఁ
జిక్కని పోఁతఁ బోసెఁ దనజీవనదాఖ్య సుసార్థకంబుగాన్. 52

శా. ఆపవ్యాహతిలోనిపాఁ తగల, నాద్యావాపృథివ్యంబుధా
రాపాతాతిభయంకరోద్ధతి మహీధ్రశ్రేణి యూఁటాడ, క్షో
ణీపాతంబుగఁ గుంభవృష్టి గురిసెన్; నిమ్నోన్నతాభేదమై
యేపార్శ్వంబునఁ గన్న లోక మఖిలం బేకార్ణవంబై చనన్. 53

తే. ఘోరగర్జారవంబుల గుండె లవియ,
మెఱుపులకుఁ గన్నుఁగవ మిఱుమిట్లు గొలుపఁ,
బరమబీభత్స మేర్పడఁ గురిసి కురిసి
యలసెనో యన జల్లున వెలిసె వాన. 54

తే. అగ్నిభయమును దొలఁగించినట్టి వృష్టి
యంతకంటెను బాధావహంబ యయ్యె;
వనశనవ్రతదీక్షచే నలసియున్న
యొడలి కది ముల్లు పుచ్చి కొఱ్ఱడఁచినట్లు. 55

వ. అంతఁ గొంతవడికిఁ గ్రింపుమీఁదులై దైవానుగ్రహంబున నెట్లో నిజగృహంబుఁ జేరి చూడ యథాపూర్వంబుగ శయనీయంబున మఱియొక్క పార్శ్వంబునం బరుండి నిదురించుచున్న బ్రహ్మర్షిం

గాంచి యత్యానందంబునం బాదసంవాహనం బొనర్చుచుండ మరల ని ట్లేకపార్శ్వంబున నిరువదియొక్కదినంబు నిదురించి యిరువదిరెండవదినంబున మేల్కాంచిన. 56

తే. హర్షపరవశులై వార లమ్మునీంద్రు
నడుగుఁదమ్ముల కెఱఁగి మహాత్మ! యేమి
యాజ్ఞ? యని వేఁడ నాతఁ డభ్యంజన మతి
వేగ మనఁ గమ్మనూనెఁ దెప్పించె విభుఁడు. 57

క. అంగనయుఁ దాను నమ్ముని
పుంగవుఁ దలయంటి, ముదము వొదల మృదువుగా
నంగముల మెదిపి, వార
భ్యంగస్నాన మనుచుండ నంతర్హితుఁడై. 58

వ. ఇవ్విధంబున నదృశ్యుండై యా ధూర్తతపస్వి వెండియు. 59

క. గడెలోన మరల దర్శన
మిడి, వారల ప్రార్థనమున కెట్లో యొడం
బడి స్నాన మొనర్చిన న
ప్పుడె మృష్టాన్నములఁ దెచ్చి భోజన మిడినన్. 60

వ. పోయి నవరత్నఖచితమైన బంగరుపీఁటపైఁ గూర్చుండి హైమ భాజనంబున వడ్డించిన షడ్రసోపేతమైన మృష్టాహారంబు నెగాదిగం జూచి మొగంబు జేవురింపఁ గనుఁగొనల మిడుంగురులు సెదర బొమలు ముడివడ మునీంద్రుం డిట్లనియె. 61

తే. ఆఁకటికి మాకుఁ బ్రాణంబు లవిసిపోయె
నిప్పు డెవరికిఁ గావలె? నీ వొసంగు
బువ్వకై మోము వాయుము పో దురాత్మ!
కనులఁ బడుదురె? మావంటిమునులు నీకు? 62

మ. దురహంకారము నెత్తికెక్కినదిపో దుష్టాత్మ! ఛీ! ఛీ! మునీ
శ్వరునిం గూటికిఁ బిల్చి, బూటకపు వాచామాధురిం జూపి, యే
మెఱుఁగం డాటవికుం డమాయికుఁ డటం చేమేమొ యూహించినా
వుర? యం చాడి మహోగ్రుఁడై యెచటికో పోయెం దయాహీనుఁడై.

ఆ. అట్లు వెడలిపోవ నయ్యహోరాత్రంబు
లతనిజాడ యించుకైన లేక
సంశయించుపతికి సహధర్మచారిణి
మృదువచోవిభూతి మెఱయఁ బలికె. 64

మ. అనయంబున్ మిముఁబోలు నస్ఖలితధర్మాసక్తులై పొల్చు స
జ్జనులం బెద్దలు పట్టి చూచు టది సాజం; బెట్టికష్టాలకై
నను లెక్కింపఁగరాదు; కంఠమునఁ బ్రాణం బుండుపర్యంత; మీ
తను వన్నన్ జలబుద్బుదోపమ; మనిత్యం; బేల యోజింపఁగన్?

మ. మమతన్ మీకడ నాకుఁ గల్గు చనవుం బాటించి మాటాడితిన్;
మిము బోధించుట కెంతదాన? ననఘా! మీపాదసేవామహా
త్త్వమునం దోఁచిన జ్ఞానలేశ మిది; నాథా! ధర్మహీనప్రచా
రము విశ్వంభరకున్ సుఘోరమగు భారం బౌ నపారంబుగన్. 66

శా. నీడం బోలి నిరంతరానుసరణన్ నే నెట్లుఁ జేదోడు వా
దోడై మీకు సహాయమున్ సలుపుచుందున్; నాథ! యింకేల వె
న్కాడం? బెద్దలసేవ పెన్నిధిగదా! వ్యర్థంబుగాఁ బోవ, దే
నాఁడైనన్ ఫలియించు; నమ్మహితుఁ డానందింప లోటున్న దే?

ఉ. 'అంతటివానికిం దనయవై చతురంతమహీసపత్నివై
యింత ప్రయాస మెట్లు భరియింతు?' వటం చనఁబోకుఁ; డింతికిం
గాంతుఁడె భూషణంబు; నరకంబును గాంతునిచెంత స్వర్గమౌఁ;
గాంతుఁడు లేనినాఁడు నరకంబె కదా! మఱి స్వర్గమేనియున్. 68

మ. పతి సర్వాధికుఁడై మహోన్నతదశాభ్రాజిష్ణుఁడై యున్ననాఁ
డతివిశ్వాసముఁ జూపి, కాలగతి దైవానుగ్రహాపేతుఁడై
నతఁడిం గన్నులఁ బాప లడ్డమయి చెంతం బోరు పూర్వానుభూ
త తదీయోన్నతి విస్మరించి; యిది స్త్రీత త్వంబు సృష్ట్యాదిగన్.

మ. అతిలోకప్రథమాన వైభవముతో నానందమున్ జెందనీ,
శతపుత్రాభ్యుదయంబుఁ గాంచియు మహాసౌభాగ్యముం బొందనీ
పతిహీనం గనినంతనే విధవ యన్ పల్కుల్ స్వతస్సిద్ధముల్;
క్షితి నెంతైనను భర్తృహీన లరయన్ జీవచ్ఛవంబుల్ గదా! 70

తే. కావునఁ గులాంగనకు జీవకళ విభుండు;
ప్రాణనాథుం డటన్న శబ్దంబె తద్వి
శేష మంతయుఁ జెప్పక చెప్పుచుండుఁ;
గానఁ బతిసేవకంటె భాగ్యంబు కలదె? 71

వ. ఆ కారణంబున మన్నిమిత్తంబుగాఁ జిత్తసంక్షోభంబుఁ జెంద కుందురు గాక యనుటయు—మానినీ! యిట్టి కష్టదశలోనం బడి తపతపలాడుచున్న నా కింతధైర్యంబుఁ జెప్పి యింతటి సహాయం బిచ్చితి; వింతకన్న నింకేమి గావలయు? నని పల్కి యా భూవల్లభుం డిల్లాలునుం దాను నా దినం బంతయు మునివరుం డెప్పు డేతెంచునో యని తెప్ప లెగఁ గట్టి నిరీక్షించుచుండ, మఱునాఁ డరుణోదయంబునఁ డక్కున నెక్కడినుండియో పిట్టపిడుగున నుట్టిపడి వచ్చి రాజదంపతుల ప్రార్థనం బెట్లో సమ్మతించి భుజించి యిట్లనియె. 72

మ. అరదంబుం గొనిరమ్ము తత్క్షణము; యత్యావశ్యకం బిప్పు; డి
ప్పురమం దుత్సవ మేఁగి రావలె; రథంబుల్ మత్తమాతంగముల్
తురగంబుల్ ధనధాన్యరత్నకనకాదుల్ మేము చేమీఁదుగా
ధరణీదేవుల కిచ్చుచుం జనెద ముత్సాహంబు దీపింపఁగన్. 73

వ. అనిన నన్నరనాథుండు. 74

చ. అరదము గంధమాల్యకుసుమాదులచేత నలంకరించి స
త్వరమ ప్రయాణమాంగలికవైభవముల్ సవరించె వృద్ధభూ
సురతతి వేదనాదములు, సూతకృత స్తుతిగీతముల్, మహీ
సురవనితాకరోచ్ఛలితశోభనలాజసుమాక్షతంబులున్. 75

వ. ఇట్లు సన్నహనం బొనర్చి, సుమనోహరంబులై జాతీయంబులైన
యశ్వంబుల నయ్యరదంబునకుం బూన్చికట్టి, యారోహింతురు
గాక మహాభాగా! యనిన నజ్జటిలుండు పటపటం బండ్లుగొఱికి
యిట్లనియె. 76

శా. మాదీక్షం గలుషీకరించుటయె నీమర్యాద గాఁబోలు! సీ!
పో దుష్టాత్మ! వృథా మమున్ నిలిపి యేమోనెత్తి కెక్కింతునం
చీదౌర్భాగ్యము సంఘటించితివె? నిన్నేమందు? మాపాలిదా
యాదుండై యెట దాపురం బయితి? భ్రష్టా! క్లిష్టదుర్మానివై. 77

వ. అని మహోగ్రహోగ్రనిగ్రహోక్తు లాడి చురచురం జూచిన నచ
టివా రెల్లరు వితాకుఁ జెంది గడగడలాడుచుం బ్రక్కప్రక్క
లకుం బోయి నిలిచియుండఁ, గుశనాభమహీపాలుండు సహధర్మ
చారిణియుం దానును వినయవినమితగాత్రంబులతో బ్రహ్మర్షి
సత్తముం గాంచి. 78

మ. భవదంఘ్రిద్వయదాసదాసులము; మాప్రామాదికం బెద్దియో
వివరింపన్ సవరించికొందుము; మముం బ్రేమామృతార్ద్రప్రశాం
తవిలోకంబులఁ జూడవే యనుచుఁ దత్పాదద్వయిన్ వ్రాలె భూ
ధవుఁ డుత్కృష్టకిరీటరత్నవిలసత్కాంతుల్ వెదం జల్లుచున్. 79

వ. ఇట్లు పదంబుల వ్రాలి కడుంగడు దయనీయంబుగఁ బ్రార్థించు చున్న యమ్మిథునంబును గాంచి యక్కొంకెతపసి కంటగించి గొంటుతనంబున నిట్లనియె. 80

శా. ఈ గుఱ్ఱంబులఁ దెచ్చికట్టు మని నీ కెవ్వండు వాక్రుచ్చె? నో
రీ గర్వాంధ! యి దెట్లు సేయవలె? నం చేమేని ప్రశ్నించినా
వే? గోరం తయినన్ నిజంబుగ హితంబే యైన మీ రిర్వురే
లాగంగావలెఁ దేరు; వే పలుకు లేలా? యిష్టమా? కష్టమా? 81

చ. పరుగిడరాదు, మందగతి బాగును గా; దొకరాశిపాటుగా
నరుగుచు నప్పుడప్పుడు రయంబునఁ బోవుటయుం బొసంగు; న
క్కఱ యయినన్ మదాజ్ఞకు విఘాతము గల్గఁగరాదు సుమ్మి; ని
బ్బరముగ మేమె తేరు నడుపంగల; మన్యు లనర్హులం చనన్. 82

ఉ. భార్య మొగంబుఁ జూచె నరపాలకుఁ; డాయమ వల్కె నాథ! మీ
ధైర్య మొకండె మీ కిటఁ బ్రధానసహాయముఁ గాన దీనికిం
బర్యవసాన మాదనుకఁ బ్రాణము లొడ్డి చరింత; మాపయిం
గార్యము దైవ మున్న; దెటు గావలెనో యటు గాక తప్పునే? 83

వ. అనిన సంతసించి నరేంద్రుండు ప్రాంజలియై చ్యవనమహర్షితో నిట్లనియె. 84

తే. చిత్తము మహాత్మ! మీ రెట్లు సెప్పి రట్లు
సేయుటకు సిద్ధ మేము; మీచేతిలోని
యణువులము గామె? భవదభీష్టానుసార
మాచరింపవె దేవ! బ్రహ్మర్షితిలక! 85

సీ. అని పల్క మునినాథుఁ డచటివా రెల్ల ర
ద్భుత మందఁగ శతాంగమునకుఁ బూన్పఁ

బడిన హయంబుల విడిపించి సహధర్మ
చారిణితోడ రాజన్యవరాళిఁ
దన రథంబునకు వాహనములు గావించి
మునికోలఁ దనకరంబున ధరించి
యతిసంభ్రమమున శతాంగ మారోహించి
కఠినభావమునఁ బ్రగ్గములఁ బట్టి

తే. ఛే యని యదల్చి యొక్కొక్క దెబ్బ వైచి
పశువులను దోలుచుండానఁ బాప మనక
తోఁటె నరదంబు జను లెల్ల జాలిఁ దూలఁ;
జేతు లెట్లాడెనో? కశాఘాతములకు. 86

తే. అరదమును లాగుచున్నట్టి యన్నరేంద్ర
దంపతులఁ జూడఁ బురజనుల్ గుంపులైరి;
మునిపతియుఁ గొల్లవెట్టె గో భూ శతాంగ
ధన కనక వస్తు వాహనాల్ దాన మనుచు. 87

తే. తే! యనినమాత్ర నఖిలంబుఁ దెచ్చియిచ్చి
రందు నున్న యుద్యోగు లమందగతిని;
యొక్క నిముసంబులోపల బొక్కసంబు
వట్టి దయిపోయినను జలింపఁడు నృపుండు. 88

ఉ. ఎన్నిదినంబు లయ్యెనో? యిసీ! కడుపారఁగఁ బట్టెఁడన్నముం,
గన్నులనిండ నిద్రయును గానమిఁ బ్రాణము లన్ను వట్టె; నీ
బన్నములన్ సహించుటయె భారము గాఁ బయిపెచ్చు తేరికిం
బన్ని రటన్న గుండియలు బ్రగ్గున బ్రీలవె? యెట్టివారికేన్? 89

ఉ. అన్నము నిద్ర లేక సగమై, జవసత్వము లాఱి, రొప్పికొం
చు న్నెఱి దప్పి కూలబడుచున్ గరముల్ ధర నూని లేచుచున్

బన్నిన తేరు లాగ నరపాలకుటుంబిని యెట్లు నేర్చెనో?
యన్నరనాథమౌళి యెటు లాయమబాధలఁ జూచి యోర్చెనో?

చ. నడువఁగ లేక కూలఁబడినన్ జడదారి సహింపఁ డుగ్రుఁడై
పిడుగులు గ్రుమ్మరించు, వెఱపించు, శపించుఁ, గలంచు, నొంచు, బల్
గడగడలాడఁ జేయును, బొక్కాలు మటం చని రోయు, నూయు; నె
వ్వఁడు భరియించు నిట్టి నగుబాటులఁ, బోటుల, విన్నబాటులన్.

శా. ప్రగ్గాలన్ బిగఁబట్టి లాగు నొకపర్యాయంబు, శల్యంబులన్
నుగ్గైపోవఁగ మోదు నొక్కపరి; యెన్నో తిట్టి బిట్టార్చి తే
రిగ్గించున్ మఱియొక్కమా; ఱిటుల నెన్నేబాధలన్ బెట్టినన్
తగ్గంబోరు, కళన్ దొఱంగరు సముత్సాహంబు దీపింపఁగన్. 92

వ. అప్పు డచటి కేతెంచినవా రంద ఱయ్యాలజడిం జూడఁజాలక
పరస్పరం బతిరహస్యంబుగా నిట్లనుకొనిరి. 93

సీ. చతురంబురాశివేష్టితమహీవలయ సం
రక్షణైకవ్రతదీక్షితుండు
నిర్మలకీర్తిచాంద్రీపూరసాంద్రీకృ
తాచ్ఛాచ్ఛకాంతిదిగంతరుండు
అవిరతనానావిధాన్యూనయజ్ఞావ
భృథశిరస్స్నానపవిత్రమూర్తి
శ్రితజనసముదయేప్సితకార్యనిర్వాహ
కరణప్రశస్తకంకణధరుండు

తే. నవితరప్రాణిలభ్యమహావిభూతి
ననుభవించినయట్టి రాజాధిరాజు
తలవని తలంపుగా నిట్టి దైన్య మందెఁ;
గాలమహిమను రాయంచ కాక మయ్యె. 94

ఉ. కూటికి లేకయా? తలఁప గుడ్డకు లేకయ? సార్వభౌముఁ డే
పాటను నెవ్వరుం గనని పాటుఁ గనెం బదిమందిలోన; నీ
కాటక మెట్లు చూడవలెఁ? గాదనఁగూడదు; బ్రాహ్మణుండు క
ర్కోటకుఁ డెంతకైనను దెగున్ భగవంతుని లెక్కసేయునే? 95

సీ. అలవోక వచ్చు బ్రాహ్మణుఁ డంచు మది నున్న—
నర్ఘ్యపాద్యము లిచ్చి యంపరాదె?
పోనున్నవానినిఁ బోనీక బ్రతిమాల
నేటికిఁ? దత్ఫలం బింత జేసె;
నరయ నెందైనఁ బుణ్యమునకుఁ బోవఁ బా
పము తప్ప దనుమాట పాటియయ్యెఁ;
దనకుఁ దాఁ దగిలించుకొనె నుచ్చుఁ జేసేఁతఁ;
గడ కేఁగు కర్మంబు కాలిపైకిఁ

ఆ. దెచ్చికొనుట యిట్టిదే కదా! మన మేమి
సేయఁగలము? తేనిచేయి జారె;
ననుచు హితపురోహితామాత్యముఖ్యులు
మనసు ఱాయిఁ జేసికొనిరి తుదకు. 96

ఉ. నెత్తురు లుబ్బటిల్ల ధరణీసురుఁ డామిథునంబుఁ గ్రూరుఁడై
మొత్తెఁ; దదీయదేహములు పూచిన మోదుగులయ్యె; నంత న
య్యుత్తమపుణ్యదంపతుల యూర్జితధైర్యరసానుభూతికిం
జిత్తములోన నచ్చెరువుఁ జెంది తలంచె మునీంద్రుఁ డీగతిన్. 97

శా. అల్లాడించితి దుర్గమాటవుల, నిద్రాహారముల్ లేక శో
షిల్లం జేసితి, సిగ్గుచేటగు పనుల్ సేయించితిన్, నెత్తు జొ
త్తిల్లం గొట్టితిఁ, దిట్టితిం, గినిసితిం, ధిక్కారముల్ సల్పితిం,
గొల్లం బెట్టితి నెల్లసంపదలు; సంకోచింప రింతేనియున్. 98

శా. కష్టాలైన సరే, పరాభవము లెక్కంబెట్ట, రైశ్వర్యము
న్భ్రష్టంబైనను జింతసేయ; రతిదైన్యం బందియుంగూడ సం
తుష్టిం జూడఁ గొఱంత లేదు మనమందున్; ధైర్యసారోజ్జ్వలా
వష్టంభంబు లవెట్లు వీరలకు సంప్రాప్తించెనో! చిత్రమా. 99

ఉ. వీరికి సాటి లోకమున వీరె నిజంబుగ; నిట్టివారి నేఁ
గ్రూరుఁడనై కఠోరముగఁ గొట్టితి, బాధలఁ బెట్టితిం; దురా
చారుఁడఁ, బాపవర్తనుఁడ, సజ్జనఘాతిని, మంచిచెడ్డ లిం
తారయ నైతిఁ; జేతు లెటు లాడెనొ? వీరల బాధఁ బెట్టఁగన్.

ఉ. పాడుకరంబు లెంతటికిఁ బాల్పడెఁ? ఘోరకిరాతవృత్తి గో
డాడఁగఁ జేసినాఁడఁ; దగవా పగవారికినైన? దేవుఁ డు
న్నాఁడుగదా! సమస్తము గనం గను లింతలు దాల్చి; యెంతపో
రాడిన నాకెకాని మఱి యాఱడి; వీరు చలింప రింతయున్. 101

ఉ. కాదిఁక వీరి లోఁబఱుపఁగా భగవంతునకైన; బాపురే!
నాదు మనంబె యాఁచికొనినా రనినన్ మఱి వీరితాల్మి బ్ర
హ్మాదులకైన నెన్నఁదరమా? పరమాద్భుత మయ్యె వీరి ప్రే
మాదరభావముల్; గుఱి యనన్యమహామహిమానుభూతికిన్. 102

మ. పరమానందము నొందితిన్, సుగుణసంపత్తిన్ బరీక్షించితిన్,
గరుణాబంధుర మయ్యె నాహృదయమున్; గల్యాణలీలాపరి
స్ఫురితంబైన తదీయవర్తనము మెప్పుం గూర్చె; నాజన్మసం
స్మరణీయం; బిదిగో! వరంబు లిడి సంభావింతు వేయేటికిన్. 103

వ. అని తలంచి రథావతరణం బొనరించి, తన్మూర్ధంబుల రజ్జుబంధంబులు విడిపించి, చలువచూడ్కులం బరఁగించి, యలసితిరిగదే! యని కరంబున శిరంబుల స్పృశించుటయు—నరేంద్రమిథునంబు నిజదేహంబుల నాలోకించి విస్మయం బొంది యిట్లు భావించె.

ఉ. మాయములయ్యె గాయము; లమానుషదేహుల మైతి మేము; శో
భాయుతముల్ స్వరూపము; లపారతపోవిభవం బిదంతయున్;
మాయురె! యిమ్మహాత్ము మహిమం గొనియాడఁదరంబె? యిట్టిభ
ద్రాయితమూర్తికిం గనికరం బొదవం గొదవేమి మాకికన్?

వ. అని తలంచి యయ్యిల్లాలును, మగండును భృగూద్వహశిరో
మణి చరణసరసిజ యుగళంబునకుం బ్రణమిల్లిన, నాబ్రహ్మర్షి
తిలకుండు సుజనాభయంకరంబులైన నిజకరంబులం బట్టి
యయ్యిరువుర లేవనెత్తి వాత్సల్యశ్శీరంబులైన విలోకన ప్రసవ
విసరంబులం గొల్లగాఁ జల్లి చల్లఁజేసి. 106

శా. ఆనందించితి మత్యుదాత్తమగు మీయానప్రభావంబుచేఁ
గానన్ మీ కభివాంఛితంబు లిడఁగాఁ గాంక్షింతు; ముచ్చావచా
నూనంబైన యఖండవైభవమొ? యన్యూనప్రభావంబొ? వి
జ్ఞానాభ్యుల్లసనంబొ? కోరుఁ డెది యైనన్ మీకుఁ జేకూర్చెదన్.

వ. అనినం గుశాన్వయదీపకుం డిట్లనియె. 108

తే. తమ మహోదారమైన వాత్సల్య మనెడి
పెన్నిధి యొకండు మాకు లభించె; నింక
నేమి గావలెఁ? దండ్రి! మా కేమి లోప?
మఖిలమును దానియందు పర్యాప్తమయ్యె. 109

వ. అనిన నవ్వాచంయమిప్రవరుండు బాగు! బాగు!! కుశకులాభర
ణంబా! బాగు! బాగు!! నీపల్కు లమోఘంబు; లింక శేషితం
బగు దీక్షావిధి గంగాతీరంబున ముగింపఁగలము; మీ రీదినం
బంతయు నింటనే సుఖం బుండి యిష్టాన్నసంతుష్టులరై యుండి
మఱునాఁ డరుణకిరణబింబం బుదయకుధరశిఖరాగ్రం బధిష్ఠించు

నాలోన వచ్చి మమ్ము దర్శింతురు గాక; యని పల్కి తత్క్షణంబ యంతర్హితుండయ్యె; నంత నెల్లవా రచ్చెరువు నొంది తమలోఁ దా మిట్లనుకొనిరి. 110

మ. ఇది యత్యద్భుతశక్తి; చేఁ దగులఁగానే మాయమైపోయె నా
పదమస్తంబుగ నున్నగాయములు; కోపం బట్లు, శాంతం బిటుల్;
మొద లాపెద్దల చిత్తవృత్తు లిటులే పో! ఘోరనిర్ఘాతపా
తదశం దాల్చెఁ గఠోరవృత్తి, నవనీతంబౌ దయం బూనినన్. 111

ఉ. ఇంత యనుగ్రహించు నని యెవ్వ రెఱుంగుదు? రల్పబుద్ధులై
స్వాంతములం దసూయలు పొసంగె; మహామహులైనవారి చే
తోంతరముల్ నిసర్గసదయాభ్యుదయంబులు; గావునన్ నిర
భ్యంతర మింకఁ గోరకయె యన్నియుఁ దాన యొసంగుఁ బేర్మిమై.

వ. అని సంతసింపుచు నందఱు నిజనివాసంబులకుం జని; రంత నా సతీపతులు. 113

క. ఆ దిన మంతయుఁ గడు స
మ్మోదముతో నర్హకృత్యములఁ దీఱిచి దా
మోదరపాదరజఃప్రే
మాదరమేదురవిహారిహృదయులై. 114

క. మృష్టాన్నంబులతో సం
తుష్టాత్మకులైరి; తృప్తితో నిదురింపం
బుష్టి జనియించెఁ దనువుల;
కిష్టాపత్తి యొనఁగూడె నెంతయుఁ బ్రీతిన్. 115

క. మఱునాఁ డరుణగభస్తి
స్ఫురణం బుదయావనీధ్రమున దోఁపకమున్

గరణీయంబులఁ దీఱిచి
నరనాథుం డరిగె నంగనయుఁ దోడుగ రాన్. 116

శా. ఆవాచంయమిసింహునానతిమెయిన్, హారిప్రఫుల్లాబ్జడో
లావేలాతిగ కేళిలాలస మరాళన్ భృంగసంగీతభం
గీవిస్ఫారసరోజరాజి సలిలక్రీడన్మదేభాళి వీ
జూవిజూళితపాపసంగ భవభంగన్ గంగఁ జేరం జనెన్. 117

వ. ఇ ట్లరిగి యందు. 118

సీ. ఒకవంక నైరావతోత్థాత కేళీప్ర
ఘాతపాతమహీధ్రధాతుపటలి
వేఱొక్కెడను సురభిప్రాపితాభీష్ట
సిద్ధిసంతోషితాశ్రితగణంబు
మఱియొక్కయెడ మరున్మహిళావిహారని
ర్గళితభూషానూత్నరత్నరాజి
యింకొక్కచో సారహేలావతీగాన
లీలావినోదకేళీగృహములు,

తే. మఱియొకట సురతరుసుమమాల్యమధుర
సస్పృహాయాతమధుకరోత్సారణ క్రి
యా భయోద్వేగతరళప్రియావలోక
పరిహాసత్కాముకవిలాసభాసురములు. 119

సీ. సుర సిద్ధ సాధ్య కింపురుష గంధర్వ వి
ద్యాధర క్రీడామహీధరములు
శుక కోకిల మయూర సుస్వరానందగా
నానూన మానితోద్యానతతులు

స్నానసంధ్యా ద్యనుష్ఠానపావితముని
గణసేవ్యమాన గంగాతటములు
నతి మనోహారినవ్యస్నిగ్ధగంభీర
నాదమేదురవిమానస్వనములు

తే. అవిరతాగణ్యపుణ్యాధన్యత్వ కృత వి
మానయాన సమానీయమాన మాన
వానురూపాభియాన సమ్మాన నత్వ
రాపరోద్యోగిగణపరిక్రమణములును. 120

మ. పరమర్షుల్, సురసిద్ధసాధ్యులును, రంభామేనకాద్యప్సరల్
సరసాలాపమనోజ్ఞగానములునున్, స్వాధ్యాయముల్, దివ్యసుం
దరహర్మ్యంబులునుం, జలాశయములుం దైవారె నచ్చోటి క
త్తఱి స్వర్గం బరిగాపు వచ్చినటు చిత్రంబుం బవిత్రంబునై. 121

వ. అవ్విశేషంబుల కచ్చెరువొంది యా సతీపతు లిట్లని తలంచిరి.

మ. కలయో? నిక్కువమో? యెఱుంగ మిది; నిక్కంబైన మున్నిచ్చటం
గలవే? యిట్టివిశేషముల్ కల యనంగా నిట్లు సత్యానుభూ
తి లభింపంగలదే? తపోమహితశక్తిం గూర్చె నిమ్మౌని కే
వలవాత్సల్యముననన్ సదేహ సుదురాప స్వర్గసౌభాగ్యముల్. 123

వ. ఇట్లు తలపోయుచుండ, రమణీయ శాతకుంభ స్తంభ సంభరితం
బును, నవనవోద్భూత ధగద్ధగితకాంతిచ్ఛటా ప్రభాసమాన
హేమరజతమయ భిత్తికావిరాజితంబును, వినూత్నరత్నఖచిత
చామీకర విరచిత సువిలస దమందసౌందర్యకందళిత దేహళీ
బంధురంబును, వజ్రప్రభాభాసమాన మహోన్నత బలవత్కవాట
సమన్వితంబును, విచిత్రచిత్రరచనావినోదంబును, రమణీయ కనక

పట్టు పరిచ్ఛదంబును, రుక్మమయస్థూణంబునుం, గమనీయ స్ఫటి కాంతరంబును నై యతిమనోహరంబైన యొక దివ్యభవనంబు పురోభాగంబునం దోఁచిన వా రచటికిం బోయి చూడఁ దదుపరిభాగంబున రత్నపర్యంకంబున మరాళతూలతల్పంబున శయనించి నిద్రాసుఖం బనుభవించుచున్న యా భృగువంశ పుంగవుం గని యమందానందకందళితహృదయారవిందులై చూచు చుండ నా భృగుప్రవరుం డమ్మేడతోడన యంతర్హితుం డయ్యెఁ; నంతఁ దత్క్షణంబునఁ దద్విశేషంబు లన్నియుఁ దిరోహితంబు లయ్యెఁ; నంత నమ్మిథునం బిందందుఁ దిరుగుచుండ నం దొక్క యెడఁ గౌశబృసీసమాసీనుండును, జపపరుండును నై యున్న యయ్యతివరు నవలోకించి. 124

క. ఆ నరపాలుం డద్భుత
మానసుఁడై యిట్టు లనియె; మానిని! కంటే!
మానివరేణ్యునిశక్తి య
నూనం; బీ వింత మును గనుంగొన మెందున్. 125

మ. అరయన్ బ్రాహ్మణ తేజముందున సహస్రాంశంబునుం బోల దో
తెఱవా! క్షాత్రము; రాజ్య మేలుట మదాంధీభూతులౌ టొక్కయ
బ్బురమే కా; దఖిలార్థదంబులు తపంబుల్; వానికిన్ బ్రాహ్మ్యవి
స్ఫురణల్ గావలె; నద్ది జన్మశతముల్ పోరాడినం జిక్కునే? 126

తే. ఆ బలంబుననే కాదె? యమ్మునిపతి
చెలువ! యీరీతి నిన్నివిశేషములను
సలుపుచున్నాఁడు తనకుఁ గావలసినట్లు;
కాంచితే? బ్రహ్మమునుల ప్రజ్ఞాబలంబు. 127

చ. అని వచియించుచుండఁగ మహాముని వారలఁ గాంచి యిందు రం
డని కరసంజ్ఞ చేయ వినయంబు భయంబును భక్తి దోఁప నా

యనసవిధంబుఁ జేరి, చరణాబ్జములం గరకింకిణీక్వణ
ధ్వనతరమంజులధ్వనులు గ్రాల గ్రహించి నమస్కరించినన్.

క. మునినాథుఁడు జననాథమి
థునమును దీవించి చలువఁ దోఁగు కనుఁగవం
గనుఁగొనుచుఁ బలికె మధుర వ
చనరచనానూనసుప్రసన్నహృదయుఁడై. 129

తే. మనసు నింద్రియములు మీకు మనుజపాల!
యింత స్వాధీనము లటంచు నెఱుఁగనైతి;
నీ మనోనిగ్రహంబును, నీ యుదార
తయు, సుధీరతయు మహాద్భుతములు గావె! 130

శా. ఎన్నో బాధలఁ బెట్టినాఁడ మిము, నెంతెంతో పరీక్షించినా;
నన్నా! రాక్షసకృత్యముల్ సలిపి, కాయం బెల్ల గాయంబుగా
నెన్నో కొట్టితిఁ; జిన్నవుచ్చితిని; గానీ యొక్క పల్లెత్తుమా
ట న్నీనోట వచింపఁగా విననవాఁడం గాను నిక్కంబుగన్. 131

వ. అని పల్కి తత్సహధర్మచారిణిం జూపి. 132

శా. ఈ కల్యాణి పతివ్రతాతిలక; మీ యిల్లాలిశాంతంబు నే
లోకంబందును గాన; మిట్టి సతి సుశ్లోకాఢ్య లోకోత్తర
శ్రీకల్యాణగుణాభిరామ గృహలక్ష్మిం గాఁగఁ జేకొన్న నీ
కాకల్పస్థిరకీర్తి పెంపెసఁగుఁ గా కాశాంతవిశ్రాంతమై. 133

చ. చలనమునందుఁ జంచలలు చాలవు; తీక్ష్ణతయందు శస్త్రముల్
నిలువవు; వేగమందు స్మరణీయుఁడు గాఁ డలనైన తేయుఁడున్;
బాలఁతుల లక్షణంబు లివి పూర్వయుగంబులనుండి; యీగుణం
బుల కతిదూర మీయమయమోఘపవిత్రగుణంబు లారయన్.

చ. మగఁ డనునాతఁ డన్నిట సమంబుగ మేల్పడియున్ననాఁడు నే
ర్పుగ భయభక్తులున్ వినయముం గనిపించి, దశావిహీనుఁడై
నఁ గడు నిరాకృతిం దృణకణంబుగఁ గందు; రభాగ్యసేవ లిం
పగు నెటు? కామినీప్రకృతులా? దురవాపసుఖైకలక్ష్యముల్.

తే. అట్టి స్త్రీజాతియందునఁ బుట్టి ప్రభుతఁ
బరఁగి, యాగర్భసంతతైశ్వర్య మంది,
రాణఁ బ్రబలి, యీ కష్టపరంపరల భ
రించె; నెంతటిసాధ్వియో యెంచఁ దరమె? 136

వ. కావున నెంతేనియు సంతసించితిమి; మీ రడిగిన వరంబు లిత్తు
మడుగుఁ; డనుడుఁ గుశికమహీపాలుండు. 137

ఉ. అగ్నిసమానతేజు లయినట్టి మహాత్ములు మీరు; ప్రేమ ని
ర్మగ్నులఁ జేసినారు; గరిమన్ దురితౌఘము లెల్ల నొక్కటన్
భగ్నము లయ్యె; నింక నిరపాయుల మైతిమి; త్వత్పదద్వయీ
లగ్నమమై మనంబు పదిలం బగుకంటె నభీష్ట మున్నదే? 138

వ. అని పలికి వెండియు నిట్లనియె. 139

క. ఒక మా టడిగెదఁ గోపిం
పక సెల వీవలయు; మీదు పద్ధతి మా యిం
టికి వచ్చిన దాదిగ నే
రికి గుర్తింపంగరా; దెఱింగింపఁ గదే! 140

తే. ఒకపార్శ్వంబునందె మీ రిరువదొక్క
దినము నిదురించు టాదిగా దేవ! మీదు
చరిత మత్యద్భుతం బగోచరము నయ్యె;
నర్హ మగునేని వివరింపుఁ డయ్య మాకు. 141

వ. అనిన మునికులప్రవరుం డిట్లనియె. సురలు మునులు సురజ్యేష్ఠుం
గొలిచియుండ నొకసమయంబున, 142

తే. భార్గవకులంబునకుఁ గుశవంశమునకు
బ్రాహ్మ్యమును, క్షాత్రమును బరివర్తనమయి
సంకరం బగు నని చెప్పె సరసిజభవుఁ
డొకప్రసంగాన; నే నది యూహఁ దెలిసి. 143

శా. సాగంగూడదు మా కులంబునకు నీ సాంకర్యదౌర్భాగ్య; మే
లాగైనం గుశనాథవంశము సమూలధ్వంసముం జేసినన్
బాగంచున్ వ్రతకైతవంబున నిదే మాయెత్తికో; తప్పు మీ
లో నోరంత కొలంత దోఁచు, మిము నాలో బూది గావించుటే.

తే. కాని యోటమి మాది, నిక్కమగు గెల్పు
మీదియై పరిణమించెఁ జుమీ! మనోవి
నిశ్చలత మాపరీక్షలో నెగ్గినారు;
గాన నేలోకమున సాటి గాన మీకు. 145

శా. ఏపాటన్ మఱిడస్సిరో? విసివిరో? యే చిన్నమాటేనియున్,
గోపంబేనియుఁ, జింతయేనియును మీకున్ సోఁకలే; దెంత ని
ర్లేపంబో? యెటులైన మీకుఁ గలుషాశ్లేషంబుఁ జేకూర్ప నెం
తో పోరాడితి; వజ్రపంజరము లౌనో? యేమొ? మీ చిత్తముల్.

తే. కడఁగి మీయింట నన్నిపోకడలు పోక
కిదియె కద! కారణంబు రాజేంద్రచంద్ర!
యలసిరో? రోసిరో? మీర లడ్డ మెప్పు
డాడుదురో? యడ్డె శపియింత మన్న పూన్కి. 147

శా. ఐనన్ మీహృదయంబు లప్రతిమధైర్యస్థైర్య నైర్మల్యముల్
గానన్ మీకు మదుద్యమాశలన భంగప్రాప్తిగా; దిట్టి ని

ర్మానిత్యంబును, సుప్రసన్నగుణముల్ మా కద్భుతం బయ్యె! న
ద్దానన్ మీకు సదేహనాక విలసత్సౌభాగ్యముల్ సూపితిన్. 148

తే. అట్టి స్వర్గంబుఁ గాంచి బ్రాహ్మ్యమున సస్పృ
హుఁడవు, క్షాత్రంబునను నిస్స్పృహుఁడవు నైతి;
వది యెఱుంగుదు మేము; మీ కట్టి బ్రాహ్మ్య
మమరుఁ దార్తీయపురుషాంతరమున భూప! 149

వ. మఱియు మీ మనోభీష్టంబు లైన వరంబు లేమేనియుం గోరు
కొనుం డిచ్చెద మనినఁ గుశనాథమహీపాలుండు కేల్మోగిచి
సవినయంబుగా నిట్లనియె. 150

తే. ఇంతకంటె మించిన వర మెందుఁ గల్గు?
ననఘ! నాదుసంతతి బ్రహ్మత్వకృతమ
హాత్త్వరూఢంబు, గాథ ధర్మాతిశాయి
గా నొనర్పుఁడు మీయనుగ్రహముకల్మి. 151

వ. అనిన నా బ్రహ్మర్షిశ్రేష్ఠుం డట్లయగు నూరడుము; నీదు మను
మండు బ్రాహ్మ్యధర్మ నిష్ఠుండును త్రైలోక్యపూజ్యుండును నగుననిన
నవ్విభుండు వాఁ డేమికతంబున బ్రాహ్మణుం డగు? న త్తెఱం
గెఱింగింపవే యనవుడు న త్తపోధనుండు 'విను మస్మదన్వయంబున
ఋచీకుం డనువాఁడు నీ పౌత్రిని భార్యగా గ్రహించు; న త్తపో
ధనుండు నిజనందనుండైన జమదగ్నియందు సమస్తధనుర్వేదం
బావహించు; నయ్యది తత్పుత్రునియందు ఫలించు; నదియంతయు
సకలక్షత్రియక్షయకారియైన దైవంబుకృత్యంబు. తత్కారణంబున
ఋచీక గాధివధూ జన్మానుష్ఠాన పరివర్తనంబు గలుగు; నది కార
ణంబుగా మహోగ్రక్షాత్రధర్ముండగు పరశురాముఁడు జమ
దగ్నికిం, బరమ బ్రాహ్మణ్యగణ్యుండైన విశ్వామిత్రుండు గాధికిం
జనియింతురు; బ్రహ్మవాక్యంబులు యథార్థంబులు; యుష్మ

ద్వంశంబు భృగువంశసంబంధంబుకలిమి సమస్తజనశ్లాఘనీయం బగు; మే మింకఁ దీర్థంబునకుం జనియెద; మీరు సుఖవై యుండు' మనిన నప్పుడమిపతి సకళత్రంబుగా సవినయవిశేషంబగు వందనం బాచరించి వీడ్కొని చనియె; చ్యవనుండును నిజేచ్ఛం జనియె; నిది పరశురామ విశ్వామిత్ర జన్మప్రకారం బని పల్కె చతురాననుండు. 152

—. ఆశ్వాసాంతము .—

మ. తనయ న్యస్త సమస్తరాజ్యభరవృద్ధక్షత్ర సంసేవ్య పా
వన వన్యవ్రత ధన్య యావనవయోవస్థా! మహీయస్తరా
ఘు నిరాసప్రతిపాదితాద్భుత పరాగశ్రీపదాబ్జద్వయా!
దిననాథాన్వయవార్ధి శీతకిరణా! దీనార్తిసంతారణా! 153

ద్రుతవిలంబితము. శరధిబంధనసారమహోజ్జ్వల
చ్ఛరధి! దానవసంఘవినాశ దు
ష్పరిధిసన్నిభచాపసుధీ! ప్రశాం
తిరథి! దాశరథీ! కరుణానిధీ! 154

భుజంగప్రయాతము. ఘనద్యోధునీ సూతికాగేహ భూతాం
ఘ్రి నీరేజ! శ్రేయోగరీయో మహారాజా!
అనేక త్రిలోకీచయావిష్క్రియా సా
ధనీభూత నాభీనద శ్వేతపద్మా! 155

గద్యము

ఇది శ్రీరామచంద్ర కరుణావిభవ కవితానుభవ
శివార్యతనూభవ సుధీజనవిధేయ సుబ్ర
హ్మణ్యనామధేయ ప్రణీతంబైన
బ్రహ్మతేజోబలంబునందు
షష్ఠాశ్వాసము.

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణే నమః.

# బ్రహ్మతేజోబలము

లేక

# విశ్వామిత్ర చరిత్రము

## సప్తమాశ్వాసము

శ్రీమధురమంజుభాషా
వ్యామోహితసకలలోక! వనజాసనము
ఖ్యామరవినుతపదాబ్జా!
సామజవరదా! శ్రితప్రసన్నముఖేందూ! 1

వ. దేవా! యవధరింపు మవ్విధంబున. 2

తే. గాధినందను జన్మప్రకార మెల్లఁ
దెల్పి, పంకజసూతి యాదిత్యవరులఁ
గనుఁగొని వచించె మధురసాక్రాంతక్రమ
వచనరచనావినోదవిభ్రమము దనర. 3

క. అక్కతన గాధిసూతికి
నిక్కము బ్రహ్మత్వసిద్ధి నెఱవేర్పనిచో
దక్కవు జగములు; వాఁడే
టక్కుటమారములకును దడంబడఁడుసుఁడీ! 4

శా. మీ రెంతెంతగ విఘ్నముల్ సలిపి యేమీ? తన్మనస్థైర్యమున్
గోరంతైనఁ జలింపఁజేయఁగలరా? క్రొంగ్రొత్తలై తన్మహా
ధీరత్వంబు క్రమక్రమంబున సముద్దీప్తంబు గాఁజొచ్చె మీ
పోరాటంబుల కంత కంతకును నిర్మూఢాహిచందంబునన్. 5

—. బ్రహ్మదేవుండు విశ్వామిత్రునకు బ్రహ్మర్షిత్వం బొసంగుట .—

వ. కాన వాని కభీష్టసిద్ధిఁ గావింపకున్న నేఁటితో వాఁడు జగంబుల
ముగించు; నిది మీకును దోఁచిన తెఱంగ యగు; నిఁక నాలస్యం
బేల? యని నిజవాహనంబును మనంబునం దలంచినంత. 6

సీ. ఆపాండులలిత దేహమరీచికాంతులు
భూనభోంతర మెల్లఁ బొలుపుఁ గొలుప
సుస్నిగ్ధగంభీర సుమధురోదీరిత
కలరవంబులఁ గర్ణములు సుఖంప
విస్తృతస్కంధాగ్ర విన్యస్తసువికస్వ
రమనోజ్ఞకమలాసనము వెలుంగ
లావణ్యగమనలీలాఖేలనములు కాం
తాసంతతికి గురుత్వము వహింపఁ

తే. బరమవాత్సల్యపూరనిర్భరపరిస్ఫు
ర న్మనోజ్ఞ మహీయస్తర ప్రశాంత
శిశిరదృష్టులఁ బరమేష్ఠి చేరఁ బిలువ
వచ్చె వాహీకృతమరాళవల్లభుండు. 7

వ. అంత నద్దేవదేవుండు సర్వలోకాభయదానప్రశస్తతరం బగు
నిజకరంబున నారాజహంసప్రవరు నాపాదమస్తకంబు నివిరి వీపుఁ
దట్టి, యిఁక జాలం బేల? లెండు లెం డని దేవ బ్రహ్మర్షి సుర
సిద్ధ సాధ్య ప్రముఖ మరుద్గణంబుల హెచ్చరించి, నిజవాహనం
బారోహించి చెంగున నభస్స్థలంబున కెగసి. 8

సీ. సురముని బ్రహ్మర్షి సుస్వరోదీరిత
వేదనాదముల నామోద మొదవ
సుర గరు డోరగాసుర సిద్ధ సాధ్య గం
ధర్వులు వెంట సందడులు సేయ

వికసత్కలాప దీపిత మయూరోపరి
శారదాదేవి పార్శ్వమునఁ దనర
రంభాది నిఖిలాప్సరః ప్రపంచిత నవ్య
సుమధుర నృత్తగీతములు మెఱయ

తే. నిఖిలలోకపితామహా! నిర్వికార!
నిగమవేద్య! నిరంజన! నిర్వికల్ప!
యనెడు స్తుతిపాఠములు ప్రతిధ్వనుల నీన
వచ్చె గాధేయుచెంత కవ్వనజభవుఁడు. 9

వ. ఇట్లుచటికిం జనుదెంచి గాధేయుం గాంచి దేవతాగణంబు నుద్దే
శించి విరించి యిట్లనియె. 10

తే. చలనమే లేదు; వీనిదా సాహస మన
వద్య; మరయ నుచ్ఛ్వాసనిశ్వాసములును
గానిపింపవు; శుష్కించి కాష్ఠభూతుఁ
డయ్యె; నే మందు? వీనిస్థైర్యం బదేమొ? 11

శా. ఉద్యద్భానుసహస్ర మొక్కఁ-క్షణమం దుద్దీపితం బైనయ
ట్లాద్యావాపృథివీతలంబుగ మహోద్యత్తేజముల్ నింపినాఁ;
డాద్యోవాహిని క్రాఁగి తెర్లి యెసరైన ట్లుండెఁబో!; వీని నీ
యుద్యోగంబున మాన్పకున్న నఖిలం బుద్భ్రాంతమైపోవదే? 12

వ. కావున నే నింక నీతని కిష్టార్థంబు సంధింతు నని పల్కి, యగ్గా
ధేయు సవిధంబున కరిగి వాత్సల్యపూరిత మృదుమధురవచన
రచనాప్రావీణ్యంబున నిట్లనియె. 13

తే. ఆఁగుము తపంబు వత్స! బ్రహ్మర్షి తిలక!
నీమహోత్తరతపమున కేను తృప్తి

నందినారము, నీకు బ్రహ్మర్షిపద మొ
సంగితిమి దీర్ఘమాయువు సంఘటించి. 14

క. సమరుద్గణంబుగా ని
ట్టి మహత్త్వము నీకు సంఘటించితి; మేలో
పము లే; దఖిలశ్రేయము
లమరున్; సకలంబుఁ గరతలామలకం బౌ. 15

క. అని పల్కు పితామహుని వ
చనములు దేవర్షిదివిజసంఘంబులు వ
ల్కిన పల్కులు గాధేయుఁడు
విని సవినయసంభ్రమములు వెలయఁగ ననియెన్. 16

క. ఆరయ బ్రహ్మర్షిత్వము
నోరిమిమై నిచ్చిరేని యోంకార వష
ట్కారములు, వేదములు నన్
గోరి వరించెడిని మీ యకుంఠితకరుణన్. 17

వ. మఱియు నింకొక్క విశేషంబు మీ రంద ఱాకర్ణింపవలయు. 18

మ. మహనీయుండు తపోగరిష్ఠుఁడును బ్రహ్మక్షత్రవేదజ్ఞుఁడున్,
బహుళప్రజ్ఞుఁ డుదారమానసుఁడు దివ్యబ్రహ్మవిజ్ఞానధూ
ర్వహుఁ డాయత్తమనస్కుఁ డప్రతిముఁడున్ బ్రహ్మాత్మజుం డైన య
మ్మహితాత్ముండు వసిష్ఠుఁ డివ్వరము సంభావించినం దృప్తియౌ.

వ. అమ్మాట లాలకించి దివిజవరు లాశ్చర్యం బంది. 20

తే. అతనిపై ర్విన్నచో విధూమాగ్నిహోత్ర
తుల్యముగ మండిపడుచుండు; తొడరి యిప్పు
డతని నింత సమ్మానించి తనినఁ జాల
యద్భుతం బయ్యె మాకు సంయమివరేణ్య! 21

వ. అనిన విశ్వామిత్రుండు. 22

ఉ. అల్పులమైత్రికంటెను మహాత్ములతోడ నెదిర్చి వైరముల్
సల్పుట మేలు! పేరును బ్రశస్తియుఁ గల్గు; నదే మదీయసం
కల్పరహస్య; మక్కతనఁగాదొకొ? దేవతలార! దుష్కరా
నల్పఫలైకసిద్ధిఁ గననయ్యెను; దీనికి లక్ష్య మాతఁడే. 23

ఉ. ఎన్నివిరోధముల్ గలిగెనే యనుఁ, డెన్నివిధాలఁ బన్నికల్
పన్నితినే యనుం, డెటు లపారమహాహవకేళి సల్పి యె
న్నన్నివిధాలఁ బోరితిన యేని నిజంబు మదంతరాత్మలో
నెన్నఁడు నమ్మహాత్మునెడ హీనపుఁజూపు నెఱుంగనింతయున్.

ఉ. ఆతని లొంగఁదీయుటకునై ప్రయతించి జయింపలేక యె
ట్లీతని గెల్వ నా కిఁక ఘటించు? నటంచు మదంతరాత్మ ని
క్లే తలపోయ, బ్రాహ్మ్యముఁ గడించు మటంచని హెచ్చరించె నా
చేతము; దాని కింతపనిఁ జేసితి; దైవకృపన్ గడించితిన్. 25

మ. ఇఁక నేవైరము లేదు నాహృదయమం; దెట్లెట్లొ యంతర్విరో
ధికదంబంబును గెల్చి బ్రాహ్మ్యఫలసిద్ధిం గంటి; నా యంతరా
త్మకు శాంతంబును, సుప్రసన్నతయు సంప్రాప్తించె; నాతండు దీ
నికి మాఱాడఁడు; వచ్చితీఱు; ననుమానింపంగ మీ కేటికిన్? 26

మ. ఇది ముఖ్యంబగు కోర్కె నాకు; మఱి మీ కిష్టంబె యౌనేని నె
మ్మది సంతృప్తిగఁ బిల్వుఁడాతని; సుసంపన్నం బగున్ సర్వ; మి
ప్డిది మీకుం బరితృప్తిగానియెడ మీయిష్టంబ; మీత్రోవ మీ
యది, మాత్రోవయె మాది; దేవునకె వేద్యం బింక వేయేటికిన్?

వ. అనిన సురాసురమునిప్రముఖు లందఱును విఠాకుఁ జెంది యితని
పట్టుదల యెంతనవచ్చుఁ? దన్నోడించినవాని నివ్విధంబున
సాధింప నెంచుచున్నాఁడని కొందఱును, బగవానిచేతఁ దన

మహోన్నతత్వం బెన్నఁబడుట మన్నన యని చూచు చున్నాఁ డని కొందఱును, విరించివరంబులకన్న నతనిమన్నన యెక్కువగునే? యని కొందఱును, నింతకాలంబునుండి పోరి పోరి యమ్మహాత్ము ననంతశక్తిసామర్థ్యంబులు మహత్త్వసంపన్న త్వంబును జక్కఁగా గుర్తించి యనుభవించెఁ గాన నమ్మహా నీయునియం దేకలక్ష్యసిద్ధిఁ గాంచె; నితని వాక్యంబులు యథా ర్థంబు లని కొందఱును—లోలోఁ దలంచుచు, నింత కితని యిష్టాను సారం బాచరింపకున్న మఱలఁ దపంబున కారంభించి లోకం బులఁ జీకాకుఁ జేయకమానం డని గడగడలాడుచు నాబ్రహ్మ ద్వేషి యగు వసిష్ఠమహర్షి యితనిసమ్మానమ్మున కిచ్చమెచ్చునే? యేమైన నగుఁగా కిది యెట్లైన సాధించి తీఱవలయు నని కృత నిశ్చయులై వసిష్ఠాశ్రమంబున కరిగి యందఱు నేకగ్రీవంబుగ నిట్లు ప్రార్థింపఁ దొడంగిరి. 28

శా. గాధేయుండు మహోగ్రమైన తపముం గావించి బ్రహ్మత్వమున్
సాధించెం; బరమేష్ఠిదత్తవర మిచ్చున్ మెచ్చుకుండెన్; భవ
త్సాధీయఃప్రశమప్రభావమున లక్ష్యం బుంచి మీయం దిడెన్
బ్రాధాన్యంబుగఁ దత్తపఃఫలము దీర్మానింప మాధ్యస్థ్యమున్.

ఉ. కావున మీరు వచ్చి త్వరగాఁ దదభీష్టముఁ దీర్పకున్న స
ర్వావిలమౌ బ్రపంచము; మహాత్మ! తదీయమహాపరాధముల్
భావమునం దలంప కనపాయగతిన్ మముఁ జూచి రాఁగదే
దేవ! మహానుభావ! భవదీయమహత్త్వ మెఱింగె నాతఁడున్.

వ. అనిన నా బ్రహ్మర్షి తిలకుండు. 31

శా. నా కేమున్నది వైర మాతనియెడన్? నాపుత్రు లల్పాయులై
నాకప్రాప్తి వహించి; రాఱడిఁగనెం దా నింతయే; నింద లే
కేకాలంబున బొందివో; దరయ లేరీతత్త్వ మజ్ఞానదో
షాకృష్టిన్; హరియించు వార లెవరో? హంతవ్యు లెవ్వారలో?

తే. కానఁ గర్మానుగుణములై కలిగెడివి శు
భాశుభంబులు; క్రోధరాగాదికములఁ
బురుషుఁ డొందును సుఖదుఃఖభోగముల; నె
వండు కొడుకు? కెవఁడు తండ్రి? సంబంధ మేమి? 33

వ. కావున నే నాతనికడకు నిశ్శంకంబుగా వచ్చెద; మీరు సంశో
చింప నేల? మఱియు నిప్పు డతండు. 34

శా. నిర్వేలప్రతిభుండు నిష్కలుఁడున్ నిర్మానమోహుండు నం
తర్విద్యావిభవాభిరాముఁ డయి యాత్మజ్యోతి వెల్గించెఁబో!
పౌర్వాపర్యదురాసదప్రబల దివ్యబ్రహ్మతేజోబలా
ఖర్వప్రజ్ఞలఁ గోటిసూర్యవిలసత్కాంతుల్ వెదం జల్లుచున్. 35

వ. కావున నమ్మహాత్మునియం దిం కెట్టి లోపంబులును లేవు; పరి
శుద్ధుం డయ్యె; నణుమాత్రం బేని లోటున్న బ్రహ్మతేజంబున
కర్హుండు గాఁడు; భగవానుండైన యబ్జభవుం డెల్ల తెఱంగులం
బరీక్షింపక వరంబు లీయఁ; డమ్మహానుభావుం డాయనకు దివ్య
బ్రహ్మతేజం బొసంగె నన్నంతన నతం డనుపమప్రభావభావితుం
డయ్యె నని యెఱింగితి; నతనికి రాగద్వేషాదులు పరిహీణంబు
లగుటంబట్టియే నాయం దిట్టి సాదరమేదురంబైన భావనైర్మల్యం
బున కాస్పదం బాదవె; నింక నట్టి మహాప్రభావసంపన్నుం జిన్న
పుచ్చిన నా దొక జన్మ యగునే? యని పల్కి వెండియుం గొంత
వడిఁ జింతించి. 36

ఉ. ఏయెడనైన నిట్టిపని కేగురు గావలె; దీనిపేరె పం
చాయతి యందు; రందులకు నర్హులఁ దెల్పెద నేరి కోరి మీ;
కా యహినాయకుం డొకరుఁ, డారవిచంద్రుడు, లగ స్త్యమౌని యే
ధో యొకరీతిఁ బల్కి యిటు దోడ్కొనిరావలె, మీరె పోవలెన్.

క. ఐదవవాఁడను నేనె; స
మాదరణం బొదవ వత్తునంటేఁగదా! మీ
కాదిగు లేమాత్రముఁ బని
లేదు సుఁడీ! తెల్పుచుంటి లేఖాధిపతుల్! 38

వ. అనిన సురపరివృఢు లంతరంగంబుల నిట్లు యోజించిరి. 39

చ. ఒకనినిఁ గోరె గాధితనయుం; డెటులో సవరింత మన్న ని
ష్ఠాకరికి నిర్వు, రిర్వురి కొహో! మఱి ముప్పురు, నల్వు రేవు
రకట! యిదేటిమాట? తను నాతఁడు గోరినఁ దాను వారిఁ గో
రికొనియె; వార లెట్లు వివరింతురొ? యెందఱిఁ గోరుకొందురో?

వ. ఇది పొసంగునో? పొసంగదో? యని తలంచుచు నెట్టకేలకు
వారివారి సమ్ముఖంబులకుం బోయి తమ యాగమనకారణం
బెఱింగించిన వా రొక్కరొక్కరు తమతమ యనుపపత్తుల నిట్లని
వినిపించి; రందు ఫణినాయకుండు. 41

క. నా కెట్లు పొసఁగు నిది? యో
లోకేశ్వరులార! నను విలోకించినచో
మీకే తెలియఁగలదు; భూ
లోకము నా తలలపై నిలుపవలయుఁగదా! 42

తే. ఇది భగవదాజ్ఞ నాకు; నే నే మొనర్తుఁ?
దొలఁగినఁ జరాచరంబులతో సమస్త
మారసాతల మొక్కమా ఱట్టె క్రుంగు;
ననిన మా జాడ లేక వారరిగి రంత. 43

వ. ఇట్లాసురాసురమునిగణంబులు దక్షిణాపథంబునకుం జని, యగ
స్త్యమహర్షి కీవిషయంబు నివేదించిన నతండు. 44

తే. దక్షిణమున భూభారంబు తక్కువగుట
నుత్తరం బెక్కుడౌటచే నొకటఁ గ్రుంగు,
నొకటఁ బైకెగయు నటంచు సకలలోక
నాథుఁడు మహేశ్వరుం డిందు నన్ను నిలిపె. 45

వ. కావున నా కెట్లు రాఁదీఱు? ననిన నిరాశులై దేవప్రవరులు సోమసూర్యులం జేర నరిగి యీ విషయం బెఱింగించి ప్రార్థించిన వా రి ట్లనిరి. 46

మ. ఉదయాస్తాద్రిగమాగమంబులు మదీయోద్యోగముల్ నిత్యముల్
గద! మే మొక్కదినంబు మానుకొనినన్ గాఢాంధతామిస్రముల్
పొదువన్ సర్వము శూన్యమై, సకలజీవుల్ దిగ్భ్రమం జెందరే?
యిది మా కెట్లు సమీకరింపనగు? మీరే త్రోవఁ జూపింపుఁడీ! 47

వ. పరమేశ్వర నియుక్తంబైన యిక్కర్తవ్యంబు మే మెట్లు వ్యతిరేకింతుము? మనిన వారు నోరు మెదుపక మైత్రావరుణిం జేరం జని, యీ యుదంతం బంతయుం దెలిపిన, నాయన గాధేయుం డన్నియు సాధింప సమర్థుండు పొం డనిన వా రాయనపాలి కేఁగి తెల్పిన నా బ్రహ్మర్షిపుంగవుండు. 48

శా. నా లక్ష్యంబు వసిష్ఠునందు కల; దైనం దేనికో? యాతఁ డి
ట్లాలోచించె; సరే! యెదైనను మదీయక్షేమలాభాప్తికే
యౌ లెం; డారవిచంద్రముఖ్యులకుఁ బ్రత్యామ్నాయముం బంపి లీ
లాలోలంబుగ వారి నిచ్చటికిఁ బిల్వం బంపెదన్ జూడుఁడీ! 49

మ. అనుచున్ శాటి, ననేకకోటి జపగాయత్రీసుసంసిద్ధిసా
ధనభూతస్ఫటికాక్షమాలఁ గొని, మంత్రర్షిత్వమాహాత్మ్యమం
దనుసంధించి, ప్రభాకరాబ్జుల కమేయప్రాతినిధ్యంబుగాఁ
బనిచెం; జూపఱ కద్భుతం బొదవ దివ్యప్రాభవం బేర్పడన్. 50

మ. అదె చోద్యం! బవి కాంతిసంతతి నితాంతామ్రేడితంబౌ క్రమా
భ్యుదయంబందుచుఁ బొఱ సూర్యహిమధాముల్ వానినీక్షింపుచున్
మది నాందోళితు లైరి; వీ రెవరొకో? మాకుం బ్రతిద్వంద్వులై
యెదుటుం జూపుచు వచ్చుచుండి రని తా రుద్భ్రాంతచిత్తంబులన్.

వ. అంత నా శాటియు నక్షమాలయు ననుపమప్రభాభాసమానంబులై యతివేగంబునం బోవుటయు నందా శాటి వేఁడివేలుపుచెంత నిలిచినన్ దానియం దాసంజితంబై యున్న లేఖం గాంచి, విప్పి యతం డీరీతిఁ బఠించె. 52

మ. ఇది గాధేయుఁడు భానుమంతునకు నెంతేభక్తిమై వ్రాసికొన్నది, యాహ్వాననిమిత్తలేఖ; యెటులైనన్ మీరు నాయందుఁబూర్ణదయం దాల్తురుగాక, మీ విహితకర్తవ్యంబులం దీర్చఁగా నిదిగో శాటిని బంపినాఁడ నట మీ కేలోటు లేకుండఁగన్. 53

వ. ఇట్లరుణకిరణుండు లేఖం జదివి, యిమ్మాట నమ్మి పోయితి నేని యీ శాటీప్రభావం బెంతవఱకుండునో? పోకున్న నీ మునిగోపి లోకంబు లన్నియుం జీకాకు సేయక మానఁ; డింతకు నన్నాహ్వానింప నేమి హేతువో! యని యాలోచించునాలోనన నా శాటి సూర్యస్యందనం బారోహించి భానుసహస్రప్రభాభాసమానం బగుచుండ, భాస్వద్బింబం బక్రైకృతప్రభాకరబింబంబుముందు కళావిహీనంబై యుండుటం దెలిసి, యిం కెట్లుం బోక తప్ప దని యెంచి సహస్రకిరణుం డరదం బధిరోహించె; నట్లే సుధాకరుండునుం దన చెంత నిలిచిన స్ఫటికమాలికయం దున్న కమ్మఁ జదివి దానిం దనకుఁ బ్రతినిధిం జేసి తానునుం బ్రయాణంబై సూర్యుం గూడి విశ్వామిత్రాశ్రమంబున కరుదెంచె; నిట విశ్వామిత్రుండు. 54

క. తన యోగదండమును జే
కొని యభిమంత్రించి పనిచె 'గురుభూభారం
బును నీవు దాల్చి యురగప
తిని నిట కంపింపు' మని సుధీరత మెఱయన్. 55

తే. వెనుకటివిధాన నొకచీటి వెలయఁజేసి
యశిరయం బని మునిసింహుఁ డానతిచ్చె;
నదియుఁ జైతన్యమును దాల్చినట్లు పఱచెఁ
జూచి దేవగణంబులు చోద్య మంద. 56

తే. తన కమండలువును దీసి, ఘనతపఃప్ర
భావమును నింపి కుంభసంభవునిఁ బంపి
దక్షిణాపథమున నిల్వఁ దఱిమె దాని;
నది మనోవేగమునఁ జేర నరిగె నటకు. 57

వ. ఇట్లయ్యోగదండంబును, గమండలువును నురవడించి తత్తన్నిర్దిష్టస్థలంబులకుం బఱచిన వారును లేఖలం జదివి సూర్యసుధామయూఖుల తెఱంగుననే శంకించి మఱల ధైర్యంబు వహించి యా వస్తువులం దమకుం బ్రాతినిధ్యం బావహింపం జేసి గాధేయాశ్రమంబుం జేర వచ్చిన సురమునిప్రముఖులందే యుండి; రది యొక పెద్దసభ యయ్యె; నంత. 58

మ. ఇఁక బ్రహ్మాత్మజు నవ్వసిష్ఠముని మీకే తత్క్షణం బేఁగి త
ప్పక వెన్వెంటనె తోడితెం డనియె విశ్వామిత్రుఁ; డా దేవతా
నికరం బప్డె హుటాహుటిం బఱచి నిర్నిద్రప్రమోదంబునన్
సకలంబున్ దెలుపన్ వసిష్ఠమునియున్ సంతోషితస్వాంతుఁడై. 59

వ. విశ్వామిత్రాశ్రమంబున కేతెంచె; నిట్లేతెంచిన సభ్యగణంబు నమ్మునీంద్రుండు యథార్హంబుగ గౌరవించె; 60

సీ. సుర సిద్ధ సాధ్య రక్షో యక్ష గరుడాది
పరివృతుండై నిల్చె పద్మయోని
యంతరిక్షమ్మున నత్రి భరద్వాజ
గార్గ్య పైలవ కణ్వ కపిల కండు
జహ్ను గాలవ భృగు చ్యవన మతంగ గౌ
తమ గర్గ శుక జమదగ్ని నార
దాదిక బ్రహ్మవిద్యాపారగులును, బ్ర
హ్మర్షి దేవర్షి రాజర్షి వరులు

తే. కౌశికచ్ఛాత్రగణపరికల్పితముల
రాజిత వ్యాఘ్ర కృష్ణ మృగాజినములఁ
గ్రమచిత్రాసనమ్ముల గాఢకుశబృ
సీ సమూహమ్ములందు నాసీనులైరి. 61

వ. అంత నప్పరమేష్ఠి సభాసదులం గాంచి యిట్లనియె. 62

శా. ఈ గాధేయుఁ డనన్యసాధితతపోహేరాళతం బొల్చెఁ; ద
ద్యోగం బెట్టిదొ! బ్రహ్మతేజమున కర్హుండయ్యెఁ దా క్షత్రియుం
డై గాధాభినివేశ మిప్పగిది ధైర్యస్థైర్యముల్ సాహసం
బీ గాంభీర్యము, నీ తపంబు నెఱుఁగం డెవ్వండు సృష్ట్యాదిగన్. 63

వ. మే మీతనికి దివ్యబ్రహ్మతేజం బనుగ్రహించితి; మైనను నితని
లక్ష్యం బంతయు వసిష్ఠునందు సుస్థిరంబై యుండె; నవ్వసిష్ఠుండునుం
దీనికి సమ్మతించె; మఱియు నిట్టి నిర్ణాయకత్వంబునం దనకు సహా
యులుగ సూర్య చంద్ర భుజగేశ్వర కుంభసంభవులం గోరె;
నక్కౌశికుండును ననన్యసాధ్యంబైన తదానయనంబు సాధించిన
తెఱంగు మీ రెఱింగినవిషయంబె కదా! యిట్లు సమావేశంబైన
దేవ ముని బ్రహ్మర్షి బృందారకబృందంబు లాకర్ణింప నివ్వసిష్ఠుండు
కుశాన్వయావతంసంబునకు బ్రహ్మర్షిత్వంబు స్థిరీకరించుచున్నాఁడు.

గాన సభాసదు లందఱు సావధానులై యాలకింతురుగాక యని పల్కి యంభోజసంభవుండు విరమించె; నంత వసిష్ఠబ్రహ్మర్షి లేచి సభాసదుల నుద్దేశించి యిట్లనియె. 64

శా. నాకుం దండ్రి, జగత్పితామహుఁడు, నానాభూతసృష్టిక్రియా
సాకల్యప్రథమానకీర్తి యగు నీ సర్వేశ్వరుం డన్నియుం
జేకూర్చెన్; మన మింకఁ గౌశికునకుం జేయంగ నేముండు? నా
హా! కల్పద్రు వనుగ్రహించెఁ; దన కేలా యన్యసాహాయ్యముల్?

ఆ. తనతపంబు మెచ్చి దైవతగణముతో
వచ్చి దేవదేవుఁ డిచ్చె వరము;
లిచట నా ప్రసక్తి యేల? నే నెంత? నా
ప్రతిభ యెంత? యితనిభావ మేమొ? 66

మ. భగవంతుండు వరంబు లిచ్చెనఁట! దివ్యప్రాభవోపేతులై
తగుబ్రహ్మర్షులు మెచ్చినారఁట! మరుద్వ్రాతంబు బ్రహ్మర్షి తా
దగువాఁడే యని యొత్తిచెప్పెనఁట! కాదా? చూడుఁడీ! యింతక
న్న గరిష్ఠత్వముఁ గన్నవార లెవ రున్నా రీప్రపంచంబునన్? 67

మ. ఒకకాలంబున నాపయిం దనకు నేదో? కాలకర్మాభియో
గకృతంబై బలవద్విరోధము ప్రసక్తంబయ్యె; బ్రహ్మత్వసి
ద్ధికిఁ దా నర్హతఁ గాంచినంతటనె స్వస్తిం జెప్పి యంతర్విరో
ధికదంబంబున, కీ నెపం బిడి నమం దేర్పంగ నూహించెనో! 68

ఉ. ఇంతటిభార మే నొకఁడనే తల వైచికొనంగలేక, య
త్యంతతపోనిధాన మగు నమ్మునిమాటను గాదనంగ లే
కింతకుఁ బూనుకొంటి నెటులేని ఫణీంద్ర ఘటోద్భవేందు భా
స్వంతులఁ దోడు గైకొని; సభాసదులార! యనుజ్ఞ సేయరే! 69

వ. ఇందు మాధ్యస్థ్యంబు వహించిన మహాత్ముల నెఱుంగనివారు లేరు; ఐనను వారి మాహాత్మ్యంబుఁ దెల్పుచున్నాఁడ. 70

సీ. ఒకఘనుండు త్రయీమయుఁడు, జగద్బంధువు,
మూర్తిత్రయమునకు మూలకంద;
మొకమేటి యమృతమయుండు, చల్లనివాఁడు;
భువనభర్తకు శిరోభూషణంబు;
నొకమహామహుఁడు మహోదధిజల మెల్ల
నాపోశనముఁ గొన్న యనుపమానుఁ;
డొకమహాత్ముఁడు సమస్తకులాచలారణ్య
జలధులతో ధరాతలము మోచు;

తే. నిట్టి ధర్మనిర్ణాయకు లిచట ముఖ్యు
లఁట! జగత్కర్త దీని కధ్యక్షుఁ డఁట! సు
రేజ్య భార్గవులు, మహర్షు, లింద్రముఖ జ
గత్పతులు సభ్యు లఁట! యింకఁ గలదె లోటు? 71

తే. వీరి నందఱ నిట సమావేశపఱుపఁ
గాశికున కొక్కనికె చెల్లుఁగాక యొరుల
కిది వశంబౌనె? దీనిచే నిమ్మహాత్ముఁ
డెంత శక్తిసంపన్నుఁడో? యెఱుఁగరాదె? 72

సీ. ఉదయాస్తశిఖరుల కురుకు నుద్యోగ మే
మెటు వత్తు మని రర్కహిమమయూఖు;
లొకక్షణం బేను లేకున్న విశ్వంభర
క్రుంగదే? యనియె భుజంగవిభుఁడు
నేఁ దొలంగిన వెంటనే యొడ్డగెడ పౌను
త్స్మతలం బనియె నగస్త్యమౌని
యరయఁ దత్ప్రాతినిధ్యమునకుఁ దగు ప్రతి
భావంతు లెవ రీప్రపంచమందు?

తే. వారికర్తవ్యములకు లోపంబు గల్గ
కుండఁ, దనయుద్యమము సెడకుండఁ గార్య
మెట్లు సవరించెనో! వారి నెట్లు గూర్పఁ
గాంచెనో! గాధిసుతుఁ బోలఁగలరె యెందు? 73

చ. తనజపమాల, శాటి_హిమధామ రవిప్రభ లుప్పతిల్లఁ జే
యను, దనయోగదండ మురగాధిపునట్ల మహీతలంబు మో
యను, దనచేతి కుండికయు నన్ని యొకెత్తు నగస్త్యుఁడొక్క_ యె
త్తనెడి తదీయకీర్తి నెనయం దనయద్భుతశక్తి యెట్టిదో? 74

ఉ. అక్క_తనం గుశాధిపకులాభరణంబును గూర్చి యీ యశో
భాక్కు_లహీంద్ర కుంభభవ భాస్క_ర శీతమయూఖు లెల్ల స
మ్యక్కృతధర్మనిర్ణయసమర్థులు తాము సమీక్షఁ జేసి బల్
చిక్క_ని యొక్క_నిర్ణయముఁ జేయుదు; రెల్లరు నాలకింపుఁడీ! 75

వ. అని పల్కి_ వసిష్ఠమౌనీంద్రుండు గూర్చుండె; నంత మనుష్య
రూపం బధిగమించియున్న శేషుండు సూర్యచంద్రాగస్త్యుల
యనుమతిఁ గైకొని తమ నలువురి యభిప్రాయంబులం దాన
యిట్లని వినిపించె. 76

క. అగణితమహిమాస్పదుఁ డఁట!
భగవంతునివలన వరముఁ బడసెనఁట! యెవం
డగుఁ గా దన నే మున్నది?
జగ మెఱిఁగినబ్రాహ్మణునకు జందెం బేలా? 77

మ. మహనీయుల్ జగదేకపూజ్యులును, బ్రహ్మణ్యుల్, వయోవృద్ధులున్
బహుళప్రజ్ఞు లుదారమానసులు దివ్యబ్రహ్మతేజస్స్ఫుర
న్మహిమావిష్టులు బ్రహ్మనిష్ఠులును శ్రీమద్బ్రహ్మపుత్రుల్ మహా
మహు లైనట్టి వసిష్ఠు లర్హు; లిది తీర్మానింప మా బుద్ధికిన్. 78

వ. అని పల్కి యహినాయకుండు గూర్చుండుటయు సభాసదులలో నశిరఃకంపంబుగ మేలు మే లను వాక్యంబు లెగసె; నంత బ్రహ్మర్షి ప్రవరుం డగు వసిష్ఠుండు. 79

శా. చేరం బాఱి కుశాన్వయాంబుధిశరచ్ఛీతాంశుమూర్తిన్ మనం
బారన్ గౌఁగిటఁ గ్రుచ్చె స్నిగ్ధహృదయం బవ్యాజమై ప్రేమవి
స్తారంబై యనవద్యమై యనుపమస్థాయిన్ విడంబింప; ని
ర్వైరుల్ ప్రేమరసప్రసన్నులు గదా! బ్రహ్మజ్ఞు లెప్పాటునన్.

మ. అది యత్యద్భుత మయ్యె నందఱికి; న ట్లాబద్ధశత్రుత్వముల్
గద! యిందుండిన కాకి యం, దచటికాకం బిచ్చటన్ వ్రాల నా
స్పదమే కల్గదు; పచ్చిపూరియును వైవన్ భగ్గునన్ మండుచు
న్నది; నేఁ డీ ప్రణయప్రసన్నహృదయానందంబు లెట్లబ్బెనో! 81

వ. ఇ ట్లాలింగనం బొనర్చి బ్రహ్మాత్మజుం డిట్లనియె. 82

శా. నీ యంతఃకరణంబు సర్వవిధులన్ నిష్కల్మషం బయ్యె; వ
హ్వా! యత్యద్భుత మయ్యె నామదికి బ్రహ్మర్షీ! భవచ్ఛక్తి; యా
హా! యోంకారవషట్కృతుల్ శ్రుతులు దివ్యబ్రహ్మతేజంబు దీ
ర్ఘాయుశ్శ్రేయములున్ వరించెఁగద! నిన్నాచంద్రతారార్కమున్.

ఉ. హర్షవశంబుఁ జెందిరి మహర్షి సురాసురముఖ్యు లెల్ల; బ్ర
హ్మర్షికులావతంస! భవదన్యుల కందునటయ్య! యీ దురా
ధర్ష తపఃక్రియాపరిణతం బగు బ్రాహ్మణతేజ; మెంత సం
ఘర్షణ మయ్యె? నౌర! మునుఁ గాన జగాన భవత్సమానునిన్.

ఆ. ఎల్లలోకములకు నిష్టార్థము లొసంగ
దక్షుఁ డీజగత్పితామహుండు
భద్రమూర్తి నీకుఁ బ్రపితామహుం
డఁట! తపోనిధాన మైతి వీవు. 85

ఉ. ఎంతటికోప! మెంతదుడు! కెంతటితొందరపాటు? వాని నే
క్రంతన సాఁగనంపితివొ? కాని, కడుంగడు దూర మున్న దీ
శాంతికిఁ బూర్వవైఖరికి; సంయమిచంద్ర! బలే! దిగంతవి
శ్రాంతి వహించెఁ దావకయశంబు భృశంబుఁ బ్రశంసనీయమై. 86

వ. అని యిట్లత్యంతాదరంబు దోఁపఁ బల్కుచుండ సర్వజను లాశ్చర్యముగ్ధు లగుచుండి; రంత విశ్వామిత్రమహర్షి వసిష్ఠభగవానుస ప్రదక్షిణంబుగా నమస్కరించి యిట్లనియె. 87

శా. ఆకంఠంబుగ మీగృహంబునను మృష్టాన్నంబులన్ మెక్కి నే
మీకే ద్రోహ మొనర్చితిం దుదకు; స్వామీ! యిట్టిదుష్టాత్ముఁ డే
మీ? కారుణ్య రసైకపాత్ర మగుటేమీ? యద్భుతంబయ్యె; మీ
శ్రీకల్యాణగుణంబు లెంత యని వర్ణింతుం దయాసాగరా! 88

శా. మీకల్మాషినిఁ గొంటి, గెంటితి, ననిన్ మీపుత్రులం జంపితిన్,
బాకుం గ్రుచ్చినయంత బాధపడియుం బల్లెత్తు మా టంటిరే?
మీ కేఁజేసినద్రోహముల్ దలఁచినన్ మీకంటె శాంతాత్ముఁడున్,
నాకంటెం గలుషాత్ముఁడుం జగములం గాలించినం జిక్కునే? 89

వ. అని వినమ్రభావంబునం బలుకుచున్న గాధేయుం గాంచి మైత్రావరుణి సాదరమేదురంబు లగు వచనంబులతో నిట్లనియె. 90

చ. అది యొక కాల; మప్పటికి నయ్యది కాఁదగి కాలకర్మముల్
గదిసిన కారణంబుననె కల్గిన దట్టి యవాంతరంబు; నీ
వది మది నుంచుకోవలవ; దన్నిటికిం బరమేశ్వరుండె సు;
మ్మొదియొనరింపఁగాఁ బురుషుఁ డెవ్వఁడొకో? కుశవంశభూషణా!

శా. నే నీవేవురఁ జంపినాఁడ ననిగానీ, వాఁడు నన్నొంచె నం
చేనిం బల్కుట లేనిపోని భ్రమగానీ సుంత యోజింప నె

వ్వానిం బంపఁ డెవండు, చంపఁబడఁ డెవ్వం; డంతయుం దైవమా!
యానైపుణ్యవిలాసవైఖరుల మిథ్యారూపవిభ్రాంతియే. 92

మ. అరయన్ నీవు నిమిత్తమాత్రమెసుమా! యల్పాయువుల్ గానఁజ
చ్చిరి నాపుత్రులు నూర్వు రొక్కమొగి; నీచేఁ జచ్చినా రన్న దు
ర్భర దుర్వార దురంత దుర్యశము నీపైఁ గ్రమ్మె; నీపుత్రు లె
ల్లరు నాచేఁ దెగినట్లుకాదె? మఱి యేలా వట్టికర్తృత్వముల్? 93

మ. పిడుగుం బోలిన పుత్రమారణము నే విన్నప్పు డెన్నెన్నో పో
కడలం బోయితిఁగాని యెప్పు డయినం గాసంత నీపై నిఁ దుం
దుడుకుల్ సేయఁదలంపఁ; బూర్వకృతమౌ దుష్కర్మ మీరీతి నా
కడుపుం గాల్చిన దంచు నెంచితిని; నిక్కంబింతయుం గౌశికా! 94

తే. ఎవరికర్మంబు నెనసి వా రేఁగుచుందు;
రరయ సుఖదుఃఖములకు నయ్యదియ హేతు;
విట స్వతంత్రులు లేరు? నీ కేల చింత?
నియతిఁ దప్పింప శక్య మౌనె తలంప? 95

వ. నా యాలోచించిన భావంబు లన్నియు నీ హృదయంబునం బదిలం
బులై యుండ నేయున్న; వే నెఱుంగుదు; నట్టి యమోఘతమం
బైన విమలభావంబు భావంబునం బాదుకొల్పిన కతంబున నే
యంతటి యనన్యలభ్యంబైన మహత్తరేప్సితార్థంబు నీకుం గర
తలామలకం బౌటయుం దటస్థించెఁ; గావున నానందరసమయ
ధునీతరంగసంఘుంబుల నోలలాడవలసిన సమయంబున నెన్నఁడో
కడచనిన సంఘటనంబు మనంబునకుం దెచ్చుకొని లేనిపోని
వగలఁ బొగిలి నిర్మలాంతఃకరణంబు దుర్మనాయమానంబు నొన
రింపనేల? నాయనా! యనిన గాధేయుండు. 96

ఉ. ఏపున మీపయిం దొడరి యెంతటి ద్రోహము లే నొనర్చినం,
బాపము లెన్ని చేసినను బ్రహ్మవిదగ్రణి! యింతకున్ శుభ
శ్రీపరిణామహేతువయి చెన్నలరారెం దుదిన్ 'వరం విరో
ధోఽపి సమం మహాత్మభి'యటన్న బుధోక్తి యథార్థమారయన్.

వ. మఱియు. 98

క. పగచేతనైన నగణిత
మగు భక్తి వహించి యైన హరిం దలంచినచో
నగు శ్రేయఃప్రాప్తి; యదే
పగిదిన్ మీపైని పగ శుభప్రద మయ్యెన్. 99

తే. మాకు మూలపురుషుండైన యాకుశావ
నీపతికి—మీకు—జనకుండు నిఖిలలోక
కర్తయే కద తాత! నిష్కారణముగం
గలిగెను గుటుంబకలహంబు కర్మవశత. 100

వ. దీని కంతకు మదీయాజ్ఞానవిలసితంబ కేవల కారణం బని
వెండియు. 101

ఉ. కీడు భరించి న న్నిటులం గేవల సత్కరుణావలోకన
క్రీడం గఱంచి, ప్రేమం దులకించిన యింతటి శాంతమూర్తి యీ
రేడుజగంబులం గలుగునే? యనుచుం గదియించె నొందలన్
మోడుపుం గేలుదోయి,యరమోడుపుంగన్గవ నశ్రులొల్కంగన్.

వ. ఇత్తెఱంగున నత్తాత మనుమలచిత్తంబు లత్యంతప్రేమరసా
యత్తంబు లగుచుండ నందఱికిం జూడ వేడుక యయ్యె; నంత
నర సురాసుర గరుడోరగ యక్ష రక్ష స్సిద్ధ సాధ్య కిన్నర
కింపురుషవర్గంబును, బ్రహ్మర్షిగణంబును—వసిష్ఠవిశ్వామిత్రులను

జయజయధ్వనుల దశదిశావలయంబునం బ్రతినినాద మేదురం
బుగాఁ గొనియాడఁ దొడంగె. 103

తే. జయ జయ వసిష్ఠ మౌనీంద్ర! జయ కుశాన్వ
యాబ్ధిరాకాశశాంక! జయ ప్రసన్న
శాంతగంభీర! జయ తపస్సమధిగతని
జేప్సితబ్రహ్మతేజఃప్రహృష్టహృదయ! 104

మ. అనఘంబై యఖిలార్థసంజనకమై యవ్యాహతంబై నమ
జ్జనసంరక్షణదక్షమై సువిలసత్సామర్థ్యమై లోకపా
వనమైనట్టి సనాతనాద్యతనదివ్యబ్రహ్మతేజోద్వయం
బనుకూలించెఁ బరస్పరం; బిఁక జగం బానందముం జెందెడున్.

మ. అపరబ్రహ్మయశఃప్రశస్తికర మేయాద్ధత్యవిస్ఫూర్తి, యే
దపరోక్షప్రతిభాసమానమగు దివ్యజ్ఞాన—మాసర్వశ
క్తిపరీతంబులు బ్రహ్మతేజములు సంధించెం, బ్రసాదించె వి
ష్టపముల్ మూఁటికి శాంతిభద్రతలు వైశ్వామిత్రవాసిష్ఠముల్.

తే. దైవఘటనావశం బయి యీవిరోధ
మేర్పడియెఁ గాని, వీరల కేమి భేద?
మొక్క తేజంబె రెండుగా నుదయమయ్యె;
నది సమీక్ష నొనర్ప నైక్యము ఘటించె. 107

ఉ. రెండు మొగంబులై పొటమరించెను దొల్లిట బ్రహ్మతేజ ము
చ్చండము గాఁగ బ్రాహ్మమును, క్షాత్ర మనంగఁ; దదాకృతుల్ వసి
ష్ఠుండుఁ గుశుండుఁ; దత్కుశకుటుంబములోపలివాఁడె గాధిపు
త్త్రుం; డల బ్రహ్మతేజ మటఁ దోఁచె నిసర్గగుణంబ గావునన్.

క. అని మనసార సురాసుర
మునిగణము వసిష్ఠగాధిపుత్త్రుల సమ్మో

శన, మా సమరస భావం
బున గన్గొని వేయినోళ్ళఁ బొగడె ముదమునన్. 109

వ. అంత. 110

మ. శమివర్యుండు వసిష్ఠుఁ డయ్యజునకున్ సాష్టాంగదండప్రణా
మము లర్పించి, రవీందుముఖ్యులను సమ్మానించి, బ్రహ్మర్షులన్
మమతం గాంచి, సురాధినాథులను సంభావించి, గాధేయు న
త్యమితప్రీతిఁ గౌఁగిలించి, నిల్వ మిఁక వత్సా! పోయివత్తున్ జుమీ!

తే. అనుచు వాయుపథంబున ననుపమాన
వేగమున యోగశక్తిచే నేఁగి, బ్రహ్మ
ముని సురాసురముఖ్యులు మోము లెత్తి
యట్టి నింగికిఁ జూడ మాయ మయిపోయె. 112

వ. ఇట్లాపురాణ బ్రహ్మర్షిసత్తముండు వియత్తలంబున కెగసి తిరో
హితుండైన సమనంతరంబ సుమనోజ్యేష్ఠుండు గమనోన్ముఖుం
డగుటయు, నవనవోన్మిష దసమ లసమాన బ్రహ్మతేజోవిసర
ప్రసరణాత్యంత దుర్నిరీక్ష్యుండైన—నూతనబ్రహ్మర్షి పుంగవుండు.

ఉ. అంత సరోజసంభవుని యంఘ్రినవాంబురుహద్వయంబు న
త్యంతమృదుస్వభావవినయానునయప్రణయాతిరేకముల్
దొంతరలాడ, భక్తిభరితుం డయి కన్నుల నద్దె; 'గాధిరా
ట్సంతతి నుద్ధరించిన ప్రసన్నసురద్రుమ'మంచు నమ్రుఁడై. 114

శా. దేవా! తావక సత్కృపామృతపరాధీనంబ కాదే? జగ
జ్జీవాఖండతపఃఫలంబు; హరిచే శ్రీకంఠుచే నీగతిం
బ్రోవంగాఁ బడువారు లెక్కకొకరే పో నూటికిం గోటి; కి
ట్లీవై శిష్యము తొల్తనుండియును మీకే చెల్లు లోకాత్మకా!

చ. తపము లొనర్చినార తనఁ బితామహుఁ గూర్చియె; కోరికొన్న య
ట్లపరిమితంబుగా వరము లాదృతి నిచ్చె నటన్న బ్రహ్మయే;
నృపతుల కేని బ్రాహ్మణుల కేని సురేంద్రుల కేని రాక్షసా
ధిపతుల కేని; వారలను ద్రిప్పులు పెట్టెనె యెల్లదేవతల్. 116

ఉ. నీదయకల్మి గాధిసుతునిం బదిలోఁ బదొకండు నాక బ్ర
హ్మాదులె మెచ్చి రన్న సుమహత్తరకీర్తియు బ్రహ్మతేజమున్
బాదుకొనెన్; భవత్పరమపావనసంతతిలోన నేఁ బవి
త్రోదయ మౌటె యెంతఫలమో? భవదీయదయామయక్రియన్.

వ. అనినఁ దపస్వినేత కా భువనైకనిర్మాత యిట్లనియె. 118

ఉ. నాయన! నీదుపుణ్యపరిణామమె నీకు నుదర్కసిద్ధి, య
త్యాయతకీర్తి, జీవకళ లన్నియుఁ గూర్చి మెఱుంగు వెట్టె; నే
నీయెడ నుద్ధరించినది యేమియు లే; దిటు నీవు నాయెడన్
బాయని భక్తిఁ బల్కెదు; భవన్మహనీయతపంబె మూలమౌ. 119

వ. అనిన నద్దేవతాగరిష్ఠున కా బ్రహ్మర్షివరిష్ఠుం డిట్లనియె. 120

ఉ. మీరు వచించుమాట నిజమే; యది కాదనరాదు గాని, నన్
మీఱిన పుణ్యకర్ములు, నమేయతపోధను లెందు లేరొకో?
వారల కేది యింతటి యపారతపఃఫలసిద్ధి? యెంతగాఁ
బోరిన నేమి? శంఖమునఁ బోయక తీర్థము గాదుగా ప్రభూ! 121

మ. అని యత్యంతవినమ్రభావమును, మూర్ధాబద్ధపాణిద్వయం
బు, నుదారాశయ వాక్సుధామధురిమంబున్ భక్తిపారమ్యమున్
దొనఁకన్ ముమ్మనుమండు పల్కుటయు సంతుష్టాంతరంగంబుతో
వనజాతప్రభవుండు ప్రేమరసభావస్ఫూర్తిసంపూర్తితోన్. 122

శా. వత్సా! నీ యమృతస్వభావమును, నిర్వ్యాజస్ఫురద్భక్తి, సం
విత్సంపత్తి మదంతరాత్మ విలిచెన్; వేయేల? మున్మిందు యా

వతోస్నమార్కముగా వెలింగెదవు భాస్వజ్జ్యోతిరాకారసం
పత్సిద్ధిం జగదంతసాక్షివయి సప్తర్షీంద్రులం దొక్కఁడై. 123

మ. అని లోకత్రితయాభయంకరణమాన్యంబైన కెంగేల నా
తని మూర్ధంబు స్పృశించి, మైఁ బులకలెత్తన్ వీపుపైఁ దట్టి, రి
వ్వున రాయంచవహుఁడాయి నెక్కి యలయంభోజాతసంభూతి వే
చనె వత్సా! యిఁకఁ బోయివత్తుమనుచున్ సర్వామరశ్రేణితోన్,

తే. చనిన లోకేశ్వరునకు లోచనము లొప్పఁ
జెప్పినటు గొంతవడిఁ జూచి చివర కమ్మ
హాత్మ్ముఁ డంత వ్రతితుఁడు గాఁగ నక్కుశాన్వ
యాబ్ధిహిమధాముఁ డుండె నిజాశ్రమమున. 125

మ. జగమం దెల్లెడ సంచరించి, విహితాచారంబులన్ సల్పి, తీ
వ్రగభస్తిప్రతిమానతేజమున విశ్వామిత్రుఁ డొప్పారి స
ర్వగతోద్యన్మహనీయకీర్తి యిరవారం గాంచి జ్యోతిర్మయం
బగుమూర్తిన్ జగదంతసాక్షియగుచున్ వ్యాపించె లోకంబులన్.

— . నివేదన . —

క. అని యుష్మదీయకరుణవ
లనఁ గూర్చితి దీని నాశ్వలాయన సూత్రుం
డను సుబ్రహ్మణ్యాఖ్యుం
డను విశ్వామిత్రగోత్రుఁడను రఘుదేవా! 127

మ. ఇది యుష్మత్కరుణానుషంగికఫలంబే కాని నానేరు ప
న్నది గోరంతయు లేదు; నాకు నలబ్రహ్మర్షీంద్రు మాహాత్మ్యసం
పదకున్ నక్కకు దేవలోకమునకుం బాటింప నేయంతరం,
బది నిక్కంబు; తదీయగోత్రజుఁడనై యాసక్తితో వ్రాసితిన్. 128

—ఆశ్వాసాంతము—

శా. ఆజ్ఞాబద్ధ చలస్వభావగుణ తిర్యగ్జంతు శిల్పక్రియా
భిజ్ఞానీకృత సేతుబంధన యశోభివ్యాప్త లోకత్రయా!
ప్రాజ్ఞక్షత్రియలభ్య భూభరణ జాగ్రత్పాదుకాఖ్యాపిత
ప్రజ్ఞాదాక్ష్యపరార్థ్యధర్మగుణ ధైర్య స్థైర్య శౌర్యోదయా! 129



మ. ప్రతిబింబప్రతిమ స్వపుత్ర పఠిత ప్రాచేతసోత్పాదితా
మృతగానశ్రవణ త్రిలోకవిదిత శ్రీజానకీ పావన
వ్రతశీలత్వ యశఃప్రభా ధవళిత బ్రహ్మాండభాండోదరా!
సతతానేక జగత్త్రయీభరణదీక్షాశిక్షితాత్మోదరా! 130



క. తిర్యగ్జంతువశీకృత
పర్యాప్తధరాతలాధిపత్యముఖమహా
కార్యసమీకరణచణా
వార్యప్రతిభా! రవిప్రభా! పరమశుభా! 131



గద్యము

ఇది శ్రీరామచంద్ర కరుణావిభవ కవితానుభవ
శివార్యతనూభవ సుజనవిధేయ సుబ్ర
హ్మణ్య నామధేయప్రణీతంబైన
బ్రహ్మతేజోబలంబునందు
సప్తమాశ్వాసము.

సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

# సవరణ పట్టిక

| పుట. | పద్య. | పంక్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|---|
| 33 | 175 | 3 | పదాశ్రయంబు | దదాశయంబు |
| 66 | 56 | 1 | జేర్చి | బేర్చి |
| 69 | 77 | 1 | దెలిపినాఁడను | దెలిపినాఁడమ |
| 71 | 88 | 4 | కెప్పు డప్పు | కెప్పు డెప్పు |
| 76 | 115 | 4 | విల్చిన | విల్విన |
| 103 | 51 | 3 | వర్ధముల్ | నర్థముల్ |
| 105 | 62 | 5 | స్మతియు | స్మృతియు |
| 128 | 46 | 2 | ధరోరీచక్ర | ధరోర్వీచక్ర |
| 169 | 41 | 4 | దోషంబున | రోషంబున |
| 174 | 65 | 1 | బ్రహర్షి | బ్రహ్మర్షి |
| 177 | 83 | 4 | యపాకకృపాబ్ధీ | యపారకృపాబ్ధీ |
| 179 | 92 | 1 | యప్పరమపీంద్రుండును | యప్పరమమునీంద్రుండు |
| 184 | 53 | 3 | విమోన్నతా | విమ్నోన్నతా |
| 198 | 75 | 3 | మహి | మహీ |
| 204 | 106 | 4 | వాత్సల్యశ్శరంబులై | వాత్సల్యశీరంబులై |
| 220 | 35 | 1 | విష్కలుఁడుగా | విష్కలుషుఁడుగా |
| 221 | 40 | 2 | నల్వు రేవు | వల్వు రేవులై |
| 223 | 54 | 3 | అరదం బధిరోహించె | అరదం బవరోహించె |